# భారతి

సాహిత్య మాసపత్రిక
అక్టోబరు 1982



వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

❧

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

❧

అక్టోబరు 1982

సంపుటము: 59 సంచిక: 10

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1982





# చెట్టు ప్రాణం మట్టిలో ఉంది

శ్రీ కె. వి. రమణారెడ్డి

ఊహలో పరవశించేందుకే వలపోతకే గాని
గోటితో గిల్లి హాయిగా మూజూసేందుకు గాదు
ఆకాశ కుసుమాలు.

దేవతా చెట్టుకి మూల్లంతో పన్లేదు.

మట్టిలో పుట్టి పెరిగే మొక్కలకి కాలిపట్టు
చిక్కటి వేర్ల చిక్కిరి బిక్కిరి అల్లికే.

పచ్చటి

గాలినీ వాననీ ఎండనీ మంచునీ తట్టుకొని
కొమ్మలతో సాముజేసి నిండిన పూపిరితిత్తులతో
ఆకుల నాలుకలు విచ్చలించి మాట్లాడుతుంది
గలగలా.

తనలో తాను మునిగి తనతోనే పెనుగులాడుతూ
లోకంతో కలబడి నిరంతరంగా
బహిరంతర యుద్ధం సాగిస్తుంది.

వట్టి ఘనుగడకాదు తనది.

వైరుధ్యాల [illegible] బద్దలను చీల్చి
పిలక రిక్కించి మొలకై మాకై రూపాంతరం పొంది
పరిణామానికి సాక్షిగానే గాక ఫలితమూ అవుతుంది.

లేనిదెక్కడ ? ఎన్నెన్ని వంగడాలకు తల్లి గాలేదు ?
నాచుతో మొదలై మనిషిదాకా విస్తరించింది వంశక్రమం
అమీబా నుంచి అనంతకోటి రూపాల విశ్వరూపం
మహాప్రజాపతి వనస్పతి జగద్ధాత్రి సూక్ష్మాకృతి !

దెయ్యానికి మారుపేరైన 'గాలి' కాదు తనది – మరి
శిశు లలితశ్వాస కోమలి సమాశ్లేషస్పర్శ నెచ్చెలి బాస

ప్రణయ రహస్యం
ప్రభంజన నిర్ఘోషం
పిల్లలిపిల్లి కీచు
కోతి కిచ కిచ
పిట్ట కిల కిల !

పసుపూ కుంకం పెట్టించుకునేది ప్రదక్షిణం
చేయించుకునేది పాలు పోయించుకునేది పూజ
లందుకునేది నోరూ వాయీ లేని సాధుజంతువుల గావు
కోరుకునేదీ చెట్టుకాదు –
చెట్టు గురించి అల్పమతుల క్షుద్రభావం !

శక్తికూడా కాదు, భక్తి
పేరున ప్రతిఫలం కోరే కుయుక్తి !

పిందెలు పండబారేదాకా పిల్లలకోడై కాపాడుకుంటుంది
వెయ్యికళ్ళ చెట్టు.

కొయ్యని పూలు తురుముకుంటుంది
తలలో, చుట్టుకుంటుంది సరాలు మణికట్టుకు, మెడలో
వేసుకుంటుంది గుచ్చని వనమాలలు, అదిమిపట్టుకుంటుంది
అరచేతులతో మత్తుల పొత్తిళ్ళ గుత్తులు, కావాల్నా నీకు ?
సహజ శిల్పాకారాలు కిర్మీరచిత్రాలు 'నానానూన వితాన
వాసనలు'
నయనోత్సవాలు శ్వాసానందాలు ?

అడుగు ! లేదనకుండా ఇచ్చేస్తుంది.
రాలినవాటిని ఏరుకో, నింపుకో సెజ్జ స్వేచ్ఛగా పట్టుకుపో!
ఏమీ అనదు, అన్నా, అన్నది వినబడినా, అర్థంకాదు లే
నీకు.
దండాన్వయం టీకా టిప్పణీ లేని లిపి తెలిని సహజ భాష.
సనాతన మాండలికం – ఇది ఏ పాణినీయానికీ అందనిది.

అయినా తనది మౌనం కానేకాదు
తక్కినవారి కేమీ తెలీని గోల !
సముద్రం ఆటుపోట్లలా

ప్రాగల్భ్యాన్ని వెంబడించే నిశ్శబ్దంలో
పురి విప్పి నర్తిస్తూ 'కే' మనే నెమలి
పొంచుండి తటాల్న పైబడే బెబ్బులి
చిచ్చుకొట్టే తల్లి చక్కిలిగిలి
పెట్టే ప్రేయసి ....
లెక్కలేనన్ని స్ఫురణలు !

చుక్కల దాగుడుమూతలకు ఆటపట్టు
మిణుగురు దీపాల లోగిలి గూటిగుడ్ల గొడుగు
రెక్కలురాని కూనల దుప్పటి పిట్టల యింటి కప్పు.

లేనిదానికోసమని ఉన్నదానితోటి పోరాటాన
పసరాకు మూతి మీసాల కొసలమీద గుండ్రటి
కాయల్ని నిలుపుకునే దర్జా

తేనెవన్నె చిగురు జొంపాలకు
పసిడి చేసే ''హేమతారక విద్య'

వేలాది కిటికీలను తెరుస్తూ మూస్తూన్న హస్తలాఘవం
మబ్బుల్ని దింపి జలధారలుగా కరిగించే జీవ కారుణ్యం
ప్రాణవాయువు నందించి లోకుల్ని బతికించే బోధిసత్వం

పేరెట్టుకోని లోకజనని
బొగ్గుగా మండే ఆత్మత్యాగి !
అయితే -

పీల వేర్లు యిక్కడొక్కటీ అక్కడొక్కటీ
వుంటే
పైకి రాగలదా? చెట్టనిపించుకోగలదా? అల్లుకోకుండానే
సూర్యకాంతి వరద పొంగుని తాగే అబ గుబురుగా

గుమ్మటంలా నిండెక్కి చూలాలు గాకుండా
విసనకర్రల వర్తులాలు వర్తులాలు తెగకమ్ముకోకుండా

నీడెట్టా ? నిలకడెట్టా ?
మనుగడ హాయిహాయి మనిపించేదెట్టా ?
నువ్వేచెప్పు బుజ్జబ్బాయ్ !

గుట్టు నీకే గాదయ్యా, చెట్టుకీ వుందొక్కటి:
ఊహల నెక్కి పుప్పరాన వేర్లులేక వేలాడే వనం
వింత విరుల జాలగీలుతెంచి పరీక్షించినా నీకు

అంతే చిక్కని లోగట్టు
పెరుమాళ్ళకేమోగాని
నేలకు మాత్రం ఎరికే !

బతికి బతికించే చెట్టు కిటుకు మట్టి
పొరల్లో పొరల్లో పొరల్లో లోపల్లోపల వుంది
చిక్కుబడి దాగుండి వెల్లడి కావడం లేదు

నీమీద వొట్టు !
చెప్పింది నమ్ము !

పట్టుకో చూదాం మనస్సుకి పట్టించుకో
వేరు జలనాళికే కాదు

ప్రాణద్రవ వాహిక
కూడా కాదు
ధమనీ కాదు
కాలిపట్టూ కాదు -

చొరబడి చూడు - కనిపిస్తుందో వేడుక
విచిత్రం - ఫలం పుష్పం పత్రం దీర్ఘశాఖా
సహస్రం - వృక్షం ఆపాదవస్తం
బీజంలో గుప్తంగా వుందనుకుంటే తప్పే
బీజానికి గూడా భూమి గర్భాశయం !



# యజ్ఞానికి రండి...

నా ....
గుండె లోపల
గుండెలో ....
ఎఱ్ఱ గులాబీల తోట
పెంచుతున్నాను -
మీకు
కావాలా గులాబీలు
ఇస్తాను,
కానీ
ఖరీదుకు కాదు -
అంతే
అపార్థం చేసుకోకండి
అమ్మ అడవాళ్లు,

నా ....
రక్తం పిండి ....
యజ్ఞాన్ని తలపెట్టాను
ఒకటి, .... మీ
మెదడులను మండించి .... నా
యజ్ఞానికి రండి !
అందుకే
ఎఱ్ఱ గులాబీల తోట
పెంచుతున్నది,
ఖరీదు లేకుండా .... మీ
కిస్తానన్నది.

# అనిపిస్తున్నది అబద్ధం అని...

సూర్యుడు
నల్లబడ్డాడని, చల్లబడ్డాడని
కాదు -
చంపబడ్డాడని,
రోజూ
సాయంకాలం కాగానే అనిపిస్తుంది
నాకు -

చుక్కలు
రాలిపోయినవి, ఆరిపోయినవి
లేదు -
గొంతు నులిమి వేయబడ్డాయని,

రోజూ
ఉదయం కాగానే అనిపిస్తుంది
నాకు -

కాని
అనిపిస్తున్నది అబద్ధం అని ....
నేడు
మధ్యాహ్నం
'సూర్యుడు, చుక్కలు' కలిసి
తిరుగుతుంటే చూసి
తెలుసుకున్నాను.

జనజ్వాల.



# సౌందర్యం - కళలో, జీవితంలో

## "సౌందర్య" పదం

కొన్ని పదములు అనేక నిర్వచనాలకూ వాదోపవాదములకూ ఇతి వృత్తాలవుతాయి. అట్టి పదములు "సోషలిజం", "ప్రకృతి" "లిబర్టి" "సౌందర్యం". లలిత కళల (సాహిత్యం, సంగీతం, నృత్యం, శిల్పం, చిత్రం, వాస్తువు) విషయంలో విస్తారంగా వాడబడే "సౌందర్య" పద చర్చచేయడానికి వ్యాసం పాఠకుల సన్నిధి పెడుతున్నాను.

## పాశ్చాత్య మేధావుల సౌందర్య సూక్తులు

పాశ్చాత్య మేధావులు సౌందర్యమనే పదాన్ని ఎక్కువగా మననం చేస్తూంటారు. వారేమంటారో వినండి.

సోక్రటీసు : ఏది సుందరమో అదే మంచిదైంది.

అరిస్టాటిల్ : సౌందర్యం నిస్స్వార్థమైనట్టిది.

కాన్ట్ : భౌతిక సౌందర్యం అంతస్సౌందర్యాన్ని ప్రతిబింబిస్తుంది.

క్రోచే : సహజ జ్ఞాన ప్రకాశనమే సౌందర్యం.

ఎమర్సన్ : సత్యం, శివం, సుందరంలు ఒకే అనంతం యొక్క వివిధ ముఖాలు.

కీట్సు : సౌందర్యమే సత్యం. సత్యం సౌందర్యం నీకు తెలిసినదింతే. తెలియవలసినదీ ఇంతే.

రస్కిన్ : సౌందర్యంమీది నిస్స్వార్థప్రేమవల్ల మనిషి ఎక్కువ నీతిమంతుడగును.

ఆస్కార్ వైల్డ్ : సుందర వస్తువుల సృష్టించువాడు కళాకారుడు.

షరా : గ్రీకు భాషలో "కలోస్" అంటే సౌందర్యం అని అర్థం. మన పల్లెభాషలో కూడ "మంచి కళగా ఉంది" అంటే సుందరంగా ఉందనే అర్థం.

సంతాయనా : ఒక వస్తు విచ్చే ఆనందం, ఆ వస్తువు యొక్క సౌందర్యం.

షేక్సుపియరు : సౌశీల్యమే సౌందర్యం.

హాజ్లిట్ : సత్యాన్నీ సౌందర్యాన్నీ ధ్యానించి ఆనందించడానికే మనం సృష్టించబడినాము.

ఐన్‌స్టీన్ : జీవితపు టొడిదుడుకులను, ధైర్యంగా ఎదుర్కొనడానికి నాకు తోడ్పడినట్టివి దయయు సత్యం సౌందర్యము.

షరా : ఇది పోతన భావాన్ని పోలుతుంది.

## భారతీయుల "సౌందర్య" భావములు

భారతీయులలో సౌందర్యం గురించిన భావాలు పాశ్చాత్యులందువలె నిక్కచ్చిగ, స్పష్టంగా లేవు. భారతీయుల కళలలో సౌందర్య ప్రసక్తి ఎక్కడెక్కడ వస్తుందో చూస్తాము గాక.

1. రామాయణంలో "సుందరకాండ" ఉంది కదా, దీనికా పేరు ఎందుకు వచ్చిందో అన్న విషయం వివాదాస్పదమయింది. హనుమంతుడు సుందరుడట. "సుందరో వానరః కపిః" ఈ కోతి స్వరూపం సువర్చలకూ, అంజనాదేవికీ (ఆమె గుద్దంటారు) సుందరంగా ఉంటుందనడంలో సందేహంలేదు. హనుమ, ఈశ్వరాంశ సంభూతుడని త్యాగరాజు దారుకేశిరాగంలో ("ఆడ మోడి గలదా....") పాడినాడు. "ఆదికపి" అని "వికటకవి" (వికట అంటే సుందరం అని కూడా అర్థం ఉంది!) చేత పిల్వబడ్డ ఈశ్వరునకూ సుందరుడని పేరు (సుందరేశ్వరుడు).

2. "సౌందర్యలహరి" లో దేవియొక్క బాహ్య సౌందర్యమూ, పరాశక్తి ప్రభావమూ వర్ణింపబడినాయి.

3. "దశరూపకం"లో వివిధములైన ఇతి వృత్తములు పేర్కొనబడ్డ శ్లోకం "రమ్యం జుగుప్సితం...." అని మొదలు పెడుతుంది.

రమ్యం అంటే సుందరమనీ, జుగుప్సితం అంటే గ్రోటెస్క్ అనీ మనం అనుకోవచ్చు.

4. వామనుడనే అలంకారికుడు 'సౌందర్యమలంకారః' (అలంకారమనగా సౌందర్యం) అన్నాడు.

5. జగన్నాథుడు 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యం' అంటూ కావ్యంలో రామణీయకతా భావాన్ని ప్రతిపాదించినాడు. లోకోత్తర చమత్కార కారిత్వమని వివరించినాడు. ఇది పాశ్చాత్యులు సౌందర్యానికి ఆపాదించిన 'యూనివర్సల్' (సార్వజనీనం) తోనూ, ఎడ్మండ్ బర్క్ వ్రాసిన 'సబ్లియిం అండ్ బ్యూటిఫుల్' అనే గ్రంథంలోని 'సబ్లియిం' (మహోన్నత్యం) తోనూ సరిపోగలదు.

6. 'రామ', 'అభిరామ' అనే పదాలూ సౌందర్యసూచకాలు. భయానక, బీభత్సమైన యుద్ధాన్ని తిక్కన 'సంగ్రామంబభిరామంబు' (విరాటప, 1,60) అని వర్ణిస్తాడు.

7. వికట అనే పదానికి అందమనీ, వికారమనీ పరస్పర విరుద్ధమైన అర్థాలున్నాయి. అందం, తద్వికారం అనేవి ఒకే నాణెం యొక్క బొమ్మ, బొరుసులనిపిస్తుంది. 'వికటత్వముదారతా' అంటాడు వామనుడు. 'పదములు నృత్యం చేస్తున్నట్లుందే' అను భావం కలిగించే గుణం వికటత్వమని వివరిస్తాడు.

## సౌందర్య పర్యాయ పదాలు

మన భాషలో 'సౌందర్యం', 'రమ్య', 'రామణీయకం' 'రామం', 'లావణ్యం', 'చారు', 'అందం' అనేవి దాదాపు ఒకే అర్థాన్నిచ్చే పదాలు. పాశ్చాత్య భాషలలో : గ్రీకుపదం 'కలోస్' సౌందర్యార్థకం అని ఇంతకు ముందే చెప్పినాను. పాత ఫ్రెంచి పదం 'బ్యూటి', లాటిన్ పదం 'బెల్లస్' సౌందర్యార్థకాలు. 'బ్యూ' (ఫ్రెంచి ఉచ్చారణ 'బో') అంటే అంత పర్యాయసూచకం కాదు. 'పూలరంగడు', 'రంగేలీరాజా' వంటి అర్థాలువస్తాయి. మనచర్చకు, మన పదమైన 'సౌందర్యం', పాశ్చాత్యపదమైన 'బ్యూటీ' సమానార్థకాలు.

## గ్రోటెస్క్

అందమూ, తద్వికారం ఒకే నాణెం రెండు ప్రక్కలు అన్నాను. ఇటలీదేశపు దేవత జేనస్‌వలె కళకూడ (సుందరం, వికృతి అనే) రెండు ముఖాలుకల్గి ఉంటుంది. హీరో కంటే అంటీ హీరో ప్రసిద్ధుడైనట్లు సౌందర్యం కంటె దాని విపర్యాయమే కళలలో విశ్వరూపందాల్చినట్లు 'గ్రోటెస్క్' వివరణ తెల్పగలదు.

పదునారవ శతాబ్దాన ఇటాలియన్ చిత్రకారుడు రాఫేలు ప్రాచీన రోమక చరిత్రకు సంబంధించిన గుహలను (గ్రొట్టో) పునరుద్ధరిస్తుండగా, అందు మనుష్యులకు జంతువుల రుండాలు, మొండెములూ, జంతువులకు మానవశిరాలూ, దేహాలూ కలశిల్పాలూ, చిత్రాలూ, వీటిని పెనవేసుకొని వుండే అల్లి బిల్లి తీగెలూ పువ్వులు కలిగి అదంతా ఒక చిత్ర కళా సంవిధానంగా బయటపడింది. ఇట్లు 'గ్రొట్టో'లనుండి వచ్చిన కళాభంగిమ 'గ్రోటెస్క్'. అతిలోకమూ, అసహజమయిందీ, హేతుబద్ధం, ప్రకృతిసిద్ధం కానిదీ అయిన వికృతికి 'గ్రోటెస్క్' అను సామాన్యశర్గీకృత నామమేర్పడింది. 'గ్రోటెస్క్' ఆలంకారికమయిన సాంకేతిక పదం. 'సౌందర్యం' ఎదుట అసహజత, అతార్కికత, వికృతి అనే ప్రతిబింబాలేర్పే ఆన తలదర్పణమే 'గ్రోటెస్క్'. గ్రీకు, రోమను, యూదు పురాణాల్లోని ప్రకృత్యతీత గ్రోటెస్క్ పాత్రల నిస్తున్నాను.

| | | |
|---|---|---|
| జెయంట్ | గ్రీకు పురాణపాత్ర | భూమ్యాకాశాల కొడుకు మహాకాయుడు |
| టైటనులు | ,, | మహాకాయులు |
| ట్రైటను | ,, | చేపతోక మానవదేహం కల సముద్ర దైవం |
| సైక్లోప్సు | ,, | ఒంటికంటి మహాకాయుడు |
| ఆర్గస్ | ,, | శతాక్షుడు, మన ఇంద్రునివంటి వాడు. |
| గార్గాన్ | ,, | సర్పకేశియైనస్త్రీ, వికారి |
| స్ఫింక్సు | ,, | స్త్రీతల, సింహదేహం, రెక్కలు |
| సెంటార్ | ,, | మనిషితల, చేతులుగల గుర్రం |
| మినోటార్ | ,, | సగం ఎద్దు, సగం మనిషి అయిన రాక్షసుడు |
| స్కల్లామరియా (కరిబ్‌డిస్) | ,, | స్కల్లా ఆరుతలల రాక్షసి |
| సైరెన్ | ,, | స్త్రీతల, పక్షి దేహం |
| గ్రిఫిన్ | ,, | గద్దతల, రెక్కలు సింహ దేహం. |
| కిమెర | ,, | సింహం తల, మేక దేహం పాముతోక రాక్షసి |

| | | |
|---|---|---|
| సెర్బెరస్ | గ్రీకు పురాణపాత్ర | నరక ద్వారమున కావలి ఉండే మూడు తలల కుక్క |
| హైడ్ర | ,, | ఏనిమిది తలల రాక్షసి దీని తలలు నరికిన మరలా మొలచును. |
| మెర్మైడ్ | జనశ్రుతిగాథ | స్త్రీతల, దేహం, చేపతోక |
| సటైర్ | రోమక పురాణపాత్ర | మేకచెవులు, తోక, కాళ్లు చిన్న కొమ్ములుకల మనిషి ఆకారం |
| జేనస్ | ఇటలీ దేవత | ముందు, వెనుక తల కలిగిన ఆకారం |
| డ్రాగన్ | బైబిల్ పాత్ర | మొసలి లేక పామువలె ఉండి రెక్కలు కలది. దీని ఊర్పులు విషం కక్కును కాళీయుని వంటిది. |
| యూనికార్న్ | ,, | గుర్రపు దేహం, ఒకే కొమ్ము కల జంతువు |
| డెవిల్ | ,, | ఇతడే సైతాను. కొమ్ములు, తోక, చీలిన గిట్టలు కల్గిన వికృతాకారం. |

గ్రోటెస్క్ విలసనం చూస్తాము :

ఉదాత్త భావాన్ని కల్గించేందుకు ఉద్దేశింపబడ్డ వికారం గ్రోటెస్క్ అనవచ్చును. "నాటర్‌డేం గూనివాడు"లోని క్వాసి మోడో పాత్ర, భాగవతంలోని కుబ్జ పాత్ర ఉదాహరణములు. సత్య, శివ, సుందరాల సన్నిహితంగావుండే వికృతులు గ్రోటెస్క్. అశోకవనంలో సీత చుట్టున్న రాక్షస స్త్రీలను వాల్మీకి "సుఘోరా ణాం" అని వర్ణిస్తాడు.

"అద్భుత లోకంలో అలైస్"లో అలైస్ అనే అమ్మాయి ఒక్కతే సుందరం, తక్కిన పాత్ర లన్నీ గ్రోటెస్క్. డాన్‌క్వి గ్జోటు (దీనికి స్పానిష్ ఉచ్చారణ వేరేవుంది) పాత్ర గ్రోటెస్క్‌గా మొదలెట్టి, సుందరంగా పరిణితి పొందుతుంది. ఫౌస్టు పాత్ర సుందరంగా మొదలెట్టి గ్రోటెస్క్‌గా పరిణితి పొందుతుంది.

నాల్గు తలల బ్రహ్మ, ఎనిమిది చేతుల విష్ణువు, ఐదు తలలు మూడుకన్నులు గల శివుడు గ్రోటెస్క్‌లు. వామనావతారం వరకు గ్రోటెస్క్. కామధేనువు, తుంబురుడు, హనుమంతుడు, వినాయకుడు గ్రోటెస్క్‌లు. కబందుడు, శరభం గ్రోటెస్క్‌లు. దాక్షిణాత్య దేవాలయ శిల్పాలలో సరంబీ ఆకారం "యాళి" అనే మృగం గ్రోటెస్క్ కళ. ర్యాలిలోని జగన్మోహిని కేశవస్వామి విగ్రహం అభిజాత్య వర్గానికి (క్లాసికల్) చెందిన శిల్పంకాగా, తిరుపతి వేంకటేశ్వర విగ్రహం "బరోక్" వర్గానికి చెందుతుందని నా ఊహ. శ్రీరంగ రంగడు, పండరీ రంగడు ఒక్కడే అయినా ఒకడు సుందరుడు, ఇంకొకడు గ్రోటెస్కుడు. పికాసో చిత్రాలలో "కపోతం" సుందరం "గయర్నికా". గ్రోటెస్క్‌లు రెండూ యుద్ధ వ్యతిరేకతకై వ్రాయబడ్డవే. గోగోల్, కాఫ్కా, ఎడ్గార్ అలన్‌పో రచనలు గ్రోటెస్క్ పాత్రలను, సన్నివేశాలను కల్గి వుంటాయి. విశ్వనాథ, "హాహాహూహూ", "స్వర్గానికి నిచ్చెనలు", "మిహిరకులుడు", పురాణ వైరముల రచనలు గ్రోటెస్క్ అంశాలు కల్గి ఉన్నాయి. అభ్యుత్థిష్టకారర పాత్రలను గ్రోటెస్క్ క్రిందనే లెక్కకట్ట వచ్చును. మెఫిస్టో ఫెలిస్, సైతాను, కలి, శని, డెవిల్, మారుడు, నిగమశర్మ అక్క ఈ విభాగంలోకి వస్తారు. షేక్సుపియరు పాత్రలు అయాగో, అయాషిమోలు గ్రోటెస్కులు. ఎందుకంటే వీళ్ళు వృథాన్యార్థ భంగకారులు. హాస్య, రౌద్ర భయానక, అద్భుత, బీభత్స రసాలలో గ్రోటెస్క్ కళ ఉట్టిపడుతుంది. డాన్‌క్విగ్జోటు, మంచాసెన్, హండిబ్రాస్ వంటి పాత్రలు హాస్యమును పుట్టించును. గర్గాంట్వా అద్భుత రసమును కలుగజేయును. శకార, గణపతి (చిలకమర్తి నవల పాత్ర), గిరీశంలు జుగుప్సాకర పాత్రలు. సుందర గ్రోటెస్కులు గతానుగతికపద్ధతిలో పయనిస్తూ వుంటాయి. అభిజాత్య కవిత్వానికి తిరుగుబాటుగ గ్రోటెస్క్ అంశకల కావ్యనికోద్యమం వచ్చింది. అభి జాత్య శిల్పానికి తిరుగుబాటుగా బరోక్ శైలి వచ్చింది. రియలిజంకు ప్రతిక్రియగా సర్రియలిజం ఆవిర్భవించింది. చిత్రకళలోని సర్రియలిజం, క్యూబిజంలు గ్రోటెస్కులు. నేటి అసంబద్ధతా నాటకం, పాప్ సంగీతం, ట్విస్ట్ నృత్యంలు గ్రోటెస్క్ తిరుగుబాటులు. సౌందర్యమూ, గ్రోటెస్క్ అభిప్రాయ భేదాలు మాత్రమే. ఏట్సు ఒకానొకనాటకంలోని సంభాషణ వినండి: ఒకపాత్ర ఇంకొక పాత్రతో "ఆదారిలో ఒక ముసలిదాన్ని చూస్తివా?" ముసలిది పోయిన దారినే వచ్చిన రెండోపాత్ర 'లేదే, ఒక యువతిని చూస్తిని. మహారాజ్ఞి వలె నడుస్తూ వుండింది'.

## సౌందర్యం గ్రీకు ఆదర్శం

గ్రీకు కళాధ్యేయం సౌందర్యం. ఇదే పాశ్చాత్య కళల ధ్యేయమైంది. పాగనుల ఈ భావాన్ని క్రయిస్తవ మతం అంత మొందించలేకపోయింది. పాశ్చాత్యులు కళలో సౌందర్యం ఉండా

ఉంటారు. మన కావ్యతత్వం అదికాదు. కావ్యంలో జీవితం ఏది? ఏది ఆత్మ? అనే మనవారు ప్రశ్నించుకొని తమకు తోచిన సిద్ధాంతములు చేసినారు. రస, అలంకార, రీతి, ధ్వని, వక్రోక్తి, ఔచిత్య, చమత్కార మొదలు అయా అంశాలను కావ్య జీవితం, కావ్యాత్మ అన్నారు. సౌందర్యమలంకారః అన్న వామనుడు కూడా రీతిరాత్మా కావ్యస్య అన్నాడు.

కావ్య మీమాంసను భారతీయులు అలంకార శాస్త్రం అన్నారు. పాశ్చాత్యులలో ప్రాచీనులు 'పొయటిక్సు' అంటే, 18వ శతాబ్దపు జర్మన్ వేదాంతి బాంగార్టెన్ 'ఇస్తెటిక్స్' అన్నాడు. ఈనాడు పాశ్చాత్యులు వాడే పదం ఇస్తెటిక్స్. ఇస్తెటిక్స్ అంటే సౌందర్య శాస్త్రం. ఇస్తెటిక్స్ వేఱు, సాహిత్య విమర్శ వేఱు. మనమిప్పుడు చేయబోయేది 'ఇస్తెటిక్సు' చర్చ.

## సౌందర్యం

అంటే ఏమి ?

వస్త్వాశ్రయమా ? ఆత్మాశ్రయమా ?

భౌతికమా ? ఆధ్యాత్మికమా ?

బాహిరమా ? అంతరమా ?

లౌకికమా ? లోకోత్తరమా ?

వస్తు నిష్ఠమా ? లేక ఆ వస్తువుకు మనమిచ్చే విలువయా ?

సార్వకాలిక సార్వదేశీయమా ? తాత్కాలిక ప్రాంతీయమా ?

శాశ్వత ప్రమాణాలు కలదా ? మారుతున్న ప్రమాణాలు కలదా ?

అనే ప్రశ్నలేమో వేసుకొన్నాను, కానీ, సదుత్తరాలీగలనా అనే ధీమా లేదు. అయినా ప్రయత్నిస్తాను. అవధరించండి.

## "సౌందర్య" నిర్వచనం

సౌందర్యమంటే ఫలానా అని సూత్రీకరించడం కంటె, వాల్టరు పాటరు చెప్పినట్లు, సౌందర్య దార్శనికుడు చేయవలసినదేమంటే, ఒక చిత్రం, ఒక ప్రకృతి దృశ్యం, నిజ జీవితం, కావ్యంలోని ఒక చక్కని వ్యక్తి మనకు ఏయే గుణాలవల్ల సౌందర్య భావాన్నీ, ఆనందాన్నీ కల్గిస్తున్నాయి అని విశ్లేషించడం.

ఇటువంటి భావాన్నే కాళిదాస దుష్యంతుడు వెలిబుచ్చుతాడు. రమ్యవస్తువును చూచినప్పుడూ, మధురశబ్దం విన్నప్పుడూ పర్యుత్సుకుడవుతాడట. జననాంతర సౌహృదాలు జ్ఞాపకానికి వస్తాయట. ఇజమేమరి. ఓంకారనాథఠాకూరు పాడిన 'నీలాంబరి' వినండి. సైగల్ 'బాబుల్ మోరా' వినండి. కాళిదాసుని 'రమ్యాణి' సౌందర్యమే.

ఆనంద వర్ధనుని శ్లోకం చూడండి.

ప్రతీయ మానం పునరన్య దేవ
వస్త్వస్తి వాణీషు మహాకవీనాం
యత్తత్ ప్రసిద్ధావ యవాతి రిక్తం
విభాతి లావణ్య మివాంగనాసు

ప్రతీయమానం పునరన్యదేవ, అవయవాతిరిక్తం, లావణ్యం వంటి పరిభాషవల్ల నాకు తోచేదేమంటే, ఈ శ్లోకం కావ్యగత సౌందర్యాన్ని ప్రతిపాదిస్తూ ఉంది అని. 'లావణ్య' పదం కీలకం. భరతుడు చిత్రం యొక్క ఆరు అంగాలలో 'లావణ్యయోజనే' ఒకటి అని చెప్పినాడు. 'లావణ్య' శబ్ద స్వరూపమేమి? లవణం నుంచి లావణ్యం వచ్చింది. లవణం స్ఫటికాలుగా ఉంటుంది. స్ఫటికాలు అంతర్లీన కాంతితో మెరుస్తూ వుంటాయి. ముత్యాలను చూడండి. ముత్యద్రవ్యం లవణమే. ముత్యకాంతి అంతుచిక్కకుండా, ఉండీ ఉండనట్లు మెరుస్తుంటుంది. మనం చూచే కోణం మీద ఆధారపడి వుంటుంది. పాలరాయికూడ ఇట్లే మెరుస్తుంది. ఇట్టి అణగి మణగి మెరిసే కాంతిని ఇంగ్లీషులో 'షీన్' అంటారు. ఓవెన్ డార్ ఫీల్డు కవితలో మనకంతు చిక్కని అంశాన్ని 'ప్రికేరియస్ ఎలిమెంట్ ఇన్ పొయట్రి' అంటాడు. గ్రీకు భావాలబట్టి కలోస్ (సౌందర్యం) లక్షణాలు, ఐక్యం, అవయవాను రూపత్వం, అంగాంగ సంశ్లిష్టత (హార్మని), రూపనిష్పత్తి. వీటిని బట్టి చూస్తే లావొకూన్ శిల్పం, బీథోవెన్ నవమస్వర సమ్మేళనం, యూక్లిడ్ రేఖా గణితం, గ్రీకు ప్రాసదరూపకాలు సౌందర్యం కలవిగా కన్పిస్తాయి. ఈ లక్షణాలున్నందువల్ల ఆయా రచనల్లో సౌందర్యం వచ్చిందా? కళలోని ఒక అనిర్వచనీయమైన అంశమూలాన, ఈయా లక్షణాలు బయటపడినాయా అనుట చెట్టు ముందా విత్తనం ముందా అని యడుగుట వంటిది. సుందరంగా భావింపబడే వస్తువులన్నిటిని ఒక చోట కుప్పవేస్తే సౌందర్యం ఉద్భవిస్తుందని గ్యారంటీనహి. అలనాడు తలిసెట్టి రామారావు గీచిన ప్రబంధ నాయిక చిత్రం కార్టూనగుటకిదే మూలం. తర్వాతి ప్రబంధకవుల నాయికలను అళినీలాలక, కమలాక్షి, చంద్రానన, పల్లవపాణి బిసబాహు, చక్రస్తని, సింహమధ్య, పులిన జఘన, రంభోరు వగైరా వర్ణిస్తే, మొదటి ప్రబంధ కవి యనదగిన తిక్కన, ఆయ

వస్తువుల సౌందర్య సారాన్ని మాత్రమే ప్రోదిచేసి ద్రౌపదిని వర్ణిస్తాడు. నేత్రమ్ము రేకుల మెత్తదనం (పాదం), చక్రవాకంబుల చందంబు (స్తనములు), చందురు నునుగాంతి (ముఖం), అళికులంబుల కప్పు (జడ).

సౌందర్యానికి సార్వత్రిక సూత్ర నిర్మాణం సాధ్యంకాదనీ, ప్రతి కళాఖండంలోనూ వున్న విశిష్ట గుణ విశ్లేషణం వల్లనే సౌందర్య దర్శనమవుతుందని ఈ చర్చా ఫలితం.

## సౌందర్యం వస్త్వాశ్రయమా ఆత్మాశ్రయమా ?

ఒకకొంటె కోణంగి "స్పర్శ కటకంవలె సౌందర్యం చూచే వాని కంటిలో ఉంటుంది" అన్నాడు. దీని ప్రకారం సౌందర్యం ఆత్మాశ్రయం. పర్షియారాజు, మజునూతో లైలాఎంత బాగుందని పిచ్చిపోకడలు పోతావు అనగా రాజా, నీవు నా కండ్లతో చూస్తే కాని నా బాధ నీకర్థం కాదన్నాడట. రోజాపూవు ఎక్కడనో ముళ్ళ పొదల్లో దాగిఉన్నా సుందరమే అని కొందరి వాదం. ఎడారికాచిన వెన్నెల వ్యర్థం వంటి వాదాలు విలువతో ముడిపడినట్టివి. తావలచింది రంభవంటి వాక్యాలు సౌందర్యమాత్మాశ్రయ మంటున్నాయి. నిజమే, అట్లుకాకున్న, అందవికారపిల్లలకు పెళ్ళెట్లగును? సౌందర్యం చక్షుదప్పుం అన్నారు. చప్పట్లు కొట్టిందుకు రెండు చేతులూకావలె. న్యూటను సిద్ధాంతం ప్రకారం రెండు వస్తువులు పరస్పరం ఆకర్షించు కొంటాయి. అయస్కాంత ధ్రువాలకు ఆకర్ష వికర్ష గుణముంది. అలాగే సౌందర్యం ఉందా లేదా అని నిర్ణయించేందుకు ఒక వస్తువుండవలె, ఒక వ్యక్తి ఉండవలె. ఆ వస్తువును ఆ వ్యక్తి సుందరమైంది అని ఎందుకంటాడనేది చూడవలె.

## సౌందర్యం

వస్తు నిష్ఠమా లేక

మనం దాని కిచ్చే విలువయా

అరటి పండుకోసం తీయదనం వస్తునిష్ఠం. "ఎదురాధిపతే రఖిలం మధురం"లోని తీయదనం విలువ (మర్యాద) కోహినూరు వజ్రం దొంగసొత్తుమైననూ బ్రిటీషురాజు తలపై పెట్టు కొంటాడు. వజ్రానికా మూల్యం ఎట్లువచ్చింది? వజ్రాల అరుదువల్ల వచ్చింది. "సుర్బ్రిం గుర్బ్రిం, గుర్బ్రినికి నా రాజ్యం" అని రిచర్డు తృతీయుడన్నప్పుడీ పరిస్థితినే అనుకొనవలె. "మహాత్మ" అను సినిమాలో ఒకసేటు తులసీ రామాయణ పుస్తకాన్ని రద్దీపేపరు వాలాకి రెండు కాసులకిచ్చేస్తాడు. పేపరువాలా, దాన్ని మిటాయి పొట్లాలకమ్మివేయకుండా, కళ్ళకద్దుకొని దేవునిముందసాన ఉంచుకుంటాడు. ఒకడు కిరాట కీచకుడు. ఇంకొకడు భావుకుడు.

సౌందర్యం అనేది ఒక అభిలషణీయమైన దిశను ఎందుకయింది ?

తిలకు "నా కవిత్వం"లో ఇట్లంటారు :

"నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు. నా అక్షరాలు గిరిజాశక్తుల వహించే విజయ ఐరావతాలు. నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు"

శిబితో గ్రద్ద చెప్పిన మాటల మాటేమిటి? శక్తిహీన ప్రజ నెవరు వహిస్తారు? చీకటిలో అసహ్యంచే వికారపిల్ల నెవరు ఒలుస్తారు? అందం, ఆనందం మాత్రమే కవులకు కావలెననిపిస్తుంది. ఉపనిషత్తు కూడ అన్న మయకోశంతో ప్రారంభించి, ప్రాణ, మనస్సు, బుద్ధిద్వారా ఆనందమయకోశం వరకు వస్తుంది. ఆ తర్వాత ఏముంది? అంటే "ఆనందోబ్రహ్మేతి వ్యజానాత్" అని దాటేస్తుంది. కీట్సు "అందమైన వస్తువు సదానందదాయకం" అన్నాడు.

కావ్యం నుంచి వచ్చే ఆనందాన్ని మమ్మటుడు సద్యః పరనిర్వృతయేః అన్నాడు. కావ్యం హ్లాదైక మయీం "హ్లాదం" పదం గమనించండి "హ్లాద" పదం. శబ్దంలోనూ అర్థంలోనూ "గ్లాడ్" పదంతో సమానం కళల్లో ఈ ఆనంద వాదం విశ్వతోముఖంగా వ్యాపించి వుంది. మన అలంకారిక వాదాలనే తీసుకోండి. రసపాక సిద్ధాంతాలు వంట యింటి నుండి వచ్చినాయి. రాగ జీయకతాశయ్యా వాదాలు భోగలాలసత నుండి వచ్చినాయి. అలంకారవాదం దేహాళిమానంవల్ల వచ్చింది. చమత్కారవాదం సర్కస్ నుండీ. మాజిక్ నుండీ వచ్చింది. వక్రోక్తి, ధ్వని వాదములు సగటి వేషగాండ్ల క్రీలాపాలు ఒక్క ఔచిత్య విచారం మాత్రం ఆనందంను ప్రతిపాదింపదు సరికదా సంతోషాన్ని సంహరించే దాకుంది. ఇది కిల్ జాయ్ డికెన్సు పాత్ర గ్రాడ్ గ్రైండ్‌వలె. అత్తపోరు, డ్రిల్ మాస్టరు పీపి లాంటిది. "గ్రండీ పిన్ని ఏమనుకొనేనూ" ! అని జడిపించే తత్వం. మనుషులు తమాషా కథలు చెప్పుకొని తెగ నవ్వుతుంటే. "మాకు నవ్వ లేదు" అని గుడ్లురిమి, బుంగమూతి పెట్టి వాళ్ళను నోరుమూయిస్తుండే విక్టోరియ మహారాణి వైఖరి. నేను గ్రోటెస్క్ పరిభాషలో అలంకారిక వాదాల్ని చెప్పుతున్నాను కానీ వాటిపట్ల నిరసన భావం వల్ల కాదని మనవి.

మీరే ఆలోచించండి. రసం, పాకం పదాలేమిటి? అలంకారం ఏమి? 'పిబరే రామరసం' అట. సౌందర్య రసపిపాసువులట. వీటివల్ల

వచ్చేది ఏమానందం అంటే రసోత్పైసః అట. రసానందం బ్రహ్మానంద సహోదరం అంటారు. అది అలౌకికం అంటారు. ధర్మరాజు కర్ణుడు అన్న అని తెలిసిన తర్వాత ఏడ్పు. పాట్రొక్లస్ మరణవార్త విన్న అకిలీజు ఆవేదన. తానాజీ శవంను చూచిన శివాజీ అంగలార్పు ఆనందకరాలా ? అట్లే అయిన క్షణంలో, ఉత్తరరామ చరితంలో సీతాపహరణ, జటాయువధాది సన్నివేశాల్ని తెలిపే చిత్రపటాలను చూచి సీత ఎందుకు మూర్ఛపోతుంది ? భయానక కరుణలు మనలను బాగా భయపెట్టి, ఏడ్పించి, కడుపుబ్బరం తగ్గించి మన మనస్సులను నిర్మలంగా కడిగివేస్తాయి అనేది అరిస్టాటిల్ త్రాసద సిద్ధాంతం. ఇతని గురువు ప్లేటో సూత్రం - కవులు లఫంగులు. వారు 'ఆదర్శ రాజ్యం' నుండి బహిష్కరింపబడవలెనన్నాడు.

పాశ్చాత్యులలో ఆధునిక కాలంలో జార్జి సంతాయనా, వాల్టర్‌పాటరులు ఆనందవాదులు. ఈ ఆనందం స్వార్థరహితంగా, బహుజన సేవ్యంగా ఉండవలెనంటారు వీరు. కళాభిమానం, దానికోసమే అయివుండవలెనని పాటరు చెబితే 'కళ కళ కోసమే' అని దానికి వక్ర భాష్యాలు బయలు దేరినాయి.

ఏది ఆనందాన్నిస్తుందో అదే సౌందర్యం అనే వాదం కావ్యం పుట్టిన తర్వాతి పరిస్థితికి చెల్లుతుంది. సృష్టి సుందరమయినట్లు, సృజనా సుందరం గావచ్చును. ఆవేశాన్ని శాంతంగా స్మరించుట కవిత్వమని వర్డ్సు వర్తు. శాంతాన్ని ఆవేశంగా వెలిబుచ్చినాడు వాల్మీకి 'మానిషాద'లో దానంతట అదే పుట్టుకవచ్చిన తెలివిడిని (ఇంట్యూషను) ఉత్కృష్ట భావరూపంగా ప్రకటించుటే సౌందర్యమంటాడు క్రోచే. పోతన తాను సహజ పాండిత్యుడనని చెప్పుకొన్నాడు. ఇది ఇంట్యూషనే అని నా భావం. 'నేనలీన' అన్న పోతన ధీమాభావప్రకటనకు సంబంధించినది. నాయనారులు, ఆళ్వారులు, వేమనాదికవులు ఇంట్యూషన్ మీద ఆధారపడి కవిత్వం చెప్పినట్టివారు.

అంగాంగ సాంగత్యం, ఐక్యం కల కళనుండే ఆనందం వస్తుందని బొసాంకెట్ ప్రతిపాదన.

ఆదర్శనమూన అనుకరణ కళ అని ప్రాచీన గ్రీకు తాత్త్వికుడు. అరిస్టాటిల్ సిద్ధాంతం. ఈ లక్షణం గ్రీకు త్రాసదాలకి చెప్పినాడు. అనుకరణ ఎంత దగ్గరగా ఉంటే కళ అంత శ్రేష్ఠంగా ఉంటుంది. 'దశరూపక' కర్త కూడా 'అవస్థానుకృతిర్నాట్యం' అన్నాడు.

ఆధ్యాత్మవాదియైన టాల్‌స్టాయిది వేరు మతం. ఆధ్యాత్మిక, నైతిక భావాలు ఎచట వర్ణింపబడుతాయో, ఎచట పరమాత్మని చిద్విలాసాలు మనిషికి నచ్చచెప్పబడుతాయో అచ్చటే కళ ఉంటుందని టాల్‌స్టాయి వాదం. ఈయన ప్రకారం షేక్స్పియరుకంటె మిల్టనే గొప్పకవి అవుతాడు. టాల్‌స్టాయి 'కళ అంటే ఏమి' అనే గొప్ప విమర్శక గ్రంథంలో బాంగార్టన్ ఇస్థెటిక్ సిద్ధాంతాన్ని విపులంగా చర్చించి కొట్టి వేస్తాడు. తన సిద్ధాంతం ప్రకారం తన రచనల నన్నింటినీ (కాకసస్ బంది, 'దేవునికంతా తెలుసు కాని చూస్తున్నాడు' అనే రెండు చిన్న కథలు తప్పించి) ఖండించి వేసినాడు. ఇట్టివాడు మన ఔచిత్య విచారకర్త క్షేమేంద్రుడు. ఇది వారి నిష్పాక్షికతనూ, మహామనత్వమునూ, సూచిస్తుంది. టాల్‌స్టాయి వాదం మన 'శివేతరక్షతయే'తో సరిపోతుంది.

## సౌందర్యంలో ఆనంద హేతువులు

కావ్యంకానీ, ఏ కళకానీ ఎందుకానందం కలుగజేస్తుంది ? దానికి సౌందర్యం ఉందికాబట్టి, సౌందర్యం ఎట్లా ఉంది ;

విడి విడిగా అర్థం లేక ఉండే వస్తువులు ఒక విశిష్ట భంగిమలో సంశ్లిష్టమైనప్పుడు (కలిసినప్పుడు) సౌందర్యం పుడుతుంది. అసలుకు పుట్టేది కళ. కళ అంటూనే సౌందర్యమున్నట్లే లెక్క. పదం, త్రికోణ బిందు రేఖారంగులు, స్వరం రాయి, కర్ర, లోహాలు, దేహచలనం అనేవి స్వతస్సిద్ధంగా విడివిడిగా అర్థంలేక ఉండే అంశాలు. వీనిని తగుపాళ్ళలో తగురీతిలో కలిపితే, సాహిత్యం, చిత్రలేఖనం, సంగీతం, శిల్పం, వాస్తువు, నృత్యం అనే సుందర వస్తువులు (కళలు) ఆవిర్భవిస్తాయి. భరతుడు చిత్రకళకు ఆరు గుణాలు చెప్పినాడు. అవి రూపభేదం, ప్రమాణం, భావం లావణ్యం, సాదృశ్యం, వర్ణికా భంగం. పాశ్చాత్యులు కూడా ఇవే చెప్పినారు. అన్ని కళల్లోనూ సామాన్య ధర్మం ఒకటుంది. అది లయ. కళలో మాత్రమేమి ? చేతనా చేతన ప్రకృతి అంతా లయబద్ధం. భగవంతుడుకూడా లయబద్ధుడు. సంభవామి యుగే యుగే అంటాడు. సంగీత, సాహిత్య, నృత్య, చిత్ర, శిల్ప, వాస్తు కళల్లో భావలయ, స్వరలయ, చలనలయ, రేఖావర్ణలయ, ఉపరితల లయ, వ్యోమలయ ఉంటాయి. కొండిపర్తి శేషగిరిరావుగారు ఏమంటారంటే అమూర్తాలయిన సంగీత సాహిత్యాల విషయంలో అవే, లయాన్వితములు కాగ, మూర్తాలయిన చిత్రశిల్పాదులు చూపరులను లయాన్వితులను చేస్తాయి అని. కళల్లో లయ అనేది ఊరు మార్గపు రాకపోక కానీ కేవలం కళమీదో వ్యక్తిమీదో ఆధారపడిన గుణంకాదు. ఇది "రెసొనాన్సు", "వైబ్రేషన్"కాదని నా అభిప్రా

యం. ఒక కళ సుందరం, ఎందుకంటే దానికి మనం సౌందర్యం అనే విలువకట్టుతున్నాము. ప్రాచ్యులలో కానీ, పాశ్చాత్యులలోకానీ; ఏదేది మంచిదో అది సుందరం అనుట పరిపాటయి పోయింది. సత్యం, సుగుణం, మాధుర్యం, కాంతి, అమరత్వం వంటివి ఉదాహరణాలు. ఎక్కువ తియ్యనైతే అదీ మొగానికి కొడుతుంది. ఎక్కువ వెలుతురుంటే అదీ ఇబ్బందే రవికిరణం చొరని సముద్రగర్భంలో అద్భుత సుందర జీవరాశి ఉంది. అందరూ అమరులైవుంటే బతుకు తెగ ''బోరు'' కాక తప్పుతుందా ? కాళిదాసుని ''రఘువంశం''లో అజ విలాప సందర్భాన ఒకపాత్ర శరీరికి మరణమే ప్రకృతి. జీవితమే వికృతి అనును. విలువ కట్టడానికి చాలా కారణాలుండవచ్చును. ఆయాకారణాల చేత వారివారికి సౌందర్య దర్శనం అవుతుంది. ఒక పసిబిడ్డకు నల్లగా, లావుగా ఉండే వాళ్ళమ్మ బ్యూటిఫుల్. ''వేయిపడగలు'' లో విశ్వనాథ ఒక కథ చెబుతాడు. అయ్యవారు, పిల్లలను దసరా వేడుకలకు పిల్చుకొని పోతూవుంటే, వరద వచ్చి ఆ పిల్లలు కొట్టుక పోయినారట అది భరించలేక అయ్యవారు తానూ నదిలోదుమికి చనిపోయినాడు. ఈ కథ ఒక పాశ్చాత్యుడు ఇంకొక పాశ్చాత్యునకు చెప్పగా, వాడు ''బ్యూటిఫుల్'' అని మూడు సారులు అన్నాడట. మనమే అయితే పాపం చచ్చి ఏడుస్తుంటే బ్యూటిఫుల్ ఏమిట్రా అంటామట. ఇంతకుముందీ వ్యాసంలో పేర్కొన్న ధర్మరాజాదుల ఏడ్పును ఆనందించగలం కానీ దీనికి మాత్రం ఏడ్వవలెనా ? 'పుర్రెను తిలకించి ఆనందింపుము'' అనే ఉచిత సలహాను ఒక ఫాదిరీ ఇచ్చినట్లు ''పడవలో ముగ్గురు'' అనే గ్రంథంలో జెరోం. కె. జెరోం హాస్యానికి వ్రాస్తాడు. వేసు కారణం వలన డాక్టరుకు అంత్రవ్రణం సుందరంగా అగుపించవచ్చును. వీటికి కొలబద్ద ఏమైనాకలదా ? అంటే సహృదయాః ప్రమాణం అన్నారు. నిరంతరం కావ్యపఠనం చేత మనస్సు అద్దం వలె నిర్మలమై కావ్య తన్మయత్వ మందు హృదయం కలవాడే సహృదయుడని అభినవ గుప్తుడు నిర్వచిస్తాడు. ఈ నిర్వచనాన్ని కొంత ఉదారంగా వ్యాఖ్యానిస్తే ''పుస్తకాల పురుగు'', సెన్సారు బోర్డు అధ్యక్షుడు కూడ ఈ బిరుదానికి తగిన వాళ్ళవుతారు.

### సౌందర్యం

భౌతికమా ఆధ్యాత్మికమా ?

బాహిరమా అంతరమా ?

లౌకికమా లోకోత్తరమా ?

టాల్స్టాయి, షోపెన్‌హోవరు, ఎమర్సను వంటి వాళ్లు ఆధ్యాత్మికం, అంతరం, అలౌకికం అంటారు. వీరంతా భారతీయ భావసరణివారు. కాబట్టి వీళ్లు నిజమైన పాశ్చాత్య దృక్పథానికి ప్రతినిధులుకారు. అసలుకు పాశ్చాత్యులకూ మనకు కళా లక్షణాలలో వుండే సామ్యమూ భేదమూ గమనింతము. గాంధార శిల్పపద్ధతికి చెందిన బుద్ధుని విగ్రహమూ, అమరావతి పద్ధతులకు చెందిన బుద్ధుని విగ్రహాలూ పరిశీలించండి. అందు విగ్రహం గంభీరంగా ఉంటుంది. వస్త్రధారణమూ ఉండవచ్చు. మీసాలూ ఉంటాయి. ఇందు బుద్ధ విగ్రహాలు ప్రసన్నంగా, మొగం కేశరహితంగా ఉంటాయి. ఒక అనిర్వచనీయ లావణ్యం (గ్రేస్) ఉంటుంది. పాశ్చాత్య కళలో చిత్రాలుకానీ, శిల్పాలుకానీ కండరాలు తిరిగి బలిష్ఠ మనుష్యులవలె ఉంటాయి. అంగప్రత్యంగ నిష్పత్తి ఉంటుంది. మన చిత్రాలు చదరంగా ఉంటాయి. వాళ్ళ చిత్రాలు లోపల నుంచి ఆవిర్భవించినట్లునూ, మన చిత్రాలు బయట నుండి లోపలి కంతర్ధానమయినట్లునూ ఉంటాయి. వాళ్ళ శిల్పాలు ఘనపరిమాణం ప్రకారం, ముందు వెనుకలా అవయవములు సంపూర్ణంగా ఉంటాయి. మన శిల్పాలు ముందునుంచి మాత్రమే మలచబడి ఉంటాయి. పాశ్చాత్య చిత్రాల్లో దూరానుగత చిత్రణ, కాంతిచ్ఛాయా విన్యాసమూ ఉంటాయి. అందుకే అవి ఫోటోగ్రాపు వలె ఉంటాయి. మన చిత్రాల్లో రేఖా విలాసమూ, ప్రతీకతత్వమూ ఉట్టిపడతాయి. ఇప్పుడు పాశ్చాత్యులు ఫోటోలను మన చిత్రకళను పోలేటట్లు తీస్తారు. ఇక కావ్యాల దగ్గరికి వచ్చేసరికి చప్పున తోచేదిది. మన కావ్యాలలో విషాదాంతాలు లేకుండుట. మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని. రామాయణ మహాభారతాలు సరియైన ఉదాహరణాలు కాజాలవు. రామాయణం ఆది కావ్యమనుకొంటే నేను చెప్పేదిది. రామాయణంలో ఏ ఘట్టాన్నైనా తీసుకోండి, పరోక్షంగానో, ప్రత్యక్షంగానో శ్రీరాముని ప్రసక్తి ఉంటుంది. సకల కల్యాణ గుణాభిరాముడని భక్తులు నమ్మే శ్రీరాముడున్నప్పుడు అమంగళ మెక్కడిది ? మహాభారతం ఇతిహాసమాయె. భాసుని 'ఊరు భంగం'లో దుర్యోధనుని కవి సానుభూతితో చిత్రించినాడేకాని త్రాసద నాయకునిగా కాదు. చేమకూర సారంగధరునిలో గ్రీకు త్రాసద వీరలక్షణాలు పూర్తిగ వున్నాయి.

అందుకే మన సాహిత్యంలో చిన్నారి నెల్ చావదు. ప్రొమీథియస్ విడుదల పొందుతాడు. ఆంటిగొనె శపథం నెరవేరుతుంది. రోమియో జూలియటులు సుఖంగా ఉంటారు. 'అరుంధత్యను భర్తారంగఛాయేవ సర్వత' అని చెప్పబడ్డ అరుంధతికీ, 'ప్రపంచంలో ఎక్కడికైనా నిన్ననుసరిస్తాను ప్రభూ' అన్న జూలియటుకు శీలసంపదలో భేదమేముంది గనుక ! ఫౌస్టు ఆత్మ ఫౌస్టుకు దక్కుతుంది. హామ్లెటు డెన్మార్కు రాజవుతాడు. వాళ్ళ సాహిత్యంలోనే గనుక అయితే హరిశ్చంద్రుడు వల్లకాటిలో

కుమిలి కుమిలి చచ్చిపోతాడు. సీత నయానో భయానో రావణుని వశమవుతుంది. ఇలియడ్‌లో హెలెన్ ఏమాయెనో చూడండి అట్లన్నమాట. నలదమయంతులిక కలుసుకోరు - ఎబిలార్డ్‌హీలి యోసులగతి అయినట్లు. ధ్రువుడు తపస్సు చేస్తూ చేస్తూ ఆకలితో అంతమవుతాడు.

అది ప్రాచ్యుల, పాశ్చాత్యుల సంఘ శీల లక్షణమను కొంటాను. పాశ్చాత్యులది భోగభూమి. వారు ప్రాపంచిక జీవనంలో భోగాలననుభవిస్తూ సాహిత్య జీవితంలో కష్టాలననుభవిస్తుంటారు. మనది కర్మభూమి. మనం ప్రాపంచిక జీవితంలో 'ఖర్మ' అనుభవిస్తూ, సాహిత్య జీవనంలో సుఖాలననుభవిస్తూ వుంటాము. పతితలైన పాశ్చాత్య సాహిత్య నాయికలైన యొకాస్తే, హెస్టర్ ప్రిన్, టెస్సు, అన్నాకెరానీనాల గతి విషాదాంతం అయింది, అహల్య, తార, తులసి, పింగళల గతి సుఖాంతం అయింది. మనం సుఖాంతంలో చూపించిన నీతి వాళ్ళు విషాదాంతంలో చూపిస్తారు. ఒక హామ్లెటు, ఒక విల్లీలోమను, ఒక సిడ్నీకార్టన్, ఒక టెస్సు, ఒక అంటిగొనె, చాలు జాతి సంస్కృతీ మర్యాదకు మన చరమ పురుషార్థం మోక్షం. మన మనస్సు ముసలివారం అవుతున్నకొద్దీ ఈ లోకం మీదినుంచి ఆలోకం మీదికి ప్రసరిస్తుంది. 'ఆలోకం నుండి ఆహ్వానం' వచ్చినట్లవుతుంది. అందుకే మన కవులు తమ 'ప్రాయపు ప్రొద్దంత కొంత పడమర తిరుగ'గానే రామాయణాలూ', తాత్విక గ్రంథాలు వ్రాయడం షురూ చేస్తారు. విప్లవకవి శ్రీ శ్రీ 'స్వర్గ భైరవం' అనువదిస్తాడు. 'వాసిలీ త్యోర్కిన్' అనువదింపడు. దీని అంతర్యం ఏమై యుండవచ్చు ? భౌతిక సౌందర్యం ఆధ్యాత్మిక సౌందర్యంగా పర్యవసిస్తుందనిపిస్తుంది. రాబర్ట్ బ్రిడ్జెస్ కావ్యం 'సౌందర్య నిబంధన', కాళ్ళకూరి గోపాలరాయకావ్యం 'సౌందర్య మంజరి' (దీనికి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి విస్తృత పీఠిక కలదు), ఆది శంకరుల 'సౌందర్య లహరి' ఇందుకు తారకాణలుగా పేర్కొనవచ్చును. సోవియట్ సాహిత్యంలోనూ నేడు 'స్పిరిచ్యువల్' (ఆధ్యాత్మిక) అనే మాట వినవస్తూంది.

## సౌందర్యం

సార్వకాలిక సార్వదేశీయమా, తాత్కా
లిక ప్రాంతీయమా ?
శాశ్వత ప్రమాణాలు కలదా, మారుతున్న
ప్రమాణాలు కలదా ?

“ఉపమా కాళిదాసస్య” అన్నట్లు, మరికొందరికి ఉత్ప్రేక్ష ఇష్టం కావచ్చును. భౌతిక సౌందర్య ప్రమాణాలు సార్వకాలికమూ కాదు సార్వదేశీయమూకాదు. అంతస్సౌందర్యాలు (దయ, త్యాగం, సత్యం) వంటివి అన్ని కాలాల్లోనూ అన్నిదేశాల్లోను ఒక్కటే.

హిందూదేశం వాళ్ళు పూర్వ యూరోపియను లంటాడు నీరద చౌదరి. ఈయన మాటలు అగ్నిహోత్రావధానివి వంటివి. మాట పెళుసైనా ఉన్నదున్నట్లు కట్టెవిరిచినట్లు చెబుతాడు. మనదేశంవారికి తెల్లదనం మీదమోజు ఎక్కువట. జానపదులుకూడా పిల్ల తెల్లగా బాగుంది అంటారు. పిల్ల నల్లగా బాగుంది అనరు. ఆ నల్లమహా బాగుంటే పిల్లనల్లగా ఉన్నాఫర్వాలేదు అంటారు. అయినా అజంతా కుడ్య చిత్రాలలో అతిసుందర చిత్రం “నల్లయువరాణి”దే. నీగ్రో ఉద్యమ నినాదంలో “తెల్లది వికారం” అనేదొకటి. పాశ్చాత్యులలో స్త్రీలకు నీలికళ్ళు, బంగారు వన్నె వెంట్రుకలు సౌందర్య ప్రతీకలైతే, భారతీయులకు నల్లని కళ్ళు, నల్లని వెంట్రుకలు సౌందర్య సూచకాలు. సుందర స్త్రీలను వర్ణించడానికి వారిని “పృథునితంబని, పీనపయోధర” అని అంటామని నీరద చౌదరి ఎక్కెసక్కెంగా వ్రాస్తాడు. వ్యూఢోరస్క వృషస్కంధ సాల ప్రాంశు మహాభుజులైన పూర్వీకులు కల శ్రీరాముణ్ణికూడా “పృథు జఘను” ణ్ణి చేసినారాయన భక్తులు. శిల్పాల్లోని నర్తకీమణులు దప్పంగా ఉంటారు. నిజమైన నర్తకినులు డిటో. బెల్లెరినా అనే పాశ్చాత్యనట్టువకత్తెలు పలుచగఉంటారు. మనవాళ్ళు స్థూలకాయలు కావున మందయానం, గజగమనం సుందరాలైనాయి. వేగగామిని, జంఘాలి అనేవి సౌందర్య సూచకాలుగా కవులువయోగించింది చదువలేదు. ఒకానొక ఆఫ్రికా దేశంలో పళ్ళను పగుల గొట్టించు కొనుట సుందరమట. తెల్లని పలువరుస కలవాళ్ళని చూచి వీళ్ళేమి మృగాలా అని గేలి చేస్తారట. పూర్వం చైనాలో ఆడపిల్లలకు చిన్ని పాదాలుంటే సుందరమని తలచబడేది. కానపసిపిల్లలుగా వున్నప్పుడే వాళ్ళ పాదాలను విరిచి కట్టి యుంచేవారట. గల్లమీసాలు, కోమన్‌కట్టు, ఫ్రెంచికట్టు, హిట్లరుకట్టు, హిప్పీకట్టు, పూర్తి కట్ (నిర్మీసం), ఇవి మీసాల సౌందర్యాలు. ఇవి ఫేషనుల అభిరుచులేకాని సౌందర్య తత్వానికిచెందినవికావు.

ఒక దేశంలోనే సౌందర్య ప్రమాణాలు మారుతుంటాయి. సుందర స్త్రీల పలువరుసలను వర్ణించేందుకు 'కుందరదన' అనే మాటలు వాడుతారు. కాని మొగలుల కాలంలో రాణులూ, సుల్తానీల పళ్ళకు నల్లని రంగు (దానన్) వేసుకొనేవారు. ఇట్టి వారిని 'బొగ్గ రదన' అనవలె. అత్యంత సుందరమైనదని దేన్నను చుండుమో ఆ చీర ధారణ పద్ధతి ప్రాచీన భారతదేశమందు లేదు.

పురుష వస్త్రధారణ పద్ధతులుకూడా మారినాయి. టోయన్బీ తన 'చరిత్రాధ్యయనం'లో ఒకమాట అన్నాడు. హిందూ దేశంలో కూడా భవిష్యత్తులో ట్రౌజరులే ఫేషన్ అవుతాయి. ధోవతులు, పటా పంచలవుతాయి అని. మారని ఫేషను ఒకటే ననుకొంటాను. నిషిద్ధ ఆపిల్ తినక పూర్వపు ఆదం, ఈవ్‌ల 'వస్త్ర' ధారణ ; ప్రాచీన చిత్రాల్లోనూ, కొత్తా రామమోహన శాస్త్రి వాల్మీకి రామాయణానికి వేసిన వర్ణ చిత్రాల్లోనూ, స్త్రీల ఫాలభాగాలు చిన్నవిగా ఉన్నాయి. మొగలు, రాజాస్తాని, కాంగ్రా, పహాడి వర్ణచిత్రాల్లో సుందరీమణులకు పెద్ద నుదుళ్ళు (తలసగం బోడా అనిపించేటంత) ఉంటాయి. మైకేల్ ఏంజలో మొదట ఆదం పాత్రకు ఒకనిని నమూనాగా ఎన్నుకొని, కొన్నేండ్ల తర్వాత ఇంకొకని సైతానుకు నమూనాగా ఎన్నుకొనెటట. తీరా చూస్తే వాడే వీడని తేలిందట. దేవాసుర ప్రవృత్తులకొకే నమూనా ఎట్లా సరిపోయింది? రామరావణుల పాత్రలను చలన చిత్రంలో ఒకే యన్టీఆర్ నిర్వహించినాడు. ఇందులో నేర్చుకోవలసిన సారం వుంది. మానవుడు దేవాసుర సంపత్సమేతుడని. ఆస్కార్‌వైల్డ్ 'పిక్చర్ ఆఫ్ డోరియన్‌గ్రే' ఈ సందర్భాన అన్వయించుకోవచ్చు.

రామునికీ కృష్ణునికీ మీసాలూ గడ్డాలు పెట్టరు. 'ఇతడు మీసం పెట్టుకొన్న కృష్ణపాత్ర వేషధారణ చేసినాడు' అని ఘనంగా ఒక నటుని గురించి చెబుతూంటారు. మీసాలు కృష్ణునికి పొసగవని మనం అనుకోవలె. నారదపాత్రకు నడినెత్తిమీద కొప్పు పెట్టెదరు. విశ్వనాథ 'వేయిపడగలు'లో నారదుడు ధవళ కేశాలతో ఉండవలెననీ, ఒక సంస్కృత కవి అలాగుననే వర్ణించినాడనీ వ్రాసినాడు. పూర్వం 'ద్రౌపదీ వస్త్రాపహరణం'లో రామకృష్ణశాస్త్రి పిలక గల నారద పాత్ర ధరించినాడు. ఏసుక్రీస్తు ఎట్లుండవలెననే తేలలేదింకా.

'చిన్నది అందమైనది' అని షూమాచెర్ అనే శాస్త్రజ్ఞుడు చిన్న తరహా పరిశ్రమల తరఫున వాదించినాడు. 'పెద్దది అందమైనది' అనేటట్లు నేడు గోమంతేశ్వర ('గోమటేశ్వర' అంటారు, ఆ పదం తప్పు) విగ్రహాలు వెలసిపోతున్నాయి. అణోరణీయాన్ మహతోమహీయాన్ అని కఠోపనిషత్తులో పరమాత్మను వర్ణన. అమాయకులను ఊదర గొట్టడానికి శ్రీకృష్ణుడు అనుసరించే ట్రిక్కు విశ్వరూప ధారణ. అన్నీ తెలిసిన మహర్షులకేమో అంతు చిక్కడు వాళ్ళు నేతి నేతి అని వెదుకుతుంటారు.

ఆభరణాలు ధరించక, విద్యావతులై సాంఘిక సాంస్కృతిక కార్యక్రమాల్లో పాశ్చాత్య స్త్రీలు పాల్గొంటూ వుండగా, మైనిండా నగలుధరించి విద్యాగంధ శూన్యలై వ్రతాలూ నోములూ అంటు మన స్త్రీలు కాలం వ్యర్థం చేస్తారు. మనస్త్రీలిట్లు చేయరాదని చెప్పడానికే నిరాడంబరతలో నిజమైన అందం ఆనందం ఉంది అని చెప్పడానికే పింగళి సూరన 'కళాపూర్ణోదయం'లో సుగాత్రి శాలీనుల కథ వ్రాసినాడు.

## సౌందర్యానుభవ ప్రకటన

సౌందర్యం ఆనంద దాయకం అనుకొన్నాము. ఆనందం మనస్సంబంధి. మనస్సుకు బాహ్య ప్రపంచ జ్ఞానం కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం అనే వాటివల్ల అవుతూ ఉంది. బాంగార్టెను 'సౌందర్య దర్శనాని'కి 'ఇస్తెటిక్సు' అనిపేరు పెట్టడానికి కారణం సౌందర్యం నుంచి వచ్చే ఆనందం పంచజ్ఞానేంద్రియాల ద్వారా రావడం వల్లనే. గ్రీకు భాషలో 'ఇస్తెసిస్' అంటే జ్ఞానేంద్రియాల ద్వారా కలిగిన భౌతిక ప్రపంచ పరిజ్ఞానం.

మనం సౌందర్య చర్చ చేసేటప్పుడు గమనించినదిది. సౌందర్యం రూప, శబ్దములకు మాత్రమే పరిమితమై యుండుట. చూడండి : దిగువపట్టికలో ఇంద్రియం, ఇంద్రియ ధర్మం, ఇంద్రియ జ్ఞానం ఈయబడినవి.

| ఇంద్రియం | ఇంద్రియధర్మం | ఇంద్రియజ్ఞానం |
|---|---|---|
| కన్ను | రూపం | చిత్రం, శిల్పం, నాట్యం, వస్తువు |
| చెవి | శబ్దం | సంగీతం, సాహిత్యం |
| ముక్కు | గంధం | వాసనలు (పాకం, సుగంధాలు) |
| నాలుక | రసం | వంటకాలు |
| చర్మం | స్పర్శ | స్నిగ్ధం, మార్దవం |

కన్ను, చెవి మాత్రం కళలతోనూ, వాటిలోని సౌందర్యంతోనూ, దానినుంచి లభించే ఆనందంతోనూ ముడిపడినాయి. ప్రాచీనులు విశాల దృషితో ఏ కౌశలానైనా కళ క్రింద (64 కళలు) జమ కట్టగా, మన మీనాడు లలితకళలనే కళలని పిలుస్తాము. లలిత కళలను సృష్టించే వారికీ, వాటిని మెచ్చుకొనే వారికీ ఉండే గౌరవాదరాలు, ఇతర కళలకు లేదు. నాలుక త్రుప్పు వదలించే రుచులూరించే వంటకాలు వండే వానినీ, దేహానికి హాయిగా మెత్తగా ఉండే హంసతూలికా పరుపులను చేసే వానినీ, మధుర విషాద స్మృతులను పునరనుభవంలోనికి తెచ్చే సుగంధాలను (చూడుడు: ఓ హెన్రీ చిన్నకథ "ఫర్నిష్డ్‌రూం") తయారు చేసే వానినీ, జీవరాశికి వజ్రకవచంలాగా ఉండే చర్మం నీటుగా, నున్నగా ఉండేటట్లు చేసే సబ్బు, స్నోలను చేసే వానినీ తేలికపేర్లతో తీసివేస్తాము.

పంచ జ్ఞానేంద్రియాలలో కన్నూ, చెవి పనిచేయని, స్వరపేటిక లేని (అనగా గుడ్డి, చెవిటి, మూగ అని అర్థం) హెలెన్ కెల్లరు అంతటి విద్యావంతురాలెట్లయినది. స్పర్శ జ్ఞానం మీద మాత్రం ఆధారపడి ఆమె జ్ఞానం సంపాదించింది అంటాం. అని రాగాలు తీసేవానిని వాగ్గేయ కారుడని పయిత్యెపు సుద్దులు గోకే వానిని మహా మహా కవి అనీ దేహభాగాలు కొంచెంతిప్పుతూ ఎగిరే దానిని నటీమణి అని సన్మానిస్తాము. వీరిని మెచ్చుకొనే వారిని చక్కని పేర్లతో పిలుస్తాము. సంగీత సాహిత్యాలను మెచ్చుకొనేవానిని రసపిపాసువు, సహృదయుడు, భావుకుడు, రసికుడు అంటాము. చిత్ర శిల్పాలను మెచ్చేవాడు 'కనాయిషియర్' వంటకాలను మెచ్చుకొనేవానిని తిండిపోతు (గూర్మాండ్) అంటాము. సిల్కులు ధరించేవాడు 'డాండీ'. మెత్తని పరుపుల మీద పడుండే వానిని 'భోగి' అనో 'రోగి' అనో, వీడు చాలా నాళ్ళు బ్రతుకడు అని మనస్సులో దీవిస్తాము. ఇదేమి న్యాయమండీ ?

సాహిత్యం నుంచి వచ్చే ఆనందం ప్రగతికీ, స్వావలంబనకూ, శ్రేయః క్రియా పరత్వానికీ మర పలక కావలెను. తుపాను కొడుతూంటే, మొండి గోడచాటున నిల్చొని చదువబుద్ధి వేసే సాహిత్యం ఏది వుందో, అది 'ప్లేటో సంవాదములు' కావచ్చు, తిక్కన కవిత్వం కావచ్చు, డికెన్సు 'పిక్విక్ పత్రములు' కావచ్చు- దానినుంచి వచ్చే ఆనందమే ఆనందం.

కావ్య సౌందర్య గతమైన ఆనంద ప్రకటన (ఇస్థెటిక్ అప్రీసియేషన్) కింత మీమాంస కావలెనా ? బాగుంటే ఆహా ఓహో, లేదంటే ఛీ థూ, ఏదీ కాదంటే వ్స్.




# ఆంధ్రపత్రిక

ఆంధ్రపత్రిక ఇప్పటికి ఇంచుమించు ఏడు దశాబ్దాలుగా తెలుగువారికి సేవ చేస్తోంది.

**విజయవాడ, హైదరాబాద్‌ల నుండి వెలువడుచున్నది.**

తాజా వార్తలు, పక్షపాతం లేని వ్యాఖ్యలకి ఆంధ్రపత్రిక పెట్టింది పేరు.

**ఇవి కాక అన్ని రకాల అభిరుచులనీ సంతృప్తిపరచే ఇతర శీర్షికలు ఎన్నో మీరు ఆంధ్రపత్రికలో చదవగలరు !**

★ మన సినిమాలు ★ డాక్టరు కబుర్లు ★ కలైడోస్కోపు కార్టూన్
★ దినవార ఫలాలు ★ పల్లెసీమ ★ శ్రీకృష్ణ భాగవతం
★ ఇదివారీ దృక్పథం ★ యుద్ధకాండ ★ వింత యథార్థం

★ ఇంకా — వ్యాసాలు, గేయాలు, కార్టూన్‌లు .... ....

ఎప్పటికప్పుడు ఆంధ్రపత్రికలో సరికొత్త ఆకర్షణలు ప్రవేశపెడుతూనే ఉంటాము !

**వెంటనే ఆంధ్రపత్రిక చందాదారుగా చేరండి !**

# నగరంలో నీడ

**కన్నడమూలం : శ్రీ చెన్నవీర కణవి** **అనువాదం : శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

మంటమంట మధ్యాహ్న వేళ
నీడను వెదుకుతూ బయలుదేరాను
పట్టుకున్న గొడుగు సైతం వేడెక్కి
బరువై విసుగెత్తి పోయింది
దారి కిరువైపులా చల్లగా ఒళ్ళు చాచుకొని
విస్తరించి చేజాచిన చెట్టు కొమ్మలను
విద్యుత్తీగలకు అడ్డొస్తున్నాయని
అడ్డ దిడ్డంగా నరికేశారు.
ముళ్ళకంచెపై ఒకవైపు మాత్రం పడింది నీడ.

అనాదిగ ఛత్రం పడుతూ
ఆకాశమంత ఎత్తుకెదిగి
అమరంగా నిల్చున్న చెట్లను
ట్రక్కులు ఢీకొంటాయని
పశువులు నిల్చుంటాయని
రహదారిని వెడల్పు చేస్తామని
సాకులు చెప్పిన ఉదార పురుషులు
కొట్టి వంట చెరుకుగా మార్చారు.

బాబ్‌కట్ చేసిన తలలలో
రంగు రంగుల పూల సింగారించి
తోటలో వూగాడే తరు మాలికలు
నేలపై బొల్లి మచ్చల్లాంటి నీడలు
పొడవైన తారురోడ్డు వేసే చురకలు
దానికీ వస్తాయి వందకు మించిన కొమ్ములు
గెంతుతూ దబాయిస్తూ నిభాయించుకోవటమే
నేరుగా పోయేవారి తీరు -

చిన్నప్పుడు -
మావూరి బయటి మర్రి నీడలో
వేళ్ళు నెత్తురు చిమ్మేలా గోలీలాడి
తలలతో ఢీకొని
సిగపట్లు పట్టి - చొక్కాలు చించుకొని
ఏడ్చింది - ఏడ్చి నవ్వింది
సంతోషం పొంగి పొర్లిందీ
గుర్తు కొస్తున్నది -
నగరాన్ని కాలుస్తూ, చుట్టేస్తూ
గొంతు సారించి -
ప్రమాదాలు తెచ్చి పెట్టే దారిలో
ఇలా ప్రజల మధ్య
నీడను వెదుకుతూ నడుస్తున్నపుడు.

# గతం - కర్తవ్యం!

**శ్రీ ఎస్. సంజీవ్**

ఆ నిశీధిలో
నక్షత్రాల వెలుగులో
సూదికోసం వెతుకులాట -
స్త్రీ బ్రతుకులో
బానిసను చేసే బంధనాలలో
స్వేచ్ఛ కోసం పాకులాట !

నువ్వే
దివ్వెవైతే
సూది లభిస్తుంది.
స్త్రీ చైతన్యమై
ఎదురిస్తే
స్వేచ్ఛ సిద్ధిస్తుంది.

డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి

# మైలమ భీమన

ఇటు తెలుగు సాహిత్య చరిత్రకు, అటు విజయనగర సంస్థాన చరిత్రకు ముడిపడిన వ్యక్తి మైలమభీమన. అతని ఖడ్గసృష్టి ఎంత అఖండమైనదో, చరిత్రసృష్టి అంత వితండమైనది.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ప్రతిపాదన మిది[1] :

'ఈతని పేరఁగల్గు పద్యములు ('గరళపు ముద్ద –' 'ఏఱువభీమ –) వే (లే) ములవాడ భీమకవి కృతములుగా లక్షణ గ్రంథములందుదాహరింపఁబడినవి. ఈ క్రింద నుదాహరింపఁబడు పద్యములెల్ల నొక్కవరుసలోనివే యగుటచే నొక్కరిచేతనే (భీమకవి చేత) రచియింపఁబడిన వనుకొనెదను .... విజయనగర సంస్థానపుఁ బ్రభువులగు పూసపాటివారి మైలమభీమన సంబంధు లట ! ఈతఁడు ఏలేరు, కసిమి, వేంగి, కళింగలను జయించినట్లు పద్యములందున్నది. ఏఱువభీమ మైలమభీమ పదము లొక్కని పేళ్ళే'.

ఇట్లు ప్రతిపాదించి ప్రభాకరశాస్త్రిగారు ఉదాహరించిన పద్యములు పదమూడు కలవు. ఆ 'పద్యములెల్ల నొక్కవరుస లోనివే యగుట'కు హేతువు ఆకరమునందు వరుసక్రమమున ఉండుట కావచ్చును. 'చెన్నపురపు లిఖితపుస్తక భాండాగారము పెక్కు పద్య రత్నముల నొసఁగినది' అని ప్రభాకరశాస్త్రిగారి ప్రతిపాదనమే.[2] ఆ 'పద్యరత్నముల నొసఁగినది' మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని సి. పి. బ్రౌను సిద్ధపఱి చిన 'చాటుధార పద్యములు' అను సంపుటమని ఇటీవల వెలుగునకు వచ్చినది.[3] 'ఒక్క వరుస' అందలిది కావచ్చును. ఎందలిదైనను 'ఒక్క వరుస'కు హేతువు 'ఒక్కరి చేతనే రచియింపఁబడుట' మాత్రమేగాక, 'ఒక్కరిచేతనే' ఘటియింపఁబడుటకూడ కావచ్చును. కనుక 'ఏఱువభీమ మైలమభీమ పదము లొక్కని పేళ్ళే' కావల సిన ఆవశ్యకము లేదు. అంతేకాదు. ఉదాహృత పద్యములందు ఏఱువభీమ, మైలమభీమ పదములు మాత్రమేగాక, చిక్కభీమ, ఖండనభీమ పదములును కలవు. ఏఱువభీమ పదముకల పద్యములు రెండు, మైలమభీమ పదముకల పద్యములు ఎనిమిది, చిక్కభీమ పదము కల పద్యములు రెండు, ఖండనభీమ పదము కల పద్యము ఒకటి కలవు. అందు ఏఱువభీమ పదము కల పద్యము లివి –

'పన్నితు రంగమంబునకుఁ బక్కెర వెట్టిన వార్త చారుచే
విన్న భయంబునం గలఁగి వేసటనాటనె చక్ర (?) గోట్టముల్
మన్నియ పట్టణంబులును మక్కెన వేంగి కళింగలాదిగా
నిన్నియు నొక్క పెట్టెగసె నేఱువభీమ నృపాలు ధాటికిన్

అరివరులేఱువ భీముని
పొరువున మనలేరు చిచ్చు పొంతను వెన్నై
తెరువునఁ బెన్పై జూదరి
సిరియై రేన్చెట్టు క్రింద జిల్లేడు చెట్టై'

ఇందు మొదటి పద్యము ఇంచుక పాఠభేదమున 'కడప మండలము నందలి తాళ్ళప్రొద్దుటూరు గ్రామ మందు ఆంజనేయ స్వామి యాలయమునకుఁ దూర్పుగా నున్న తాఁతిమీఁది శాసనము' నందు కలదు.[4] ఆ పద్యమిది –

'పన్ని తురంగ మంబునకుం బక్కెర వెట్టినవార్త (హే?) రిచే
విన్న భయంబునం గలంగె వీసరనాంటునుం జక్రగో (ట్ట) మును
మన్నియ (వడ్డెక్కలియ) మ (ల .. ద్యన) వేంగి గళింగలాదిగా
నిన్నియు నొక్కనాండ .... (నే) ఱువ భీమ(న్రి)పాలు ధాటికిని'

ఇందు మూడవపాదము నందు మన్నియ, వడ్డె, ఱెక్కలి, మంతెన, వేంగి, కళింగలుకలవని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వివరణ.[5] కనుక పరిష్కృత పాఠమిది –

'పన్ని తురంగ మంబునకుఁ బక్కెర వెట్టినవార్త వేరిచే
విన్న భయంబునం గలఁగె వీసనాఁడునుఁ జక్రగొట్టమున్
మన్నియవడ్డె ఱెక్కలియు మంతెన వేంగి కళింగలాదిగా
నిన్నియు నొక్కనాఁడగలె నేఱువ భీమనృపాలు ధాటికిన్'

ఇక చోడభక్తిరాజు మదరాసు 'మ్యూజియము' శాసనమును బట్టి, అతని కొడుకు అన్నదేవచోడుని రాజమండ్రి 'మ్యూజియము' శాసనమును బట్టి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సంతరించిన ఏఱువభీముని వంశవృక్ష మిది[6] –




ఇందు భక్తిరాజు శాసనకాలము 1278 + 78 = 1356వ సంవత్సరము. కనుక ఏఱువభీముని కాలము పదమూడవశతాబ్ది మధ్యభాగము కావచ్చునని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి నిర్ణయము.[7] అంతేకాదు. వీసరనాడు, చక్రకగొట్టము, మన్నియ, వడ్డె, పెక్కలి. మంతెన, వేంగి, కళింగము మొదలైనవి చిన్న దుర్గాధిపతి జయించుట సాధ్యముకాదు గావున, ఆ కాలమునందు ఆంధ్రదేశము కాకతీయ సామ్రాజ్యాధిపతి గణపతిదేవ చక్రవర్తి ఆధీనము నందు కలదు. గావున, గణపతిదేవ చక్రవర్తి కళింగదేశమును జయించినట్లు ఉప్పరపల్లి, దాక్షారామ శాసనము లందు కలదు గావున, ఏఱువభీముడు కాకతిగణపతిదేవ చక్రవర్తి సామంతుడని వాదము మల్లంపల్లి సోమశేఖరశర్మగారి సమన్వయము.[8] కనుక ఏఱువభీముని కాలము పదమూడవ శతాబ్ది మధ్యభాగము.

ఇక చిక్కభీమ పదము కల పద్యము లివి -

'తెరలంబాలి నభంబుదాఁకినఁ బయోధిం జొచ్చినన్ శైలగ
హ్వరముల్ దూఱినఁ జిక్కభీముఁడు నృపవ్రాతంబుఁబోవిచ్చునే
గరుడండై చనినట్టు మింటితువ నుగ్రగ్రాహమై చొచ్చి సా
గరమధ్యంబున మ్రింగుఁబట్టుకొను సింగంబై గుహాంతరంబునన్

అలమునఁ జిక్కభీముఁడు
వాలతి వేగమునఁ బెటికి వడి తుద గవియన్
ద్రేలిపడఁ బడుగు నేసెను ?
ఏలేయను గసిమి భైరవేశుం దెఱుఁగన్'

ఇందు రెండవ పద్యము నందు 'పడుగునేసెను' అని కాక, 'పిడుగునేసెను' అని ఉండవలయును. చిక్కభీముడు కత్తిమాసి పేలిపడునట్లు పిడుగును ముక్కలు చేసెనని అర్థము వచ్చును. ఇట్టి కల్పనము ఇతరత్రి కలదు. అది ముందు వివరింతును. ఇంతకు చిక్కభీమ పదము కల రెండు పద్యములందును స్పష్టముగ చరిత్ర విషయము లేదు. కాని, చరిత్రలో ఒక చిక్కభీముడు కలడు. గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకాలోని వేలూరు తామ్రశాసనము నందు ఇట్లు కలదు-[9]

'స్వస్తిశ్రీ శుభశకవరుషంబులు 925 (ఉత్తరాయణ) సంక్రాంతిథి అందు వేలూరి పరిచ్ఛేద చిక్కభీమరాజులు మూలస్థానం సోమనాథదేవరకు హవిబలి అర్చనాదులకుం బెట్టినవృత్తి'

ఇందు చిక్కభీమరాజు పేరుతోపాటు పరిచ్ఛేదవిశేషణమును కలదు. ఇది గమనార్హమైన విశేషము. శాసనకాలము 925వ శక సంవత్సరము. కనుక చిక్కభీముని కాలము 925 + 78 = 1003వ సంవత్సరము. అనగా పదకొండవ శతాబ్ది పూర్వార్ధము.

మఱి భండనభీమ పదము కల పద్యమిది -

'భండనభీమ నీయెదుటఁబాలిక నిల్చిన శాత్రవుల్ బృహ
న్మండల పుండరీక పురనాక నివాసులు నోర్చినన్ బృహ
న్మండల పుండరీక పురనాక నివాసులు చచ్చినన్ బృహ
న్మండల పుండరీక పురనాక నివాసులు చిత్రమిద్ధరన్'

ఇందు చరిత్ర విషయము లేదు గాని చిత్రకవిత్వము కలదు. ఇట్టి పద్యము మఱొకటి మైలమభీమ పదము కల పద్యము లందు కలదు. ఆ పద్య మిది -

'వీరగుణ శాత్రవగుణ విశ్రుత ! మైలమభీమ నీయశం
బారభమానతారకరహార విలాసము నీ నికేతనం
బారభమానతారకరహార విలాసము నీ భుజార్గళం
బారభమానతారకరహార విలాసము చిత్రమిద్ధరన్' 1

ఇందును, అందును చిందులు త్రొక్కిన చిత్రకవిత్వము సహోదరము. 'చిత్రమిద్ధరన్' అను ముగింపు సమానము. కవల పిల్లలవలె పద్యములు కలవు. కర్తయును ఒకడు కావచ్చును. అతడు వేములవాడ భీమకవి అగును. కనుక భండనభీముడు, మైలమభీముడు ఒకడు.

ఇక మైలమభీమ పదము కల పద్యము లివి -

అహితులఁదాఁకి పోరునెడ నంబధి కల్గిన నాఁటి రాము గో
గ్రహణమునాఁటి పార్థు గదఁగౌరవు నేసిననాఁటి భీము నా
గ్రహ మెసఁగం బురత్రయముఁ గాల్చిననాఁటి లలాటలోచనున్
మహి సుసమింపఁగాఁదగునె మైలమభీముని భీమవిక్రమున్ 2

అలములోనరాతులకు హమ్మని మార్గాన వచ్చునే మహా
కాళికి శూలికిన్ బ్రళయకాలపు గాలికి రాఘవేంద్రు బా
ణాళికిఁ బక్షినాయకు నఖాళికి మత్తగజేంద్ర వైరి దం
ష్ట్రాళికి దావపావకశిఖాళికి మైలమభీము వాలికిన్ 3

గరళపుముద్ద లోహ మువగాఢమహాశ కోల్ము సమ్మెటల్
హరునయనాగ్నికొల్మి యురగాధిపుకోరలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబు దాయ లయకాలుఁడు కమ్మరి వైరివీర సం
హరణ గుణాభిరాముఁడగు మైలమభీమున ఖడ్గ సృష్టికిన్ 4

విదిత గుణాశ్రితాశ్రిగుణ విశ్రుత మైలమభీమభూప నీ
పదిలపు ఖడ్గధారఁ దెగి పాఱినవీరులు గోపురంబుపై
విదిత సువర్ణరత్నమయ వేదికమీఁదను నిల్చికాంచు నౌ
పదిపదులగ్నిహోత్రులను బన్నిరుసూర్యుల నాఱుచంద్రులన్ 5

అరముసఁ గాశికానగర మందము ప్రాల్ త్యజియించినంత నే
యసదృశమైన కన్నుగవ దప్పట మైలమభీమభూప నీ
యసిఁదెగినట్టి వైరులకు నంబకముల్ పదినూఱు లయ్యె నీ
యసికిని వారణాసికిని నంతర మెంత దలంచి చూచినన్ 6

నేరుపు బ్రహ్మఁజేరె నిజనెమ్మి తేజము సూర్యుఁజేరె నా
కారము కాముఁజేరె నధికంబగు లక్ష్మి యనంతుఁజేరె గం
భీరత వార్ధిఁజేరెఁ గలపెంపు కులాద్రులఁజేరెఁ గీర్తి నా
నూఱటలేక త్రిమ్మరుచున్నది మైలమభీముఁ డీల్గినన్ 7

యాచకఖేచరంబు సుగుణాంబుధి మైలమభీముఁ డీల్గినన్
జూచి వరించె రంభ యెడఁజొచ్చెఁ దిలోత్తమ, దారి సిద్ధఁబన్
ద్రోచె ఘృతాచి ముగ్గురకు దొడ్డది కయ్యము పుట్టె నంతలో
నాఁచుకుపోయె ముక్తిసతి నవ్విరి యచ్చరఁజాలఁ జెల్లరే' 8

ఇవి ఏడు, అవి రెండు మొత్తము తొమ్మిది పద్యములు. మైలమభీముని జీవితకాలములోని పద్యములేగాక, మరణానంతర కాలములోని పద్యములును కలవు. పరాక్రమము, యశస్సు, వదాన్యత, సుగుణత్వము వర్ణింపబడినవి. అంతేకాదు. మరణించిన తర్వాత కూడ మైలమభీముని నేర్పు, వర్చస్సు, ఆకారము, ఐశ్వర్యము, గాంభీర్యము, అతిశయము, వీరస్వర్గయోగ్యత, మోక్షసిద్ధి అగ్గింపఁబడినవి. ఉపరి మైలమభీముని ఖడ్గమహిమ నాల్గుపద్యములందు కలదు. కనుక మైలమభీముడు మహావీరుడు కావలయును. యుద్ధరంగమునందు మరణించినవాడును కావలయును. కానిచో రంభా తిలోత్తమా ఘృతాచులదొడ్డది కయ్యమదండుగ. మైలమభీముడు మహావీరుడుమాత్రమే గాక, మహాదాత కూడ అగుట వలన రంభా తిలోత్తమా ఘృతాచులను కాదని ముక్తిసతి నాచుకొని పోయినది. యోగ్యమైన వీరస్వర్గముకంటె, ధ్యేయమైన మోక్షము సిద్ధించినదని తాత్పర్యము.

ఏవంవిధ గుణగణ గరిష్ఠుడైన మైలమభీముని గురించి తొమ్మిది పద్యములందును ఒక్క చరిత్ర విషయము లేదు. కాని భాషావిశేషము కలదు. అది నిశ్చితముగ మైలమభీముని కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధమని పూర్వోక్తము.[10]

పదకొండవ శతాబ్ది పూర్వార్ధములోని చిక్కభీముడు, పదమూడవశతాబ్ది మధ్యభాగములోని చిఱుపభీముడు, పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధములోని మైలమభీముడు ఒకడు కాడు. ఏఱువ భీముని వంశము నందు మఱొక భీముడు కలడు. అతని ప్రసక్తి భక్తిరాజు మదరాసు 'మ్యూజియము' శాసనము నందు గాని, అన్నదేవచోడుని రాజమండ్రి 'మ్యూజియము' శాసనము నందుగాని, లేదు గాని మఱొక శాసనమునందు కలదు. కావ్యము నందుకలదు. నిశ్శంక కొమ్మన శివలీలా విలాసము నందుఁ ఇట్లు కలదు –

'భరితశ్రీనిధి యక్కుమారమణుఁ డొప్పం జోళభక్తిక్షితీ
శ్వర సూనుండగు భీమలింగ మనుజేశశ్రేష్ఠు సత్పుత్త్రి భా
స్వరకారుణ్య దశాజనావనవిధా సంధాత్రి వేమాంబికన్
పరియించెన్ బలభక్తి గౌరవదృఢ వ్యాపార సత్యాంబికన్'
(45 ప., 1 ఆ.)

ఇందలి మహీరమణుడు రాజమహేంద్రవర రాజ్యాధిపతి అల్లాడ రెడ్డి. అతని భార్య వేమాంబిక. ఆమె భీమలింగ రాజశ్రేష్ఠుని పుత్రిక. భీమలింగరాజశ్రేష్ఠుడు చోళభక్తిరాజు కొడుకు. అల్లాడరెడ్డి భార్య వేమాంబిక చోడకులేందుడైన భీమరాజు కూతురని అల్లాడ రెడ్డి కోరుమిల్లి శాసనము నందు కలదు.[11]

'...రాజ్యం రాజమహేంద్రరాజ్య మకరోదల్లాడ భూమీశ్వరః
శచీవ శక్రస్య శివేవ శంభోః పద్మేవ సా పద్మవిలోచనస్య
వేమాంబికా చోడకులేందు భీమ మహీపాల...జా ధాన్యమహి తాస్య జాయా...'

ఇందు వేమాంబిక భీమరాజు కూతురని ఇదమిత్థముగ కలదు. భీమరాజు చోడకులేందుడు. చోడభక్తిరాజు కొడుకు. అన్నదేవచోడుని సవతి సోదరుడగునని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అభిప్రాయము.[12] అన్నదేవచోడుని రాజమండ్రి 'మ్యూజియము' శాసనములోని ఏఱువభీముని వంశవృక్షమునందు భీమరాజు పేరులేకపోవుటకు హేతువు సవతిసోదరుడగుట కావచ్చును. అన్నదేవచోడుని తల్లి పేరు అన్నమాంబ. భీమరాజు తల్లి పేరుకానరాదు. మైలమాంబ కావచ్చును. అయిన భక్తిరాజు కొడుకైన భీమరాజు మైలమభీముడు

అగును. అంతేకాదు. భక్తిరాజు కొడుకు భీమరాజు ఏఱువభీముని వంశములోనివాడు. ఏఱువభీముని పేరిటివాడు. ఏఱువభీమునితర్వాత ఏఱువభీముని వంశము నందు భీమనామధేయుడు భక్తిరాజు కొడుకు భీమరాజు మాత్రమే కలడు. కనుక భక్తిరాజు కొడుకు భీమరాజు మలి ఏఱువ భీముడు అగును. ఉపరి, ఏఱువ వంశ మూలపురుషుడైన ఏఱువ భీముడు పెద్దఏఱువ భీముడని, అతని పేరిటి అనంతర కాలములోని ఏఱువ భీముడు చిన్న ఏఱువ భీముడని లోకవ్యవహారము కలుగుట సహజము. చిక్క శబ్దమునకు చిన్న అను అర్థము కలదు. కనుక భక్తిరాజు కొడుకు భీమరాజు చిక్కభీముడును అగును.

ఇక శ్రీనాథుని కాశీఖండము నందు ఇట్లు కలదు –

'అనవేమక్షితిపాలు పౌత్త్రియగు వేమాంబా మహాదేవికిన్
ఘనుడయ్యల్లడ భూమిపాలునకు సంగ్రామస్థలీ గాండివుల్
తనయుల్వేమవిభుండు వీరవసుధాధ్యక్షుండు దొడ్డప్రభుం
డును నన్నయ్యయు బాహువిక్రమ కళాటోప ప్రతాపోద్ధతుల్'
(32వ., 1 ఆ)

ఇందు అల్లాడరెడ్డి భార్య వేమాంబిక 'అనవేమక్షితిపాలు పౌత్త్రి' అని కలదు. అనవేమ క్షితిపాలుడన కొండవీటి సామ్రాజ్యాధిపతి అనవేమారెడ్డియే. అయినను, ప్రోలయవేమారెడ్డి అని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అభిప్రాయము.[13] కాని, శ్రీనాథుడు ప్రోలయవేమారెడ్డిని ప్రోలయవేముడని, అనవేమారెడ్డిని అనవేముడని వ్యవహరించుటయే కలదు. శృంగార నైషధము నందు 'అనవేమాధిపు రాజ్యభార ధరణ వ్యాపారదక్షుండు పెద్దన మంత్రి ముఖ్యుడు' (27 వ., 1 ఆ.) అనునెడ అనవేమాధిపుడు అనవేమారెడ్డి. భీమఖండము నందు 'త్రిలింగ భూమండలాఖండలులను ప్రోలయ వేమన్న పోతన్న వేమకుమార గిరీశ్వరాదులంబూజ్య సామ్రాజ్య పీఠస్థులం గాంచె' (32 వచ., 1 ఆ.) అనునెడ ప్రోలయవేముడు ప్రోలయవేమారెడ్డి. అన్నవేముడు అనవేమారెడ్డి. కనుక శ్రీనాథుని కాశీఖండము నందును 'అనవేమ క్షితిపాలు పౌత్త్రి' అనునెడకూడ అనవేమ క్షితిపాలుడు అనవేమారెడ్డియే అగును. అయిన వేమాంబిక అనవేమారెడ్డి పుత్రిక పుత్త్రిక అయిన పౌత్త్రి. అనగా దౌహిత్రి. ఆమె భీమరాజు కూతురు. కనుక భక్తిరాజు కొడుకైన భీమరాజు అనవేమారెడ్డి అల్లుడు.

భక్తిరాజు కొడుకైన భీమరాజు అనవేమారెడ్డి అల్లుడైనను, ప్రోలయవేమారెడ్డి అల్లుడని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు అభిప్రాయ పడుటకు హేతువు గలదు. అది భీమరాజు పూర్వ్యుడు కావలసిన చారిత్రికావశ్యకము.[14] అనవేమారెడ్డి అల్లుడైనను భీమరాజు పూర్వ్యుడే అగును. అనవేమారెడ్డి తండ్రి అనంతరముగాక, అన్న అనంతరము కొండవీటి సామ్రాజ్యాధిపతి. అనవేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి కాకపూర్వమే ప్రబలుడు. ప్రసిద్ధుడు. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రెడ్డిరాజుల చరిత్ర రచించునాటికి ఉపలబ్ధముకాని, కాటయ వేమారెడ్డి భార్య అన్యమాంబ 'అన్నవరప్పాడు' శాసనము నందు అనవేమారెడ్డి గురించి ఇట్లు కలదు[15] –

'యో భ్రాతృ సింహాసన సంక్రమాత్ప్రాగాక్రామ దజ్ఞాన్యపి సప్త రాజ్ఞాం
అర్థైరర్థిజనాన్ కృతార్థయతి యో బ్రహ్మాండదానం మహత్ –'

ఇందు అనవేమారెడ్డి, అనపోతారెడ్డి సింహాసనము సంక్రమించుటకు పూర్వమే (శత్రు) రాజుల సప్తాంగములను, అనగా శత్రు రాజ్యములను – ఆక్రమించెనని ఇదమిత్థముగ కలదు. అంతేకాదు. ప్రోలయవేమారెడ్డి తమ్ముడైన అన్నయరెడ్డికి ముగ్గురు కొడుకులని అందు జ్యేష్ఠుడైన పోతారెడ్డిని, కనిష్ఠుడైన వేమారెడ్డిని ప్రోలయ వేమారెడ్డి తన కొడుకులుగ చేసికొనియెనని ఈ శాసనము నందే కలదు.[16] ప్రోలయవేమారెడ్డి కూర్మిపుత్త్రుడు పోతయ అనగా అనపోతారెడ్డి 'చమూపాగ్రేసరు'డని (30 వ., 1 ఆ.) అతని అనుజుడు కోమటి అనగా అనవేమారెడ్డి 'దానంబున గర్ణునిసరి.... బుధసన్మానచతురుండు' అని (32 వ., 1 ఆ.) ఎఱ్ఱాప్రెగడ హరివంశము నందు కలదు. కనుక ఎఱ్ఱన హరివంశ రచనాకాలము నాటికే (1340 ?), అనగా ప్రోలయవేమారెడ్డి కాలమునందే[17] (1324 – 1353) అనవేమారెడ్డి దానకర్ణుడు. అనపోతారెడ్డి కాలము నందే[18] (1353 – 1364) అనవేమారెడ్డి శత్రురాజవిజేత. కనుక అనవేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి కాకపూర్వమే భక్తిరాజు కొడుకైన భీమరాజు అనవేమారెడ్డి అల్లుడు కావచ్చును. ఇది భీమరాజు పూర్వ్యుడు కావలసిన చారిత్రికావశ్యకమునకు సాధకము.

భీమరాజు తండ్రి భక్తిరాజు ప్రథమతః ప్రోలయవేమారెడ్డి స్నేహితుడు కావచ్చును.[19] తదుపరి అనవేమారెడ్డి వియ్యంకుడు కావచ్చును. భక్తిరాజు శాసనము 1356వ సంవత్సరము నందు కలదు. అప్పటికే భీమరాజు అనవేమారెడ్డి అల్లుడు కావచ్చును. అయిన, భీమరాజు అనవేమారెడ్డి అల్లుడైన కాలము స్థూలముగ 1355వ సంవత్సరము. అప్పటికి భీమరాజు పాతికేండ్లవాడైనను కావలయును. అయిన భీమరాజు జననకాలము స్థూలముగ 1355 – 25 = 1330వ సంవత్సరము.

భీమరాజు సవతిసోదరుడు అన్నదేవచోడుని శాసనము 1366వ సంవత్సరము నందు కలదు.[20] అందు అన్నదేవచోడుడు

పట్టాభిషేకము చేసికొన్నట్లు కలదు. అప్పటికి భీమరాజువయస్సు స్థూలముగ 1366 – 1330 = 36 సంవత్సరములు. అన్నదేవచోడుని వయస్సు 35వ వత్సరములు అగును. అన్నను కాదని తమ్ముడు పట్టాభిషేకము చేసికొనుట అక్రమము. అన్నదేవ చోడుని అక్రమపట్టాభిషేకమునకు ఆపాటి వయస్సు ఆవశ్యకము. కనుక భక్తిరాజు కొడుకైన భీమరాజు జననకాలము స్థూలముగ 1330వ సంవత్సరమే.

అన్నదేవచోడుడు 1366వ సంవత్సరము నందు పట్టాభిషిక్తుడగుటకు ముందే అనవేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి. తన అల్లుడైన భీమరాజును కాదని అన్నదేవచోడుడు తండ్రి రాజ్యమునకు పట్టాభిషిక్తుడగుట అనవేమారెడ్డి సహించు విషయము కాదు. అనవేమారెడ్డి శ్రీశైల శాసన బిరుదావళి యందు 'రాజమహేంద్రి నిరవద్య నగరాది బహువిధ స్థల దుర్గ వర్గ విదళనబలరామ' అను బిరుదము కలదు. అనగా అనవేమారెడ్డి అప్పటికే రాజమహేంద్రవర దుర్గము, నిరవద్యపుర దుర్గము మొదలైన బహు దుర్గములు జయించెనని అర్థము. నిరవద్యపురదుర్గమన నిడుదవోలు దుర్గము. అది ప్రథమతః చంద్రవంశపు రాజులైన తూర్పు చాళుక్యుల దుర్గము. తదుపరి కాకతీయుల దుర్గమై, కాలక్రమము నందు సూర్యవంశపు రాజైన అన్నదేవచోడుని అధీనమైనది. అది అనవేమారెడ్డి జయించినది. అనవేమారెడ్డి అన్నదేవచోడుని నిడుదవోలు దుర్గమునుండి తరిమివైచి, భీమరాజును నిడుదవోలు దుర్గాధిపతి చేసి యుండునని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి సమన్వయము.[21] అనవేమారెడ్డి అల్లుడైన భీమరాజును నిడుదవోలు దుర్గాధిపతిని చేయుట అత్యంత సంభవము. అనపోతారెడ్డి అల్లుడు కాటయవేమారెడ్డి రాజమహేంద్రవర రాజ్యాధిపతి అయినట్లు, అంతకు ముందే అనవేమారెడ్డి భీమరాజు నిడుదవోలు దుర్గాధిపతి అగుట నిరాఘాటము. అనవేమారెడ్డి శ్రీశైల శాసనకాలము 1377వ సంవత్సరము.[22] నరసపూడి శాసనకాలము 1374వ సంవత్సరము.[23] కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన కాలము 1364వ సంవత్సరము. 1337వ సంవత్సరము తర్వాత 1404వ సంవత్సరము వఱకు అన్నదేవచోడుని శాసనములు కానరావు.[24] కనుక అనవేమారెడ్డి నిడుదవోలు దుర్గమును జయించిన కాలము స్థూలముగ 1370వ సంవత్సరము కావచ్చును. అయిన, భీమరాజు నిడుదవోలు దుర్గాధిపతి అయిన కాలము స్థూలముగ 1370 – 1400. అనగా పదునాల్గవశతాబ్ది ఉత్తరార్థము.

పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్థము నందు నిడుదవోలు దుర్గాధిపతి అయిన భక్తిరాజు కొడుకు భీమరాజు రెండవ ఏఱువ భీముడు, కనుక చిక్కభీముడు కాఁగలడు. అతడు ఖండనభీముడును అగును. మైలమభీముడును కావచ్చును. కనుక చాటుపద్యములలోని ఏఱువ భీముడు మొదటి ఏఱువ భీముడు. మైలమ భీముడు, ఖండన భీముడు, చిక్కభీముడు రెండవ ఏఱువ భీముడు. అతడు భక్తిరాజు కొడుకు భీమరాజు. మొదటి ఏఱువభీముని కాలము పదమూడవ శతాబ్ది మధ్యభాగము. రెండవ ఏఱువభీముని కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్థము. పదమూడవశతాబ్ది మధ్యభాగములోని మొదటి ఏఱువభీమునకు సంబంధించిన ఏఱువభీమ పదము కల చాటుపద్యములు అజ్ఞాతకర్తృకములు. పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్థములోని రెండవఏఱువభీమునకు సంబంధించిన మైలమభీమ, ఖండనభీమ, చిక్కభీమపదములు కల చాటుపద్యములు వేములవాడభీమకవి కృతములు.

ఇక పదునేడవ శతాబ్ది నుండి పందొమ్మిదవశతాబ్ది వఱకు పూసపాటి రాజకవుల, విద్యాస్థానకవుల గ్రంథము లందు ఏఱువ భీముడు, మైలమభీముడు, ఖండనభీముడు, చిక్కభీముడు ఒకేవ్యక్తి అని కలదు. అంతేకాదు. అతడు పరిచ్ఛేది అని కలదు. ఉపరి అందుకు హేతుకల్పనము కలదు. పూసపాటి తమ్మిరాజు కృష్ణవిజయము నందు ఇట్లు కలదు –

తే. గీ. దేవసన్నిభుడైన యా దేవవర్మ
వంశపావని యగు నాత్మవనిత యందు
నాశ్రితశరణ్యు సకల శూరాగ్రగణ్యు
సుతు నొకని భీమనాయు విశ్రుతుని గాంచె – 97

చిక్కభీముఁ డనఁ బెంపెక్క జన్మపువేళ
బహుజాంకప్రేమ పాత్రమగుట
మైలమభీముఁడై మహాప్రసిద్ధి వహించె
మైలమాంబిక (కు) కుమారుడౌట
ఖండన భీముడన్ భవ్యనామముఁ గాంచె
ఖండన శౌర్య ప్రచండుడౌట
యేఱువభీముడై యిల గీర్తి విలసిల్లె
నెలమి నేఱువదుర్గ మేలుకొనుట

దండి మన్నీల మూకల గుండెదిగులు
బిఱుగు తునకలు చేసిన బిరుదుమగడు
దేవపతితుల్య విభవుండు దేవవర్మ
నందనుండైన భీమ భూనాయకుండు 98

ఆ భీమభూమీశుఁ డనిలోనఁ దనచేత
మును పరాజితుఁడయ్యు మూర్ఖవృత్తి
దండబల్లాణుండు దండెత్తి వచ్చిన
వానితో నెదిరించనాన యాత్మఁ
బొడమియో తన మహాద్భుత చర్య చూపనో
దైవయత్నమనో తనువు మూడు.

తునకలుగాఁ జేసికొనిన నప్పని చూచి
వెఱగంటి సకల పృథ్వీవరులును

సహహ తాన పరిచ్ఛేదియయ్యె నితఁడు
ధీరవరుఁడంచు బలుక నవ్విభుని యన్వ
యంబున జనియించినట్టి వారందరును బ్రి
సిద్ధిగాంచిరి ధరఁబరిచ్ఛేదు లనఁగ' - 99 ప., 1 ఆ.

ఇందు దేవవర్మ కొడుకైన భీమరాజు 1. పుట్టినప్పుడు బహుబాంధవ ప్రేమకు పాత్రుడగుటవలన చిక్కభీముడని, 2. మైల మాంబికకు కుమారుడగుటవలన మైలమభీముడని, 3. ఖండనశౌర్య ప్రచండుడగుటవలన ఖండన భీముడని, 4. ఏఱువదుర్గ మేలుట వలన ఏఱువభీముడని, 5. పిడుగును తునుకలు చేయుట వలన బిరుదు వుగడని, 6. ముపు పరాజితుడైనను మఱలదండెత్తివచ్చిన దండబల్లాణుడు కారణముగ తనువును మూడు తునుకలు చేసి కొనుట వలన పరిచ్ఛేది అనియును కలదు. ఇవియెల్ల పరిశీల నార్హములు.

1. చిక్క శబ్దమునకు, బహుబాంధవ ప్రేమపాత్రతకు - కార్యకారణ సంబంధము కానరాదు. అంతేరాదు. 'నియమాభిరామత నిప్పటిల్లుచు జిక్క చిక్కభీమాఖ్యచే జెన్ను మిగిలె'నని ఓరుగంటి సోమశేఖరకవి రామకృష్ణార్జునరూప నారాయణీయము నందు కలదు. నియమనిష్ఠలు నిమిత్తముగ చిక్కిపోవుటవలన చిక్కిన భీముడను పేరు రావచ్చునుగాని, చిక్కభీముడను పేరురాదు. కనుక దేవవర్మ కొడుకైన భీమరాజు జన్మకాల బహుబాంధవ ప్రేమపాత్రత వలనఁ గాని, నియమాభిరామ నిమిత్త శుష్కత వలనఁగాని చిక్కభీము డగుట నిజము కాదు.

2. మైలమాంబిక కుమారుడగుట వలన దేవవర్మ కొడుకైన భీమరాజు మైలమభీముడగుట నిర్ధారకము.

3. మైలమ భీముడైన, దేవవర్మ కొడుకైన, భీమరాజు ఖండన శౌర్య ప్రచండుడగుట వలన ఖండనభీముడగుట తథ్యము.

4. ఏఱువ దుర్గాధిపతి అయిన ఏఱువభీముడు ఒక్కడే కలడు. అతడు పదమూడవ శతాబ్ది మధ్యభాగములోని మొదటి ఏఱువ భీముడు. అతడే, ఇతడనుట సంగతము కాదు. కారణము, ఇతని తల్లిపేరు మైలమాంబిక అని ఇందే కలదు. అతని తల్లి పేరు అన్యమాంబ అని శాసనమునందే కలదు. అంతేకాదు. ఏఱువ దుర్గము కడప, కర్నూలు, మండలములకు సంబంధించినది.25 దేవవర్మ కొడుకైన భీమరాజు తాత మాధవవర్మ నిడుదవోలు దుర్గ మును నిలిపినట్లు కృష్ణవిజయము నందే కలదు.

'ధర్మనియతిచేత ధర యేలుచుండి యా
బుద్ధవర్మ సుతుడు భువన నుతుడు
నిడుదవోలి చెంత నిలిపెను దుర్గంబు
గిరినమంబుగాగఁ గీర్తికొఱకు' (94 ప., 1 ఆ.)

ఇందలి బుద్ధవర్మ సుతుడు మాధవవర్మయే. అతని మను మడు నిడుదవోలు దుర్గాధిపతి అగును. నిడుదవోలు దుర్గము పశ్చి మగోదావరీ మండలమునకు సంబంధించినది. పశ్చిమ గోదావరీ మండలములోని నిడుదవోలు దుర్గాధిపతి కడప మండలములోని ఏఱువ దుర్గాధిపతి అగుట దుర్ఘటము. కనుక దేవవర్మ కొడుకైన భీమరాజు ఏఱువదుర్గ మేలుటవలన ఏఱువ భీము డగుట యథార్థము కాదు.

5. నిజమైన పిడుగును తునుకలు చేయుట దుస్సాధ్యము. కనుక దేవవర్మ కొడుకైన భీమరాజు నిజమైన పిడుగును తునుకలు చేయుట వలన బిరుదుమగడగుట సత్యము కాదు.

6. ఎవరి తనువును వారు మూడు తునుకలు చేసికొనుట దుష్కరము. అంతేకాదు. పదకొండవ శతాబ్ది పూర్వార్ధములోని చిక్కభీమరాజు బ్రదికి యుండగానే, తానే వేయించిన తామ్రశాస నమునందే, 'వేయూరి పరిచ్ఛేద చిక్క భీమరాజులు' అని కలదు. ఇదిగమనార్హమైన విశేషమని పూర్వోక్తము. వేయూరి పరిచ్ఛేదమున వేయూరి ప్రాంతమని అర్థము. పరిచ్ఛేద పదవాచ్యమైన ప్రాంతమునకు అధిపతి పరిచ్ఛేది అగును. కావున పరిచ్ఛేది అనగా సామంతరాజు. అథవా, దుర్గాధిపతి. కనుక దేవవర్మ కొడుకైన భీమరాజు తనువును మూడు తునుకలు చేసికొనుట వలన పరిచ్ఛేది అగుట వాస్తవికము కాదు.

పదునేడవ శతాబ్ది నుండి నూనపాటి రాజకవుల, తదాస్థాన కవుల గ్రంథము లందు కల విషయములు సమకాలిక సమాచార ములు కావు. కనుక పరమ సత్యములు కావు. శుద్ధాబద్ధములును కాఁజాలవు. భ్రమ ప్రమాద భరితములు కావచ్చు ను. అంతేకాదు. పదునాల్గవ శతాబ్ది చాళుక్య ద్వయములోని మైలమ భీముని, ఖండనభీముని విషయము, పదునేడవ శతాబ్దినుండి నూనపాటి రాజ కవుల, తదాస్థానకవుల గ్రంథములలోని, మైలమభీముని, ఖండన భీముని విషయమును సంవదించునవి. కనుక ఏఱువభీముని చిక్క భీముని విషయములును సంవదించునవి కావలయును.

నిడుదవోలు దుర్గాధిపతి అయిన శక్తిరాజు కొడుకు భీమ రాజు, నిడుదవోలు దుర్గాధిపతి అగు దేవవర్మ కొడుకు భీమరాజు ఒకడైనచో, అతడు రెండవ ఏఱువ భీముడు అగును. చిక్కభీము

డును అగును. భక్తిరాజు కొడుకు భీమరాజు సూర్యవంశ క్షత్రియుడు. దేవవర్మ కొడుకు భీమరాజును సూర్యవంశ క్షత్రియుడు. భక్తిరాజు కొడుకు భీమరాజు తల్లి పేరు మైలమాంబ కావచ్చును. దేవవర్మ కొడుకు భీమరాజు తల్లి పేరు మైలమాంబ అగును. భక్తి రాజు అసలు పేరు కామరాజు. పూర్తిపేరు కామదేవచోడుడు. దేవవర్మ తాత పేరు మాధవవర్మ. కామదేవచోడ నామధేయములోని దేవ శబ్దము, మాధవవర్మ నామధేయములోని వర్మశబ్దము కలిసి దేవవర్మ నామధేయము కాలక్రమమున కల్పితము కావచ్చును. అసలు మాధవవర్మ ఆరవ శతాబ్ది విష్ణుకుండిరాజు. అతడు మూలపురుషుడుగ చెప్పికొనుట అనేక రాజవంశములకు పరిపాటి. విష్ణుకుండి మాధవ వర్మ కొడుకు పేరు దేవవర్మ. మాధవవర్మ ప్రభావమున భీమరాజు తండ్రి పేరు దేవవర్మ అని కల్పితము కావచ్చును. భక్తిరాజు కొడుకు భీమరాజు అనవేమారెడ్డి అల్లుడు. అనగా భీమరాజు భార్య అన్య కులజ. స్వకులజను ముందు వివాహము చేసికొని, అన్యకులజను ఆ తర్వాత వివాహము చేసికొనుట ఆనాటి రాజుల ఆచారము. అట్లు భీమరాజునకు క్షత్రియభార్య యందు కలిగిన సంతానము క్షత్రియ వంశమే అగును. కనుక భక్తిరాజు కొడుకు భీమరాజు, దేవవర్మ కొడుకు భీమరాజు ఒకడే కావచ్చును. అయినపక్షము నందు మాత్రమే అతడు ఏఱువ భీముడు, చిక్కభీముడు అగును.

చిక్కభీము పదములకల రెండవ చాటుపద్యము నందు చిక్కభీముడు కత్తితో పిడుగును కొట్టినట్లు కలదు. దేవవర్మ కొడుకైన భీమరాజు 'పిడుగును తునకలు' చేసినట్లు కలదు. చిక్కభీముడు చేసినపని, చిక్కభీముడు అనబడిన దేవవర్మ కొడుకైన భీమరాజు చేసిన పని ఒకటే. అది చాటుపద్యము నందు వివరముగ కలదు. చిక్కభీముడు యుద్ధము నందు చిరాలున కత్తిదూసివెంటనే కత్తిమొన తాకినంతనే పిడుగు ప్రేలిపడునట్లు కొట్టెనని కలదు. అంతేకాదు. అది ఏలేరును గసిమి భైరవేశుడును ఎఱుగుననికలదు. ఇందలి 'ఏలేరు, కసిమి' మైలమభీమన జయించినట్లు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వివరణము.[26] ఏలేఱు దేశము కాదు. నది. తూర్పు గోదావరి మండలము లోని పిఠాపురము, పెద్దాపురము ప్రాంతము లందు ప్రవహించునది. 'ఏ పట్టనము ప్రోల నేలేఱు ప్రవహించుఁ బృథివికి ముత్యాల పేరువోలె' అనియు (52 ప., 2 ఆ.), 'జగతి నెక్కుడ నేలేటి సాటినదులు' అనియును (53 ప., 2 ఆ.), 'ఏలేటి మేటికాలువల వలన నదీమాతృకంబగు పంట వలంతి' అనియును (55 వచ., 2 ఆ.) శ్రీనాథుని భీమఖండము నందు కలదు. అంతేకాదు. 'పెద్దగవనుల నేపుట భేదనమున నెలమి నిలుచుండు ప్రీడావిహీన జఘనుఁడట్టి పీఠికాపురము' అనియు (52 ప., 2 ఆ.), 'భూతబేతాళఢాకినీ ప్రేతరంకభైరవ ప్రాత నిర్మిత ప్రాకారవప్రపహట్టకుట్టి మంబగు పీఠాపట్టనంబు' అనియును (55 వచ., 2 ఆ.) శ్రీనాథుని భీమఖండము నందు కలదు. అనగా పిఠాపురముకోట గవని యందు ప్రీడావిహీనజఘనుడైన భైరవుడు కలడని అవగాహన మగును. అతడు కసిమిభైరవేశుడు అగును. పిఠాపురము కోటదరి ఏలేఱు, కోటగవని భైరవుడును ఎఱుగునట్లు చిక్కభీముడు కత్తితో పిడుగును కొట్టెనన, ఆ సంఘటన పిఠాపురము నందు జరిగినదని అర్థము. చిక్కభీముడు పిడుగును ప్రేయుట 'ఆలమున' అని చాటుపద్యము నందు కలదు గావున ఆ పిడుగు నిజమైన పిడుగు కాదని, పిడుగు వంటి చిక్కభీముని శత్రువని అవగాహన మగును. ఆ కాలము నందు పిఠాపుర రాజ్యాధిపతులు కొప్పుల నాయకులు. కనుక చిక్కభీముని శత్రువైన పిఠాపుర రాజ్యాధిపతి, కొప్పుల నాయకుడు కావలయును. 1333వ సంవత్సర ప్రాంతమందు పిఠాపుర రాజ్యాధిపతియును, కొప్పుల నాయకుడును అయిన ప్రోలయనాయకుని కాటయవేమారెడ్డి జయించెను.[27] అనపోతారెడ్డి అల్లుడైన కాటయవేమారెడ్డి కళింగదేశ జైత్రయాత్రలో అనవేమారెడ్డి అల్లుడైన భక్తిరాజు కొడుకు భీమరాజు పాల్గొనుట సహజము. అతడు పిఠాపుర రాజ్యాధిపతి అయిన ప్రోలయ నాయకుని పిఠాపురము నందు కత్తితో సంహరించుట కూడ సంభవము. కనుక పిఠాపుర రాజ్యాధిపతి అయిన ప్రోలయ నాయకుడే పిడుగు. అనగా పిడుగు శబ్దము బిరుదు. కత్తితో నరుకుటకైన, తునకలు చేయుటకైన తరమైనది నిజమైన పిడుగు కాదు. బిరుదైన పిడుగు మాత్రమే. కనుక 'ఆలమున వాలతివేగమునఁబెఱికి పడి తుదఁగవియన్ ప్రేలిపడఁ బిడుగునేసిన' భక్తిరాజు కొడుకు భీమరాజు, 'పిడుగు తునకలు చేసిన బిరుదు మగడు' అయిన దేవవర్మ కొడుకు భీమరాజు ఒక్కడే.

భక్తిరాజు కొడుకైన భీమరాజు ఏఱువభీముడు కాఁగలడు కాని, ఏఱువ దుర్గాధిపతి కాఁజాలడు. ఏఱువ దుర్గాధిపత్యము మొదటి ఏఱువ భీమునితోనే ముగిసినది.[28] అది రెండవ ఏఱువ భీముని పరముగ గ్రంథస్థ మగుట భ్రమాత్మకము.

రెండవ ఏఱువ భీముడైన భక్తిరాజు కొడుకు భీమరాజు నిడుదవోలు దుర్గాధిపతి అయిన కాలము నందు, అతని సవతిసోదరుడు అన్నదేవచోడుడు, అనవేమారెడ్డి నిడుదవోలు దుర్గము నుండి తఱిమివైచినను – నిలువనీడలేని వాడు కాలేదు. 'అంచోడభక్తిం ద్రిసన దేవరాజును బెంపారఁగాచె మీ పిన్నతాత' అని దేవరకొండ వెలమరాజైన లింగమనేని గుఱించి వెలుగోటివారి వంశావళి యందు కలదు (122 ప.) లింగమనేని పినతాత పెద్ద వేదగిరి. అతని రక్షణమున అన్నదేవచోడుడు దేవరకొండలో ఉన్నపుడ



7

బహమనీసుల్తానుల కొలువునకు రాకపోకలు సాగించి, 1398 వ సంవత్సరము నందు ఫిరోజిషహా విజయనగర సేనలను జయించుటకు సహకరించెను.29 అంతేకాదు. అన్నదేవచోడుని దక్షారామ శాసనములు 1404వ సంవత్సరము నుండి కలవు.30 కనుక అన్నదేవచోడుడు ఫిరోజిషహా, పెద్ద వేదగిరుల సహాయమునంది, రాజమహేంద్రవర రాజ్యాధిపతి కాటయ వేమారెడ్డి, కొండవీటి సామ్రాజ్యాధిపతి పెదకోమటి వేమారెడ్డితో సంఘర్షణపడుచున్న సమయమునందు, దండయాత్ర సాగించి, నిడుదవోలు దుర్గమును మాత్రమే గాక, రాజమహేంద్రవర రాజ్యములోని ప్రముఖ భాగమును స్వాధీన పఱుచుకొన్నట్లు మల్లంపల్లి సోమశేఖరశర్మగారి సమన్వయము.31 అన్నదేవచోడుని తోడి యుద్ధము నందు భీమరాజు మరణించుట సంభవము. 1404వ సంవత్సరము నకు ముందే నిడుదవోలు దుర్గము అన్నదేవచోడుని అధీనమైనది. అన్నదేవచోడుడు 'మును పరాజితు డయ్యు మూర్ఖవృత్తి దండెత్తివచ్చిన' వాడే. కాని 'దండ బల్లాణుడు' అని పదునేడవ శతాబ్ది నుండి గ్రంథములందు కలదు. బల్లాణ, బల్లాళ శబ్దములు ఒకటే. ద్వారసముద్రము రాజధానిగ కర్ణాటదేశము నందు నాలుగు శతాబ్దుల కాలము (940–1346) రాజ్యమేలిన హొయసళరాజు లందు నలుగురు బల్లాళరాజులు కలరు. మొదటి బల్లాళ రాజు కాలము32 1102–1108. రెండవ బల్లాళరాజు కాలము33 1173–1200. మూడవ బల్లాళరాజు కాలము34 1291–1343. నాల్గవ బల్లాళరాజు కాలము35 1343–1346. ఒక్క బల్లాళరాజును మొదటి ఏఱువభీమునికి గాని రెండవ ఏఱువ భీమునికి గాని సమకాలికుడు కాడు. రెండవ బల్లాళరాజు 1220వ సంవత్సరము నందు స్వర్గస్థుడు.36 మొదటి ఏఱువ భీముడు 1220వ సంవత్సరము తర్వాతనే సజీవుడు. కనుక రెండవ బల్లాళరాజును దండబల్లాణుడు కారాదు. హొయసళరాజ్యం 1346 వ సంవత్సరము నందు విజయనగర సామ్రాజ్యము నందు విలీనమైపోయినది.37 తర్వాత నాల్గవ బల్లాళరాజు నామరూపములు కానరావు. కనుక నాల్గవ బల్లాళరాజు కూడ దండబల్లాణుడు కారాదు. అంతేకాదు. ద్వారసముద్రపాలకులు నిడుదవోలు దుర్గము మీదికి దండెత్తి వచ్చుట కూడ సంభవము కాదు. దండెత్తి వచ్చిన సందర్భమును లేదు. మఱొక బల్లాళరాజు కానరాడు. కనుక దండబల్లాణుడు అను వ్యవహారము ఒక బల్లాళరాజు నామము కారాదు. మఱొకరాజు ఉపనామము కావలయును. మూడవ బల్లాళరాజు అనేక యుద్ధము లందు ఆరితేరినవాడు. ఢిల్లీసుల్తాను అయిన అల్లాఉద్దీన్‌ఖిల్జీతో రాయబారము చేసినవాడు.38 అంతేకాదు. అల్లాఉద్దీన్‌ఖిల్జీ ప్రతినిధి అమీర్ ఖుస్రూతో సంధిబేరము పెట్టినవాడు.39 ఉపరి, అమీర్ ఖుస్రూ దక్షిణ భారతదేశ దండయాత్రలో ద్రావిడ దేశమునకు దారి యిచ్చినవాడు.40 ఒకవిధముగ రాజనీతి చతురుడు. మఱొకవిధముగ మాతృదేశద్రోహి. భుజబలము వినా బుద్ధిబలము లేనివాడు. అట్టి మఱొక రాజునకు అతనిపేరు సంక్రమించుట సహజము. దండ శబ్దమునకు భుజబల మనియును అర్థము కలదు. దండ బల్లాణు డన భుజబలము కల బల్లాణుడని వాచ్యార్థము. బుద్ధిబలములేని బల్లాణుడని వ్యంగ్యార్థము. అన్నదేవచోడునికి ఫిరోజిషహా సహాయము, మూడవ బల్లాళరాజునకు అమీర్‌ఖుస్రూ సహాయము వంటిది. కనుక అన్నదేవచోడునికి కాలక్రమమున, మూడవ బల్లాళరాజు తోడి సామ్యమున, దండ బల్లాణుడు అను ఉపనామము కలుగుట సంభవము. అది పదునేడవ శతాబ్ది నుండి గ్రంథస్థము కావచ్చును.

పదునేడవశతాబ్ది నుండి పూసపాటి రాజకవుల, తదాస్థాన కవుల గ్రంథము లందు దేవవర్మ కొడుకైన భీమరాజు తర్వాత వంశానుక్రమణిక లేదు. కృష్ణ విజయము నందు ఇట్లు కలదు–

'అద్భుత శౌర్యగుణాలంకృతుండైన
యా చిక్క–భీముని యన్వయమున
రఘువు వంశంబున రామచంద్రుని లీల
యదుకులంబునను గంసారిరీతి
భరతసంతతి యందు పాండవాగ్రణియట్లు
స్థిర దయాసమున్నయశ్రీ విలాస
ధర్మగుణంబుల ధన్యత వహియించి
పూసపాటి పురాంక భూషణుండు
భువనవర్ణిత సౌందర్యపూర్ణ రాజు
రాజవినుతార్థ గౌరవ రాజరాజు
దివ్యభోగవినిర్జిత దివిజరాజు
సమర నృగరాజు జనియించె నమలరాజు'–106 ప., 1 ఆ.

ఇందు చిక్క–భీముని అన్వయము నందు అమలరాజు జన్మించెనని కలదు. అనగా అమలరాజు భీమరాజు కొడుకు కాడు. వంశీయుడు మాత్రమే. ఇది తదితర గ్రంథము లందును పఠిత పాఠము. కాని, అనంతగజపతి ఆస్థాన పండితుడైన మండచిట్టి కామేశ్వరశాస్త్రి మార్కండేయ పురాణము నందు ఇట్లు కలదు –

'ఆ భీమనందనుం డమల రాజాఖ్యుండు
కనకదుర్గాకటాక్ష ప్రసార
మాత్మాంగమునకు రక్షార్థంబు కవచమై
దనర శాత్రవులను దునిమి పెక్కు–

రాజ్యములెకొని రాజరాజ సమాన
  వైభవుండయి కీర్తి వర్ధిలంగ
పూషవంశ్యుల వాసభూమి నాఁగ నొక
  పూషపాట మనంగ బొలుచుపురము

కొండపలిసీమ నొనరించి యుండె నందు
బామరోక్తుల నది పూసపాడనఁదగె
నది మొదలు పూసపాటివారైరి యమల
రాజవంశజులైనట్టి రాజులెల్ల'

ఇందు అమలరాజు భీమనందనుడని ఇదమిత్థముగ కలదు. అనగా అమలరాజు భీమరాజు వంశీయుడు కాడు. కొడుకు. ఆ భీమరాజు మైలమభీముడు, ఏఱువభీముడు, చిక్కభీముడు అని మార్కండేయ పురాణము నందును కలదు. అమలరాజు భీమరాజు అన్వయము నందు జన్మించినట్లు కల విషయము నిజమైనచో ఆ భీమరాజు రెండవ ఏఱువభీముడు కాఁజాలడు. మొదటి ఏఱువ భీముడే అగుటకు, అతని తల్లి పేరు అన్యమాంబ. మైలమాంబకాదు. కనుక మైలమభీముడు కాడు. చిక్కభీముడును కాడు. కనుక రెండవ ఏఱువభీముడును కావలయును. మొదటి ఏఱువభీముడని భ్రమపడుట వలన, మొదటి ఏఱువభీముని కాలమునకు, అమలరాజు కాలమునకు అన్వయము కుదురక, అన్వయము నందు జన్మించినట్లు కల్పించవచ్చును. కనుక అమలరాజు భీమరాజు అన్వయము నందు జనించినట్లు కల విషయము నిజము కాదు. అమలరాజు కొడుకని కల విషయము నిజమైనచో, ఆ భీమరాజు రెండవ ఏఱువభీముడు అగును. చిక్కభీముడును అగును. మైలమభీముడు ఎట్లును అగును. కనుక అమలరాజు భీమరాజు కొడుకని కల విషయము నిజము. అంతేకాదు నిడుదవోలు దుర్గాధిపతి అయిన భీమరాజు కొడుకు అయిన పక్షమున నందు అమలరాజు పూసపాడు నివాసి అగును. అన్నదేవచోడుడు తిరిగి నిడుదవోలు దుర్గమును ఆక్రమించినపుడు, అతడు భీమరాజు కుటుంబ సభ్యులను నిడుదవోలు దుర్గము నుండి తఱిమి వైచును. కనుక భీమరాజు కుటుంబసభ్యులకు ఎటకేని పోవలసిన అవశ్యకము కలదు. గోదావరీ మండలమును వదలి కృష్ణా మండలమునకు పోవుటకు అవకాశము కలదు. అప్పుడు కృష్ణామండలములోని కొండపల్లి రాజ్యాధిపతి, కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన పెదకోమటి వేమారెడ్డి తమ్ముడైన పెదకోమటి మాచారెడ్డి. పెదకోమటి వేమారెడ్డికి అనవేమారెడ్డి 'మామ్మ పినతండ్రి' అని మూలగూరమ్మ శాసనము నందు కలదు.**41** కనుక పెదకోమటి వేమారెడ్డి తమ్ముడైన పెదకోమటి మాచారెడ్డి, అనవేమారెడ్డి అల్లుడైన భీమరాజు కుటుంబ సభ్యులకు కొండపల్లి రాజ్యము నందు రక్షణ కల్పించుట సహజము. కనుక, నిడుదవోలు దుర్గాధిపతి కావలసిన అమలరాజు కొండపల్లి సీమలోని పూసపాడు నివాసి అగుటకు, అతడు భీమరాజు కొడుకు అగుట, ఆ భీమరాజు రెండవ ఏఱువ భీముడైన భక్తిరాజు కొడుకు భీమరాజు అగుట కూడ అగుకూలము.

మొత్తముమీద పూసపాటి రాజకవుల, తదాస్థానకవుల గ్రంథములలోని చరిత్రాంశములు కేవలము పుక్కిటి పురాణములు కావు. సమకాలిక సమాచారములు లేకపోవుట వలన భ్రమప్రమాద భరితములు. ప్రసిద్ధ వ్యవహార ప్రభావితములు. కనుక ఏఱువ భీముడు, చిక్కభీముడు అనఁబడిన మైలమభీముడు అయిన, దేవవర్మ కొడుకైన భీమరాజు-ఏఱువ భీముడు, చిక్కభీముడు అయిన మైలమభీముడు అగు భక్తిరాజు కొడుకైన భీమరాజు ఒకడు. అతని క్షత్రియభార్య కొడుకు అమలరాజు. భీమరాజు జననకాలము స్థూలముగ 1330వ సంవత్సరము. భీమరాజు అన్యకులజను (అనవేమా రెడ్డి దౌహిత్రిని) వివాహమాడిన కాలము స్థూలముగ 1355వ సంవ త్సరము స్వకులజను ముందు వివాహమాడిన కాలము 1350వ సం॥ కావచ్చును. అదే సంవత్సరము అమలరాజు జన్మింపవచ్చును కనుక అమలరాజు జననకాలము స్థూలముగ 1350వ సంవత్సరము

అమలరాజునకు అయిదుగురు కొడుకులు. పెద్దకొడుకు పేర మాధవరాజు. అమలరాజు పూసపాడునివాసి. అమలరాజు వంశీయుల పూసపాటి వారు. కనుక అమలరాజు పెద్దకొడుకు మాధవరాజు పూసపాటి మాధవరాజు. అతడు పూసపాటి మాధవవర్మ అగును ఇక వక్కలంక వీరభద్రకవి వాసవదత్తా పరిణయము నందు ఇట్లు కలదు -

'అయ్యెడ సూర్యవంశాంభోధి చంద్రుడై
  విక్రమక్రమలీల వెలయు నుదయ
పురపు రాజావారి వరకుటుంబంబులో
  నుండి వెల్వడి మహోద్దండశక్తి
పూసపాటి కులోద్భవుండైన మాధవ
  వర్మయన్ వసుమతీ వల్లభుండు
విపుల సైన్యముతోడ బెజవాడ చెంత న
  ప్పెద్ద సింగక్షమావిభువరేణ్యు

సురపురీవర సౌఖ్యభాసురునిఁజేసి
క్షత్రియాత్రాఖిలాషచే సరవినాతఁ
డానెగొందిపురాది గోత్రాధిపతులఁ
బటుతరఘుటాబలాసూనపటిమ గెలిచి' - (43 ప., 1 ఆ.)

ఇందు అనెగొందిపురాధిపతు లన విజయనగర సామ్రాజ్యాధిపతులు. అందు రెండవ హరిహరరాయల అనంతరము, మొదఁ

దేవరాయలు సింహాసనాధ్యాసి అగుటకు ముందు, పెదకోమటి వేమారెడ్డి సేనాధిపతులు విజయనగర సేనలను ఓడించి, పోయిన భూభాగములను తిరిగి కైవసము చేసికొనుట జరిగినది.42 అది పెద్దకోమటి వేమారెడ్డి, అతని తమ్ముడు పెదకోమటి మాచారెడ్డి కలిసి సాధించిన విజయము. ఆ విజయ యాత్రిలో, మాచారెడ్డి ఆశ్రియములోని అమలరాజు కొడుకు మాధవరాజు పాల్గొనుట సహజము. అతడు పూసపాటి మాధవవర్మ అగును. కనుక పూసపాటి మాధవవర్మ ఆనిగొంది పురాధిపతులను గెలిచిన కాలము 1404 వ సంవత్సరము కావలయును.

ఇక పూసపాటి మాధవవర్మ స్వర్గస్థుని చేసిన పెద్దసింగక్షమావిభుడు రావు వంశములోని బేతాళరావు తనూభవు డని ముందు కలదు (41, 41 ప.,వా.ప.). కాని పెద్దసింగక్షమావిభుని తనయుడు అనపోతమహీపతి అని(51ప.,వా.ప.), అనపోతమహీపతి తనయుడు సర్వజ్ఞసింగమనేడు అని (55 ప.,వా.ప.) తర్వాత కలదు. కనుక పెద్దసింగక్షమావిభుడు రావు బేతాళరావు తనూభవుడు కాడు. వంశభవుడు మాత్రిమే. అంతేకాదు. పెద్దసింగక్షమావిభుడు అనగా పెద్దసింగమనేడు. రసార్ణవ సుధాకర కర్త. అతనికి అనపోత, దావ, వల్లభ, వేదగిరిస్వామి, మాద్య దామయలు అనుసుడు కొడుకులని రసార్ణవ సుధాకరము నందు కలదు. (35 శ్లో., ర ం ఉ.). పెద్దసింగమనేడు పదునాల్గవశతాబ్ది తుదిని కలడని నేలటూరి వేంకటరమణయ్యగారి సమన్వయము.43 రాజ్యకాలము 1384-1399 అని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి సూచనము.44 పెద్దసింగమనేడు సరిగా 1399వ సంవత్సరము నందే స్వర్గస్థుడయినట్లు గాని, అతని కొడుకు అనపోతనేడు సరిగా 1399వ సంవత్సరము నందే సింహాసనస్థుడయినట్లు గాని ప్రిమాణము లేదు. అంతేకాదు. దేవరకొండ వెలమరాజు పెద్దవేదగిరి, రాచకొండ వెలమరాజు పెదసింగమనేడు అన్నదమ్ముల బిడ్డలు. ఉభరి సమకాలికులు. సమవయస్కులు కావచ్చును. కనుక పెదసింగమనేడు స్వర్గస్థుడైన కాలము 1399వ సంవత్సరమునకు కొంత తర్వాతను కావచ్చును. పూసపాటి మాధవవర్మ ఆనిగొంది పురాధిపతులను గెలుచుటకు ముందు పెద్దసింగక్షమావిభుని స్వర్గస్థుని చేసినట్లు పద్యము నందు కలదు. కనుక పూసపాటి మాధవవర్మ పెద్దసింగక్షమావిభుని స్వర్గస్థుని చేసిన కాలము 1403వ సంవత్సరము కావచ్చును. పూసపాటి మాధవవర్మ పెద్దసింగక్షమావిభుని స్వర్గస్థుని చేసి, ఆనిగొంది పురాధిపతులను గెలిచి, తద్విజయ స్తంభములను వేయించిన కాలము వాసవపత్రా పరిణయము నందు ఇట్లు కలదు -

'అజచంద్రదయోరాశి
ద్విజరాజుల హూణశకము వెలసెడు నెడ(న)
ద్విజయస్తంభచయంబుల
నిజకీర్తి లెసంగ నచట నిలిపెం గడిమిన్' (44ప., 1 ఆ.)

ఇందు హూణశక మన క్రీస్తుశకము. అజచంద్రదయోరాశి ద్విజరాజ సంఖ్య 1419. కనుక పూసపాటి మాధవవర్మ విజయ స్తంభములను వేయించిన కాలము 1419వ సంవత్సరము. 1403వ సంవత్సరము నందు పెద్దసింగక్షమావిభుని స్వర్గస్థుని చేసి, 1404వ సంవత్సరము నందు ఆనిగొంది పురాధిపతులను గెలిచి అప్పుడే తద్విజయ స్తంభములు ప్రతిష్ఠించుటకు పూసపాటి మాధవవర్మ కొండపల్లి రాజ్యాధిపతి గాని, కొండవీటి సామ్రాజ్యాధిపతి గాని కాడు. కొండపల్లి రాజ్యాధిపతి పెదకోమటి మాచారెడ్డికి గాని, కొండవీటి సామ్రాజ్యాధిపతి పెదకోమటి వేమారెడ్డికి గాని సేనాధిపతి కావచ్చును. పెదకోమటి వేమారెడ్డి చరమకాలము 1419వ సంవత్సరము.45 అది పూసపాటి మాధవవర్మ స్వతంత్రుడై విజయ స్తంభములను వేయించుటకు అనుకూలమైన కాలము. అందుకు పూసపాటి మాధవవర్మ 1403వ సంవత్సరము నందు పెద్దసింగక్షమావిభుని స్వర్గస్థుని చేయుటకు, 1404వ సంవత్సరము నందు ఆనిగొంది పురాధిపతులను గెలుచుటకు, అతని వయస్సు అప్పటికి కనీసము 35 సంవత్సరములైన కావలయును. కనుక పూసపాటి మాధవవర్మ జననకాలము స్థూలముగ 1404 - 34 = 1370వ సంవత్సరము. అమలరాజు జననకాలము స్థూలముగ 1350వ సంవత్సరము. అతని పెద్దకొడుకు మాధవరాజు జననకాలము స్థూలముగ 1370వ సంవత్సరము. కనుక అమలరాజు పెద్దకొడుకు మాధవరాజు పూసపాటి మాధవవర్మ అగుట అమలరాజు భీమరాజు కొడుకు అగుట కూడ కాలానుకూలము.

పయి విచారణకు ఫలితాంశము లివి -

1. చాటు పద్యములలోని ఏఱువ భీముడు మొదటి ఏఱువ భీముడు.
2. చిక్కభీముడు, మైలమభీముడు అయిన ఏఱువ భీముడు రెండవ ఏఱువ భీముడు.
3. రెండవ ఏఱువ భీముడు, చిక్కభీముడు అయిన మైలమభీముడు అగు భక్తిరాజు కొడుకైన భీమరాజు,- ఏఱువ భీముడు, చిక్కభీముడు అనబడిన మైలమ భీముడు అయిన దేవవర్మ కొడుకైన భీమరాజు ఒకడు.
4. మైలమభీముని జననకాలము స్థూలముగ 1330వ సంవత్సరము.

5. మైలమభీముని కొడుకైన అమలరాజు జననకాలము స్థూలముగ 1350వ సంవత్సరము.

6. అమలరాజు పెద్దకొడుకైన మాధవరాజు జననకాలము స్థూలముగ 1370వ సంవత్సరము.

7. మైలమభీముడు నిడుదవోలు దుర్గాధిపతి అయిన కాలము స్థూలముగ 1370 - 1410.

ఇది పూసపాటి రాజకవుల, తదాస్థాన కవుల గ్రంథముల లోని ఇతర చరిత్ర విషయములకును అనుగుణమే. అది మరొక వ్యాసము.

**సూ చి క లు**

1. చాటుపద్య మణిమంజరి, ద్వితీయభాగము, పు. 58
2. అదే - పీఠిక, పు. 1
3. గ్రౌను జాబుల్లో .... కడపజాబుల సంకలనం, పు. 90
4. శాసనపద్యమంజరి, ప్రథమ భాగము, పుటలు 91-2
5. హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 107
6. అదే
7. అదే
8. అదే
9. ప్రాచీనాంధ్ర శాసనాలు, పుటలు 93-9
10. భారతి, జూన్ 1982. సం. 59, సం. 6, పుట 10
11. (ఎ) ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 3, పుటలు 241-59
    (బి) రెడ్డి సంచిక, పు. 438
12. హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 108
13. అదే, పుట 83, అధస్సూచిక 27
14. అదే
15. (ఎ) భారతి, అక్టోబరు 1960, సం. 37, సం. 10 పుట 21
    (బి) రెడ్డిరాజుల చరిత్రము, పుట 241
16. (ఎ) భారతి, అక్టోబరు 1960, సం. 37. సం. 10. పుట 17
    (బి) రెడ్డిరాజుల చరిత్రము, పుట 240
17. (ఎ) హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 76
    (బి) శ్రీనాథుడు, పుట 6
18. (ఎ) హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 95
    (బి) శ్రీనాథుడు, పుట 9
19. హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 84
20. అదే, పుట 109
21. అదే, పుట 115
22. దక్షిణ హిందూదేశ శాసనములు, సంపుటము 10, సంఖ్య 556, పుట 307
23. ఎగిగ్రాఫియా ఇండికా, సంపుటము 3, పుట 286
24. హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 115
25. (ఎ) రెడ్డి సంచిక, పుట 49
    (బి) ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పుట 39
26. చాటుపద్య మణిమంజరి, ద్వితీయ భాగము, పుట 58
27. రెడ్డి సంచిక, పుటలు 161-2
28. అదే, పుట 52
29. హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 175
30. అదే
31. అదే
32. ది హొయసళస్, పుటలు 38-43
33. అదే, పుటలు 80-109
34. అదే, పుటలు 143-172
35. అదే, పుట 173
36. అదే, పుట 104
37. అదే, పుట 173
38. అదే, పుట 154
39. అదే, పుటలు 149-56
40. అదే, పుట 151
41. శాసన పద్య మంజరి, ప్రథమ భాగము, పుటలు 90
42. హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 159
43. వెలుగోటి వారి వంశావళి, పీఠిక, పుట 22
44. హిస్టరీ అఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పుట 24
45. అదే, పుట 167



# ప్రేమలేఖ

ఒరియా మూలం: వికాస్ దాస్
అనువాదం: జ్యోత్స్న

కొన్ని కలలు
కొంత అభిమానం
కాసిన్ని వెక్కిళ్ళు
కాసిన్ని కన్నీటి చుక్కలు
మరిన్ని అభ్యర్థనలతో –
నువు తయారవుతావు !

కొండంత భయంతో
దాక్కొని దాక్కొని
ఎలా అయితేనేం
చేరాల్సిన చోటికి చేరతావు !

ఒక్కొక్కసారి నువు
ఎవరి చేతిలోనో పడి
నీలో నువ్వే కుళ్ళి కుళ్ళి ఏడుస్తావు

నీ హృదయం ఓ చకోరం
నిరంతరం సంచరిస్తూనే వుంటుంది
ఏదో పొందాలని !

కానీ నువు ఎంత గొప్పదానివంటే –
విషం తాగి –
చావడానికి సిద్ధపడుతున్న వారు కూడ –
నిన్ను అందుకుని
కొన్ని క్షణాలు బతకడానికి సిద్ధపడతారు !

నిన్నెవరు రాస్తారో
వారు రాత్రులు మాత్రమే రాస్తారు !
అందరూ నిద్రపోయిన తరువాత
ఏకాంతంలో –
అందాల్ని కవిత్వాన్ని గుప్పిస్తూ
నిన్ను అక్షరాల్లో పొదుగుతారు !

తరువాత –
నిన్ను ఏ పుస్తకాల కొనల్లోనో
గుండెల కొండల మధ్యనో
జాగ్రత్తగా దాస్తారు !
నువ్వెప్పుడైతే చేరాల్సిన చోటికి చేరతావో
అప్పుడు మల్లెపూవులా పరిమళిస్తావ్ !

2

నిన్ను నేను –
ఓ మండు టెండ మధ్యాహ్నంలో
ప్రారంభపు యవ్వనపు
స్పందనతో రాశాను !
అమ్మా నాన్నరు జడిసి
దాక్కొని దాక్కొని
నా చదువుల గదిలో నిన్ను రాశాను !
ముందు కాసిన్ని తప్పులు
ఆ తరువాత కొట్టివేతలు
కాగితపు వుండల గుట్టలు
ప్రేమలేఖ ఎలా రాస్తారు ?
అన్న సందేహం మనసుని తొలుస్తుంటే –
నీ ముందు మాత్రం నేనో గొప్ప కవిలాగ
గొప్ప రచయితలాగ ఫోజుకొట్టి –
ఎలాగైతేనేం – చివరకు
వణికే చేతుల్తో నిన్ను రాశాను !
రాసిన తరువాత, ఊపిరి పీల్చుకొని
కిటికీ తెరచి –
ఎదురింటి మేడవైపు చూశాను !
ఎక్కడికైతే నిన్ను
సూర్యాస్తమయం తరువాత పంపాలో
ఆ మేడవైపు !
చిరు చీకట్లు ముసురు కుంటుండగా
నిన్ను తీసుకెళ్ళేందుకు ఆమె వొచ్చింది !
మేడదిగి నందివర్ధనం చెట్టు కిందికి –
వెన్నెల్లో తడిసిన చేతుల్తో –
వణికే గుండెతో –
నిన్నామె చేతుల్లో యిముడ్చుకుంది !
నీకు ఊపిరి సలపనంత గట్టిగా !
అయినా నాకు తెలుసు !
ఆ వూపిరి సలపని ఉక్కిరి బిక్కిరి తనంలోనే
నువు ఆనందంగా జీవిస్తావని !
నిన్నామె అందుకున్న తరువాత
సామ్రాజ్యాన్ని జయించిన సామ్రాట్టులా
ఆనంద హృదయంతో వెను దిరిగాను నేను !

**3**

నువ్వెళ్ళిన కొన్నాళ్ళకు
హఠాత్తుగా ఓ భయంకర వార్త విన్నాను !

నువు వాళ్ళ కోపిష్టి నాన్నగారి చేతిలో
బందీవైనావన్న దుర్వార్త విన్నాను !

నిన్ను పట్టుకొని -
నోటికొచ్చిన తిట్లతో హింసించి
తన స్వహస్తాలతో చివరికి
నిన్ను క్రూరంగా హత్యచేశాడు !

ఇక్కడ -
నీ మరణ వార్త విని
గుండెలవిసేలా అనంతంగా
ఎన్నో రాత్రులు ఏడ్చాను నేను !

సముద్ర తీరాల వెంట తిరుగుతూ !
నిర్జన మైదానాల్లో దొర్లుతూ !
తప్పు చేసింది నేనయితే
శిక్ష నువు అనుభవించావు !

నిన్నేగాని వాడు హత్య చెయ్యకుండా
బందీగానే వుంచి వుంటే -
నా ప్రాణాల్ని పణంగా పెట్టి
నిన్ను విడిపించుకుని వచ్చేవాణ్ని !

ఇప్పటికీ నామదిలో మెదుల్తునే వున్నావు నువు

నీ దయాభిక్షతో
నాలో ప్రాణం పోసుకున్న
నా స్వప్నాలు, ముద్దులు, కన్నీళ్ళు
నీ మహోన్నతమైన త్యాగానికి
ఎప్పటికీ -
అంజలి ఘటిస్తునే వుంటాయి !!


# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

(స్థాపితం : 1908)

గాంధీనగరం :: విజయవాడ-3

ఇంట్లో అందరికీ ఆనందాన్ని ఇచ్చే శీర్షికలు! కథలు!! బొమ్మలు!!!

★ సాహిత్య విలువలున్న సీరియల్ కథలు

★ వైవిధ్యం వున్న కథానికలు

★ అన్ని తరాలవారినీ అలరించే "ప్రశ్నావళి" "ధర్మపథం" "కార్టూన్"

మొదలైన వాటితో ఏ వారానికి ఆ వారమే కొత్తదనాన్ని పులికిపుచ్చుకుని మీకు అందుతుంది.

విడి ప్రతి వెల రు. 1-50

సంవత్సర చందా (పోస్టుద్వారా) రు. 85-80పై

ఆరుమాసాలకు (పోస్టుద్వారా) రు. 42-90 పై

మీ స్థానిక ఏజెంటు ద్వారా తెప్పించుకుంటే ప్రతీ వారం తెల్లారేసరికల్లా మీ ముందు వుంటుంది.

రచనలు పంపే చిరునామా :
ఎడిటర్, ఆంధ్ర సచిత్ర వారపత్రిక,
గాంధీనగర్, విజయవాడ-3.

ఇతర వివరాలకు :
బిజినెస్ మేనేజర్, ఆంధ్రపత్రిక,
గాంధీనగర్, విజయవాడ 3.

# క్షయాధికమాస నిర్ణయము

శ్లో॥ ఏకత్రమాస ద్వితయం యదిస్యాద్వర్షే ధికం తత్రిపరోఽధిమాసః
త్రయోదశంతుశ్రుతిరాహమాసం చతుర్దశః క్వాపినచాస్తిదృష్టః

పై వచనముచే ఒక సంవత్సరములో 2 మాసములు అసంక్రాంత మాసములగుటచే అధిక మాసములుగా భావించ బడ వలసి వచ్చి నపుడు ఆ రెండిటిలో రెండవ అసంక్రాతమాసమునే అధిక మాసమని గ్రహించవలయును. అధికమాసమనగా 12 మాసములలో యధాక్రమముగా 12 సంక్రాంతులు కలిగి సంక్రాంతి లేని 13వ మాసము-అంతేగాని 11 మాసములలో 12 సంక్రాంతులు కలిగి సంక్రాంతిలేని 12వ మాసముకాదు. ఇపుడు దుందుభి సంవత్సరము నందు, అధికాశ్వయుజము అధిక ఫాల్గునములను అంగీకరించిన సంవత్సరము చతుర్దశ మాసాత్మకమగుచున్నది. ఇది శ్రుతి విరుద్ధము, ఎటులనగా చైత్రప్రభృతి భాద్రపదపర్యంతము 6 మాసములు, అధికాశ్వయుజము నిజాశ్వయుజములు 2, కార్తిక మార్గశీర్షములు 2 కలిపి 10 మాసములు అగుచున్నది. తర్వాత క్షయమాసము పుష్యమాఘాత్మక మగుచు 12 మాసములు పూర్తి ఐనవి. ఇక అధిక ఫాల్గునము నిజఫాల్గునము 2 కలిసి దుందుభి సంవత్సరము 14 చతుర్దశమాసాత్మకమైనది ఇట్టిపరిస్థితిలో ఫాల్గునమునే షష్టిదినాత్మక మాసముగ స్వీకరించి అధిక నిజమాస ద్వయ యుక్తముగ గ్రహించి ఆశ్వినము సంసర్పమాసము గనుక త్రింశద్దినాత్మక ప్రాకృతమాసమే కాని మలిమ్లుచ మాసము కాదని అంగీకరించిననే పై శ్రుతి విరోధము పరిహృతమై ధర్మశాస్త్ర సమన్వయము కుదురును అని విజ్ఞులు సులభముగ గ్రహింపగలరు. ఇందువే, క్షయమాసము మాఘమాసమే. ఇది సంక్రాంతి ద్వయోపేతమగుటచే, తత్పూర్వ పుష్యమాసమునందు ఆచరించిన శ్రాద్ధములను, దీనియందు దిన పూర్వార్ధమందు గూడ అవృత్తి చేయవలసినందున ఇది ఉభయ మాసాత్మకముగ శ్రాద్ధాదులలో మాత్రము అగును. అంతేగాని మార్గశిరం తరువాత పుష్యం పూర్తి కానిది మాఘం రాదు. కనుక స్వరూపతః 2మాసములు 1 మాసము కాజాలదు –

శ్లో॥ అసంక్రాంతో హియోమాసః కదా చిత్తి ధివృద్ధితః
కాలాంతరాత్స మాయాతి సనపుంసక ఇష్యతే ।

ఈ వచనము సంక్రాంతి లేకుండా ఉండి, సౌరచాంద్ర సంవత్సరాంతర భూతమగు అధికమాస శేషపూర్తి కలిగి, 1 అధిక మాసమునుండి 2వ అధికమాసము వరకు నియమముగా ఉండ వలసిన కాలవ్యవధి కలిగి అనగా

"అధికాదధిక ప్రాప్తైర్మాస సంఖ్యా చతుర్విధా
మాసే చైకోన త్రింశ త్రింశన్మాసేధవాపునః
పంచత్రింశైధషట్త్రింశేత్వన్య మాసోనచాధికః ॥

అను రీతిగా 29–30 35–36 మాసాన్యతర వ్యవధిగలది ఏ మాసమగునో ఆ మాసమే అధిక మాసము అదియే మలిమ్లుచ మాసము అని తెలుపుచున్న రౌద్రిలో జ్యేష్ఠము అధికమాసము దుందుభిలో ఆశ్వయుజము, ఫాల్గునము 2 అధికమాసములు అని అంగీకరించినప్పుడు రౌద్రి,దుర్మతి,దుందుభి అను ఈ 3సంవత్సరము లలో 3 అధికమాసములు అని చెప్పినట్లగును. ఇయ్యది "పంచమే పంచమే వర్షే ద్వౌమాసా వుపజాయతః॥" అను మహాభారత వచన విరుద్ధము. 3 సంవత్సరములలో 3 అధిక మాసములు ఎట్లు వచ్చును. ఇది యెట్లు యుక్తము. అందుచేతనే శాస్త్రకారులు–

"ద్వ్యషష్టికల్పా నాస్తి తస్మిన్ సంసర్ప సంజ్ఞతే
స్ఫుట సంక్రమహీనో యో మాస స్సంసర్ప సంజ్ఞతః
తస్యద్వ్యషష్టి మత్త్వంచ బ్రహ్మణాచ నిరాకృతమ్
గణితాదపిమాసోయందినషష్ట్యాత్మ కోనహి
తతస్సంసర్ప ఇత్యుక్తస్తదా పద్మా సనాదిభిః ॥

అని, క్షయమాసమునకు పూర్వము వచ్చు సంక్రాంతి లేని మాసమును సంసర్ప మాసమనియు ఇది త్రింశద్దినాత్మక ప్రాకృత మాసమేగాన, దీనికి, నిజమాసము రాదనియు నిర్ణయించిరి.

"యస్మిన్ మాసేన సంక్రాంతిస్సంక్రాంతి ద్వయమేవవా
సంసర్పాంహస్పతీ మాసౌ, అధిమాసశ్చ నిందితాః॥"

అని, అధిక మాసముకన్న వేరుగా సంసర్ప మాసము సంక్రాంతి రహితమైనను, అంహస్పతియనబడు క్షయమాసముతో సహా, నిర్దేశించబడినది, గవాశ్వ మహిషములకువలె, సంసర్పమాసమునకు, క్షయమాసమునకు అధికమాసమునకు భేదముగలదు, సాజాత్యము లేదు. (ఇంకావుంది)

**శ్రీ చింతలపాటి వీర నీలకంఠ కుటుంబ రామశాస్త్రి, శ్రీ చింతలపాటి వేంకట సోమదీక్షితులు.**

శ్రీ పిడపర్తి చిన కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీ పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి

# విజయ దశమి - దీపావళి నిర్ణయము

## మాస లక్షణము

బ్రహ్మగుప్తుడు

శ్లో॥ మేషగ రవిసంక్రాంతిః శశిమాసేభవతి యత్రతచ్చైత్రం।
ఏవం వైశాఖాద్యా వృషాది సంక్రాంతి యోగేన॥

బ్రహ్మ సిద్ధాంతమున

శ్లో॥ మేషాదిస్థే సవితరి యోయో మాసః ప్రపూర్యతే చాంద్రః।
చైత్రాద్యస్సజ్ఞేయః పూర్తి ర్ద్విత్వేధిమాసో న్త్యః॥

వ్యాసుడు

శ్లో॥ మేషాదిస్థో రవిర్యేషాం ఆరంభ ప్రథమే క్షణే।
భవేత్తేబ్దే చాంద్రమాసా శ్చైత్రాద్యా ద్వాదశస్మృతాః॥

మహాభారతమున

శ్లో॥ మేషాదయో ద్వాదశస్యుః చైత్రాదిషు యథాక్రమం।
క్షయాధికేష్వా గతేషు నియమోయం న లభ్యతే॥

కశ్యపుడు

శ్లో॥ సంక్రాంత యస్స్య ర్మేషాద్యా శ్చైత్రే మేషాదిషు క్రమాత్।
నియమో నభవేత్తత్ర త్వధిమాసే సమాగతే॥

వసిష్ఠుడు

శ్లో॥ చైత్రాదిమాసేషు యథాక్రమేణ మేషాదయోద్వాదశరాశయస్స్యుః న్యూనాధిమాసేషు సమాగతేషు చలంతి తేభ్యో నియతిం వినాపి॥

కశ్యపుడు

శ్లో॥ యస్మిన్మాసేర్క సంక్రాంతి ర్దర్శాన్తా త్ప్రాక్పరాపరం।
దర్శాన్తల్లంఘ్యభవతి సంసర్పోధిక మాసకః॥
ఆరభ్య శుక్ల ప్రతిపద్ ప్రవేశాత్సంక్రమద్వయం।
ఆగామేందు క్షయస్యాన్తాత్తాత్ప్రాగూనా ఖ్యాంహస్పతిః॥

శుక్ల పతిపదాది దర్శాంత చాంద్ర మాసములో మేష సంక్రాంతి గలది చైత్రము. వృషభ సంక్రాంతి గలది వైశాఖము. ఇట్లు మేషాది సంక్రమణములుగల మాసములు క్రమముగ చైత్ర వైశాఖాది సంజ్ఞలుగల మాసములగును. అనగా మేషమందు సూర్యుడుండ సమాప్తమైన మాసము చైత్ర మాసమగును. మరియు మీన మతో ప్రారంభమయి మేషముతో నంతమైన చాంద్రమాసమును చైత్ర మాసమగునని భావము. క్షయాధి మాసముల యందీ నియమము వర్తించదు. ఒకరాశి యందు సూర్యుడు ఉండగా రెండమావాస్యలగుచో రెండవ అమావాస్యగల మాసము అధిక మాసమగును. ఈ అధిక మాసముత్తర మాస సంబంధమైనదగును. అట్లే శుద్ధ పాడ్యమి మొదలుగాయతు అమాంతము వరకు గల చాంద్ర మాసములో రెండు సంక్రాంతులయిన క్షయమాస మగును.

ఇది యిట్లుండ "చలంతి తేభ్యో నియతింవినాపి" అను చోట కొంతమంది వసిష్ఠులు మాసనామములు చలించునని చెప్పిన దంతయు న కాదు.

ఏలనగా సూర్య సిద్ధాంతమునకు వ్యాఖ్యానమును రచించిన యల్లయాచార్యుడిట్లు చెప్పియున్నాడు-

"యస్మిన్నబ్దేంహస్పతి సందృశ్యతే తత్ర సంసర్పద్వితయం స్యాత్ । తస్మిన్నబ్దేకస్సంనియమః"

శ్లో॥ అర్కేందుమాసయోగః ప్రాగుక్తో దృశ్యతేయదాయత్ర।
కుర్యాత్తత్రైవమసౌ సంసర్పౌ షష్టివాసరౌ భవతః॥

శ్లో॥ యస్సంసర్పః పూర్వః సంసర్పాఖ్యస్స ఏవస్యాత్।
అపరస్సంసర్పాస్స్యా దధిమాసస్తౌతు నశుభదౌ॥

శ్లో॥ సౌరైందవయో స్సమ్యగ్భవంతి యోగాస్సదావర్షే।
శేషా శ్శుభకర్తృర్హా మాసాస్సర్వే భవంత్యేవ॥

"యస్మిన్నబ్దే అసంక్రాంతిమాసద్వయ మంహస్పతి సందృశ్యతే తత్రైవం కుర్యాత్ । పూర్వసంసర్పస్య షష్టిదినంల్లా

ణాంకుర్యాత్ । ఉత్తర సంసర్పస్యాపిషష్టిదిన కల్పనాం కుర్యాత్ ।
అంహస్పతి మాసే మాసద్వయ నామాంకితే కృతేసతి
శేషానాంచాంద్రమాసానాం స్వకీయసౌరమానయోగ
నియమస్సంభవతి" ఇతి-

ఏ సంవత్సరమున రెండధిక మాసములు ఒక క్షయమాసము సంభవించునో యప్పుడట్లు చేయవలెను. పూర్వాధిక మాసమును (60) అరువది రోజులు గల మాసముగను, పరాధిక మాసమును అరువది (60) రోజులుగల మాసముగను లెక్కించవలయును. అంహస్పతి (క్షయ) మాసము రెండు మాసముల నామము (యుగళీభూతాంహస్పతి)లు కలదియగు చుండగా మిగిలిన చాంద్రమాసములు సూర్య సంక్రమణముల ననుసరించి శుద్ధచాంద్రమాసములగు చున్నవి. ఈ ప్రమాణముల ననుసరించి సంక్రాంతితోఁ గూడిన మాసములను యథాప్రకారముగనే గ్రహింపవలెను. కావున మాస నామచాలనముతో

అధికాశ్వయుజమున - ఆశ్వయుజమాస కృత్యములను, నిజాశ్వయుజమున - కార్తికమాస కృత్యములను, కార్తికమున - మార్గశీర్ష మాసకృత్యములను, మార్గశీర్షమున - పౌషమాస కృత్యములను, క్షయమున - మాఘమాస కృత్యములను చేయవలయునని చెప్పిన విషయ మంతయు తగదనియు అశాస్త్రీయమునియు ప్రత్యక్ష ప్రమాణ విరుద్ధమైనదనియు తెల్లమగుచున్నది.

జ్యోతి సిద్ధాంతములో

శ్లో॥ షష్ట్యాతు దివసైర్మాసః కథితో బాదరాయణైః ।
పూర్వార్ధంతు పరిత్యజ్య కర్తవ్యా ఉత్తరే క్రియాః ।

శ్లో॥ ఆద్యోమలిమ్లుచోజ్ఞేయః ద్వితీయః ప్రాకృతస్మృతః ॥

అరువది రోజులు గల చాంద్రమాసమున మొదటి ముప్పది (30) రోజులు మలమాసమనియు నుత్తరార్థము ముప్పది (30) రోజులు శుద్ధమాసమనియుఁ జెప్పబడినది. మొదటి ముప్పది రోజులు అధికమాస మగుటచే రెండవ మాసమున శుద్ధమాసమునందే శుభకర్మలు-దైవోత్సవములు ఆబ్దికములు ఆచరించవలయును. ఇట్లే మరియొకస్మృతియు గలదు -

శ్లో॥ ఆద్యోమలిమ్లుచోజ్ఞేయః ద్వితీయః ప్రాకృతశ్శుభః ॥
ఏవంషష్టిదినో మాసః తదర్థంతుమలిమ్లుచః ।
త్యక్త్వా తదుత్తరే కుర్యా త్పితృదేవాదికాః క్రియాః ॥

గర్గ మహర్షియు ఇట్లే చెప్పియున్నాడు -

శ్లో॥ ఏవం షష్టిదినో మాసః కథితో బాదరాయణైః ।
పూర్వార్ధంతు పరిత్యజ్య కర్తవ్యా ఉత్తరే క్రియాః ॥

ఇట్టి మలమాసములు రెండు విధములుగా ఉన్నవని సిద్ధాంత శిరోమణియందునుఁ జెప్పబడినది.

శ్లో॥ అసంక్రాంతి మాసోధి మాసస్ఫుటస్స్యాద్ద్వి సంక్రాంతి మాసః క్షయాఖ్యః కదాచిత్ । క్షయః కార్తికాదిత్రయే నాన్యతస్స్యాత్ తదావర్ష మధ్యేఽధి మాసద్వయంచ ॥

స్పష్టమానముచే నసంక్రాంతి మాస మధిక మాసమగును. ఒకానొకప్పుడు శుద్ధపాడ్యమి లగాయతు అమావాస్యవరకు గల చాంద్రమానములో స్పష్టమానముచే రెండు సూర్యసంక్రాంతులయిన క్షయమాసమగును. ఈ క్షయమాసము తులావృశ్చిక ధనుర్మకర కుంభ సౌరమానములు చాంద్రమాసము కంటెఁ దక్కువగను, సమానముగను కలవి యగుటవలనఁ గార్తికాది మాసత్రయమునందే సంభవించును. అట్టి క్షయమాసము వచ్చినప్పుడొక సంవత్సరములో రెండధికమాసములు వచ్చును. ఈ క్షయమాసము రవిసంచారవశ మిధున రాశియందు నుండుటవలన కార్తికాది మాసత్రయమునందే క్షయమాసము వచ్చును. ఇది ఇంతటిలో మారునదికాదు. చాలాకాలమువరకు ఇట్లే వచ్చును.

ఈ దుందుభి సంవత్సరమున నాశ్వయుజ మాస మధిక మాసమై మకర కుంభ మాసములు ఒకే చాంద్రమాసమందగుటచే పౌషమాసము యుగళీభూత క్షయ మాసమయినది. అవ్యవహితముగా ఫాల్గునమాస మధికమైనది. క్షయమాస పూర్వభవాధిక మాసము నకు సంసర్పమని సంజ్ఞ ప్రాయికముగా శాస్త్రకారులు చెప్పియున్నారు.

క్షయమాసము - క్షయపూర్వాధికమాసము - క్షయోత్తరాధిక మాసము మూఁడు మాసములును మలమాసములుగ అపవిత్రములుగా చెప్పబడినవి.

శ్లో॥ ఏకస్మిన్ వత్సరే స్యాతాం ద్వౌమాసావధి మాసకౌ।
పూర్వో మాసస్తు సంసర్ప శ్చోత్తర స్త్వధికో భవేత్॥

బార్హస్పత్యమున

శ్లో॥ యస్మిన్మాసేన సంక్రాంతి స్సంక్రాంతి ద్వయమేవవా।
సంసర్పాంహస్పతీమాసౌ వధిమాసశ్చ నిందితాః॥

సంసర్పము - అంహస్పతి మాస మనగా క్షయ మాసము. తదనంతరాధికమాసము ఈ మూడును నింద్యములు. వైద్యనాథీయమున గూడా ఈ మూడు మాసముల నిట్లే చెప్పియున్నారు.

ఇది యిట్లుండగా నిర్ణయసింధు వ్యాఖ్యాతకర్తయగు కృష్ణం భట్టారకుడు

శ్లో॥ యాం తిథిం సముప్రాప్య తులాంగచ్ఛతి భాస్కరః।
తయైవ సర్వసంక్రాంతిః యావన్మేషం నగచ్ఛతి ॥ఇతి॥

సూర్యుడు ఏ తిథి యందు తులలో ప్రవేశించెనో మేష సంక్రాంతి వరకు అదే తిథులలో వృశ్చికాది ప్రవేశములగునని భావము.

ఇది యిట్లుండగా "తయైవ సర్వసంక్రాంతిః" అని చెప్పుట వలన స్పష్టమానముచే భిన్న తిథులలో సంక్రాంతియయినను, మాస నామ చాలనము చేసి నవలించి అధికాశ్వయుజ మాసమును - నిజాశ్వయుజముగ గ్రహింపవలయునని చెప్పియుంట లేదు.

ఆ మాస నామచాలనమే ముఖ్యమని కర్తన్యమైన క్షయ మాసమునకు ప్రశక్తియే యుండదుకదా! అట్లయిననో

సిద్ధాంత శిరోమణిలో

శ్లో॥ గతోబ్ధ్యద్రినందైర్మితే శాకకాలే తిథీశైర్భవిష్యత్య ధాంగాక్ష సూర్యైః।
గజాద్ర్యగ్ని భూమిస్తదా ప్రాయశో యం కువేదేందువర్షైః క్వచిత్ గోకుభిశ్చ ॥

ఈ శాలివాహన శకములో 934, 1115, 1256, 1378, సంవత్సరములలో క్షయమాసములు వచ్చినవి. భవిష్యత్కాలములో ప్రతి 41 సంవత్సరములకు క్షయమాసము రాగలదు. పిమ్మట ప్రాయికముగా 19 సంవత్సరములకు కూడా లుప్తమాసము రావచ్చును.

అని చెప్పబడి యుండగా కృష్ణంభట్టాచార్యుల వారి వివరణము అనేక నిబంధన గ్రంథములకు విరోధమయినది. గాన దానిని ప్రమాణ మాధరమయినదిగా నెంచవలయును. మరియు పంచాంగ రచనాకాలమున సర్వసామాన్యముగ సంక్రాంతుల ప్రవేశకాలము సరిగా వచ్చినదా ? లేదా ? అని తెలిసికొనుటకు మాత్రమే "దాణ వృద్ధిరసక్షయః" అన్నట్లుగా ఉపయోగించుకొని, క్షయమాస విషయమున ధర్మశాస్త్ర విషయమున నా వాక్యమునకు నిచ్చట ప్రమాణము కాదని విజ్ఞులు గ్రహింప గోరెదము.

వైద్యనాథీయమున - నారదుడు

శ్లో॥ సంక్రాంతి రహితో మాసో యోవా సంక్రాంతి యుగ్మకృత్।
పూర్వ స్సంసర్పమాసస్స్యా దంహస్పతి రథాపరః॥
మలమాసావిమౌప్రోక్తౌ సర్వకర్మ బహిష్కృతౌ ॥

సంక్రాంతి లేని మాసము సంసర్పము. రెండు సంక్రాంతులు గలది క్షయ మాసము. అంహస్పతి మాసము. ఈ రెండును మలమాసములు ఇవి సర్వకర్మలందును విడువదగినవి. దీనిచే పూర్వోత్తరాధి మాసములును క్షయమాసమును మూడును మల మాసములని చెప్పబడినది.

సత్యవ్రతుడు

శ్లో॥ రాశి ద్వయం యత్రమాసే సంక్రమేత దివాకరః।
నాధిమాసో భవేదేష మలమాసస్తు కేవలం ॥

స్మృత్యంతర వచనమున

శ్లో॥ సంసర్పోంహస్పతిశ్చేతి ద్వివిధా వధిమాసకౌ ॥

సత్యవ్రత వాక్యమున క్షయమాసము (రెండు సంక్రమణములు గల మాసము) అధికమాసముగాదు. కేవలము మలమాసమే అని కలదు. స్మృతివాక్యమున సంసర్పము అంహస్పతిమాసము రెండువిధములైనవి అధిక మాసములని కలదు. మలమాసమనగా కామ్యకర్మలు నూతనముగా నారంభించెడి వ్రతాదులకు సగతిక కర్మలు చేయుట కనర్హమైనవి. వివాహాది శుభకర్మ లిందు నింద్యములు.

శ్లో॥ ఏకస్మిన్వత్సరే స్యాతాం ద్వౌమాసావధిమాసకౌ॥
పూర్వోమాసస్తు సంసర్ప శ్చోత్తరస్త్వధికో భవేత్॥
మాసద్వయేబ్దమధ్యేతు సంక్రాంతిర్నయదాభవేత్।
ప్రాకృతస్తత్ర పూర్వస్స్యా దధిమాసస్తథోత్తరః॥
ఘటకన్యాగతేసూర్యే వృశ్చికేవాథ ధన్విని।
మకరేవాథ కుంభేవా నాధిమాసో విధీయతే॥

ఒక సంవత్సరమున రెండధిక మాసములు వచ్చిన మొదటిది సంసర్పమాసము. రెండవది యధికమాసము. రెండవ శ్లోకమున మొదటి మలమాసము ప్రాకృతమని రెండవది యధికమాసమని చెప్పబడినది. వృశ్చిక ధనుర్మకర కుంభ సంక్రాంతులలో రెండు సంక్రాంతులు ఒక మాసమునందైనప్పుడు భాద్రపదాశ్వయుజ మాసములలో గలిగిన అధికమాస మధికమాసము గాదు. రెండధిక మాసములు క్షయ మాసము వచ్చినప్పుడే కలుగును. ఈ వాక్యము నకు మాసికములయందు చరితార్థము.

శ్లో॥ చాంద్రమాసోహ్యసంక్రాంతో మలమాసః ప్రకీర్తితః।
ఏవంషష్టిదినోమాసః తదర్థంతు మలిమ్లుచః॥
పూర్వార్థంతు పరిత్యజ్య కర్తవ్యా ఉత్తరే క్రియాః॥

అధికమాసము నిజమాసము కలిపి (60) అరువది తిథులుగల మాసమనియు, అందు పూర్వార్థమైన (30) ముప్పది తిథులను విడిచి ద్వితీయార్థమగు (30) ముప్పది తిథులుగల మాసమున కర్మల నాచరించవలెను. ఇది సర్వసాధారణాధికమాస విషయము –

శ్లో॥ మాసద్వయేబ్దమధ్యేతు సంక్రాంతిర్నయదాభవేత్ ।
ప్రాకృత స్తత్ర పూర్వస్స్యా దధిమాస స్తథోత్తరః ॥

క్షయమాసము గలిగినయెడల మొదటి అధికమాసము ప్రాకృతము. అనగా ముప్పది తిథులుగల మాసముగ శుద్ధమాసముతో గలిపిగాక విడిగా లెక్కింపదగినది అని తాత్పర్యము. రెండవ అధి మాసము నధికమాసముగా ఉత్తర శుద్ధ మాసముతో గలిపి (60) అరువది తిథులుగల మాసముగ చూడవగినదనియు నిందుగలదు–

శ్లో॥ ద్వ్యషష్టి కల్పనా నాస్తి తస్మిన్త్సంసర్ప సంజ్ఞకే ।

సంసర్ప సంజ్ఞ కల యధిక మాస మునం దుత్తరమాసముతో గలిపి అరువది తిథులుగల మాసముగ వ్యవహరింప కూడదు – విడిగా లెక్కించవలయును.

శ్లో॥ చైత్రాదర్వాఙ్నాధిమాసః పర స్త్వధికోభవేత్॥

చైత్రమాసమునకు ముందున్న మాసములలో నధికమాసము వచ్చిన అధికముగాదు అని క్షయమాసానంత రాధిక మాసము నందును అధిక మాసభిన్నత్వము చెప్పబడినది. ఈ వచనము నకు మాసికములయందు చరితార్థము.

సూర్యసిద్ధాంత వ్యాఖ్యయగు యల్లభట్టీయమునందు క్షయ మాసానంతరాధిక మాస మునకు శుద్ధత్వము విధింపబడినది॥

శ్లో॥ అధిమాసస్య యుగళం భవేత్సన్నిహితం యది ।
స్థితమోక్షిరిసంసర్పో గ్రాహ్య ఏవన సంశయః ॥
ఏకాబ్దే రవి సంక్ర మహీనాచే త్ఫాల్గునేతరౌ మాసౌ ।
ఫాల్గున ఏవ శుభస్స్యా దన్యోమాసోధికః ప్రోక్తః ॥
అబ్దేధి మాస యుగళం భవేద్యస్మిన్న సంశయం ।
అధిమాస స్తయోరాద్యః శుద్ధ మాసః పరోభవేత్ ॥

ఆ ప్రకారమే పూర్వమాసము శుద్ధమను వచనములున్న అందు కలవు. వీటిని గూర్చి యల్లుభట్టు –

"అసంక్రాంతి ద్వి సంక్రాంతి మాసప్రాప్తకాలే పూర్వోక్త కపేనైవ అధిమాసద్వయం వికల్ప్య అధిమాసః నిర్ణయః కర్తవ్య ఇత్యర్థోఽవగమ్యతే॥"

అని వ్రాసి యుండెను. ఇట్లు క్షయ పూర్వోత్తరాధిక మాసములకు వైకల్పికత్వముగానంబడుచున్నది. సంసర్పపదముఅధికమాస భిన్న మను నర్థమందును ప్రయోగింపబడినది. అధిక మాసభిన్నత్వము పూర్వోత్తరమాసములయందువైకల్పికమనుటనిశ్చయము. కావుననే

శ్లో॥ క్షయమాసో యదాజాతస్సంసర్పాఖ్య ద్వయం భవేత్ ॥

అనియున్నందున – క్షయోత్తర మాసమునకు వికల్పముగ సంసర్పతుల్యత్వము విధింపబడినట్లు తోచుచున్నది. దీనివలన విశేష ప్రయోజనము కలదు.

సూర్య సిద్ధాంతమున జెప్పబడిన యుగాధికమాస సంఖ్యలో క్షయమాసమునకు ముందువచ్చు నధిక మాసము ఆ సంఖ్యలో లేదు కావున అధికాశ్వయుజ మాసము ను శుద్ధముగా గ్రహించి వ్రత శ్రాద్ధాదులు చేయవచ్చునని కొందఱనుచున్నారు – ఇదియు సరికాదు.

అచట నధికమాస సంఖ్య మధ్యమ (సరాసరి) మానముచే జెప్పబడినది. క్షయమాసమునకు ముందు వచ్చు నధికమాసము స్పష్టమానముచే వచ్చినది. ఈ విషయమున సిద్ధాంత శిరోమణి యందే "కదావర్ష మధ్యేఽధిమాస ద్వయంచ" అను వాక్యము ప్రమాణభూతమైనదికాదా ? ఈ విషయము లన్నియు మధ్యమ (సరాసరి) మానముతో విచారించిన యెడల సర్వసిద్ధాంత గ్రంథ ములందు జెప్పబడిన యీ క్షయమాస విచారమునకు తావు లేదు కదా !

శ్లో॥ "అసంక్రాంతా వేకవర్షేద్వౌచే త్సంసర్ప అధిమః ।
క్షయమాసో ద్విసంక్రాంతిః సహాంహస్పతి సంజ్ఞకః ॥
త్రయస్త్యాజ్యా వివాహాదౌ" ఇతి।

శ్లో॥ యస్మిన్వర్షే ద్విసంక్రాంతోఽధికంద్వయం తథా ।
తద్ధిమాస త్రయం సర్వేషు శుభకర్మసు ॥

ఏ సంవత్సరమున ద్విసంక్రాంతి యుక్త క్షయ మాసము వచ్చునో ఆ సంవత్సరమున సంభవించు రెండధిక మాసముల యందు, క్షయమాసమునందును వివాహాది శుభకర్మలు చేయరాదు.

శాలివాహన శకము 1904 దుందుభి సంవత్సరమున మార్గ శిరము 30వ నాడు (14–1–83) శుద్ధ పాడ్యమి ఘటికలలో మకర సంక్రాంతి అయినది. తదనంతరమున వచ్చు అమావాస్యనాడు (13–2–83 న) అమాఘటికలలో కుంభ సంక్రాంతి యగుటవలన

పౌషమాఘ యుగళీభూత అంహ స్పత్యమాసము (క్షయమాసము) వచ్చినది. ఈ క్షయమునకు ముందుగా ఆశ్వయుజ మాస మధిక మయినది. క్షయానంతరమున ఫాల్గున మధిక మయినది.

మదనరత్నాకరమున

శ్లో॥ మాసద్వయోదితం కర్మ తత్కుర్యాది నిర్ణయః ।
ఏకస్మిన్మాసి మాసౌద్వౌ యదిస్యాతాం త్రయోర్ద్వయోః ॥
తావేనపక్షే తా ఏవతిథయః త్రింశదేవహి ॥

ఒక మాసమునందు రెండు మాసములయిన యెడల (అనగా రెండు మాసముల సంజ్ఞలు ఒక మాసమునకు గలిగిన యెడల) నందు ఆ రెండు మాసములయందు చేయవలయునని చెప్పబడిన వ్రతాదులు పైతృకములను చేయవలయును. ఆ రెండు మాసము లందును అవే పక్షములు అవే తిథులు 30 అగును. పౌషమునకే పక్షములో మాఘమున కవియే పక్షములు. పౌషమునకే 30 తిథులో మాఘమునకు నవియే 30 తిథులు అగును. ఈ ప్రమాణ శ్లోకమును బట్టియే పూర్వోత్తర విభాగము లేదని స్పష్టమగుచున్నది.

రణవీర రత్నాకరమునందు -

శ్లో॥ తిథ్యర్థే ప్రథమే పూర్వో ద్వితీయేర్ధే తదుత్తరః ।
మాసావితి బుధైశ్చింత్యౌ క్షయ మాసస్యమధ్యగౌ ॥

క్షయమాసమునందు తిథ్యాద్యంతమును కనుగొని దానిని సగముచేసి పూర్వార్థమున పూర్వమాసమనియు, ఉత్తరార్థమున ఉత్తర మాసమనియు నెరుంగవలయును. కావున క్షయమాసమున రెండు మాసములు కలవని తాత్పర్యము. అంతియకాని ఆయా యర్థ భాగములలోనే యాయామాసముల వ్రతాదులను చేయవలయు నని చెప్పుటకు వీలులేదు. తిథి పూర్వోత్తర విభాగము చేయుట యెందు కనిన క్షయతిథి పూర్వార్థమున పుట్టిన వారికి మరణించిన వారికి రాబోవు వత్సరములో పౌషమున పుట్టెను, మరణించెనని తెలిసికొనుటకును-అట్లే క్షయ తిథ్యుత్తరార్థమున పుట్టిన వారికి మరణించినవారికి భవిష్యద్వత్సరములలో మాఘమున జన్మించెను-మరణించెనని తెలిసి కొనుటకే క్షయమున రెండు మాసములు గల వని యిందు ముఖ్యముగా విధించబడినది.

అందుచేత పౌష మాఘమాస ప్రముక్త వ్రత పర్వోత్సవ ప్రత్యాబ్దికములను మాఘస్నానాదులను క్షయమునందే ఆచరించ వలయును. ఈ శ్లోకము భవిష్యత్కాలములో పుట్టిన మాసమును, ప్రత్యాబ్దిక మాసమును గ్రహించుటకేయని గ్రహించనగును.

ధర్మసింధువునందు -

"పూర్వోక్త మార్గశీర్ష గతంపౌషగతంచాబ్దిక మేకస్మిన్నేవ మాసే తిథి పూర్వోత్తరార్ధాదిభాగం వినైవ కార్యం"

పురుషార్థ చింతామణియందు

"అన్యాన్యపి మాసద్వయ విహితాని కార్యాణి స్వస్వకాల ఏవకర్తవ్యాని"

కాల మాధవీయమున

"అనే నైవాభి ప్రాయేణ మాధవీయే మాధవాచార్యై రపి సంక్రాంతి ద్వయ యుక్తస్య క్షయస్య మాసద్వయత్వేన పరిగణనాత్"

ఇత్యాది ప్రమాణవచనముల వలన తిథి పూర్వోత్తర భాగమును విడిచియే ముఖ్యకాలము నందు కర్మల నాచరించ వలెనని బోధించుచున్నవి.


**తెనుగులో ఉత్తమ గ్రంథములు**

| | | | |
|---|---|---|---|
| 1. | సాహిత్యసౌందర్య దర్పనము 800 పుటలు డెమ్మి (సమగ్ర ధ్వని,రస,కావ్య,నాటకాలంకార శాస్త్రము, | | 35-00 |
| 2. | శాకుంతలనాటకము ,, అనువాదరీతులతో | 162 ,, | 6-00 |
| 3. | ఉత్తరరామ ప్రణయచరిత నాటకము ,, | 180 | 5-00 |
| 4. | న్యాయదర్శనం మూల తాత్పర్యములతో | 160 | 4-00 |
| 5. | వైశేషికదర్శనము (కణాదుడు) ,, | 88 | 3-00 |
| 6. | సాంఖ్యదర్శనము (కపిలుడు) ,, | 121 | 6-00 |
| 7. | బ్రహ్మసూత్రములు (టీకానువాదవిశేషములతో) | 300 | 10-00 |
| 8. | ఉపనిషత్సు I (ఈశకేనకఠప్రశ్నోపనిషత్తులు) మూల తాత్పర్య పద్యానువాదసహితము | 150 | 5-00 |
| 9. | ,, II ముండ మాండూక్య తైత్తిరీయైతరేయములు,, | 150 | 5-00 |
| 10. | ,, III ఛాందోగ్యము ,, | 500 | 30-00 |
| 11. | ,, IV బృహదారణ్యకము ,, | 350 | 20-00 |
| 12. | గణపతి రామాయణ సుధ (బాలకాండ) | 300 | 15-00 |
| 13. | గణపతి రామాయణసుధ (అయోధ్యకాండ) | 500 | 25-00 |
| 14. | గణపతి రామాయణసుధ (అరణ్యకాండ) | 300 | 15-00 |

(వాల్మీకి రామాయణమునకు సరియైన సరసమైన తెనుగు కావ్యము. పద్యగద్యములు. చర్చనీయములు. అనువాదరీతులు. వనవాసకాలము, లంకామార్గము చిత్రపటమును-గాయత్రీబీజాక్షర రామాయణములతో) చర్ల గణపతిశాస్త్రి, విజ్ఞాన కేంద్రము, కురుపాం మార్కెట్టు, టౌను హాలురోడ్డు, విశాఖపట్నం - 1

కాల నిర్ణయ చంద్రికలో ఆపస్తంభ వచనముగ

శ్లో॥ అంహస్పతౌతు కర్తవ్యం శ్రాద్ధమాబ్దిక మాసికం ।
పూర్వోత్తరార్ధ భేదేన చైకస్మి న్వాసరే పృథక్ ॥
మలమాసేపి కర్తవ్య మనన్యగతి కత్వతః ॥

అని చెప్పియున్నాడు.

ఇందు మొదటి శ్లోక మొక వాక్యము. రెండవ అర్ధ శ్లోకము 2 వ వాక్యము మొదటి శ్లోకమునకు కాల చంద్రికయందు క్షయ మాసదిన ప్రమాణమును రెండు భాగములుగ జేసి పూర్వమాస కర్తవ్య మాసికాబ్దికమును పూర్వార్ధమందును - ఉత్తర మాస కర్తవ్య అబ్దిక మాసికముల నుత్తరార్ధమునందుఁ జేయవలయునని వ్యాఖ్యానింపబడినది. ఆ వ్యాఖ్యానము ఇతర గ్రంథ విరోధము చేతను న్యాయ విరోధము చేతను సరియైనదికాదు. క్షయమాసము నందు రెండుమాసముల సంబంధములైన రెండు మాసికములను మధ్యాహ్నం లోపుగ నొకటి మధ్యాహ్నానంతరము మరియొకటిన్ని అట్లు రెండు మాసికములు పెట్టవలెనని వ్రాయబడి ది. మాసికము నకు త్రింశత్తిథ్యాత్మకమైన మాసమున నక్షయ తిథి నిమిత్తములై నవిగాన ఒక దినములో రెండు మాసికములు పెట్టవలయుననుట శాస్త్రవిరుద్ధము-న్యాయ విరుద్ధమాలగు చున్నవి.

ఆబ్దికములు ఒకరి సంబంధమైనవి సంవత్సరములో మాస భేదముచే రెండురావుగాన భిన్నదేవతాకమగు అబ్దికములని చెప్ప వలెను. ఈ శ్లోకము క్షయమాసమునందు మరణించిన వారికి మాస నిర్ణయమును చెప్పుచున్నదనిన ఇతర శాస్త్ర విరోధము లేక సమ న్వయించును. కాలచంద్రికలోని అర్థమును గ్రహించిన యెడల "మాస ద్వయోదితం కర్మ" ఇత్యాది నిబంధనకర్తల వాక్యము లకు విరుద్ధమగును గాన వాసరే = తిథియందు. అనియు ఆబ్దిక మాసికం = ఆబ్దికమైన మృతమాస కర్తవ్య శ్రాద్ధమనియు అంహ స్పతౌ = క్షయమాసమందనియు చెప్పవలెను. ఆబ్దికమాసికం అను పదమునకు సామానాధికరణ్య సమాసమే న్యాయమైనది. సరి యగు సమన్వయము కలదు. అనన్యగతికత్వాత్ః అని చెప్పినందు వలన ఈ సంక్రాంతి ద్వయ సంజ్ఞగల పౌషమాఘ యుగళీభూత మల మాసమునందే పౌషమాస సంబంధ వ్రతపర్వ ప్రత్యాబ్దికాదు లను, మాఘమాస సంబంధ వ్రతపర్వ ప్రత్యాబ్దిక స్నానాదులను ఆచరించవలయును. ఇది యుక్తమైనదే. ఈ క్షయమాసమునందలి ముప్పది తిథులు క్షీరనీర న్యాయముగా నుండుటవలన పైన యుద హరించిన దంతయు తగియున్నది. క్షయమాసశుద్ధ పౌర్ణమి లగాయతు అమావాస్యాంతమువరకు మాఘస్నాన యోగ్యకాలమని గ్రహింతురు గాక.

శ్లో॥ చక్ర వత్పరివర్తేత సూర్యః కాలవశాద్యతః।
అతస్సాంవత్సరం శ్రాద్ధం కర్తవ్యం మాస చిహ్నితం॥
మాస చిహ్నంతు కర్తవ్యం పౌష మాఘాద్యమేవహి।
యతస్తత్ర విధానేన సమాసః పరికీర్తితః ॥

తాత్ప॥ సూర్యుడు కాలగతి వలన చక్రమువలె పరిభ్రమిం చును. కావున మృత మాస సంజ్ఞకల మాసమువచ్చినప్పటికి సంవత్సరము పూర్తియగును. గాన ఆబ్దికమను శ్రాద్ధము పెట్టదగి నది. ఆ మృత మాస సంజ్ఞకల మాసము పౌషము - మాఘము - మొదలగు సంజ్ఞలుగల చాంద్రమే గ్రహింపదగినది. దీనివ న తిథులు చాంద్రములోనివే. మృతతిథినాడు ఆబ్దికమును పెట్టవల యును. ఈ విధి వాక్యముచే మరణ కాలమునకున్న మాసమే ఆబ్దికమునకు యోగ్యమని చెప్పబడి యుండగా విపరీతార్థమును చెప్పుట వారి బుద్ధి విశృంఖలతకు మూలమని చెప్పవచ్చును.

## అనుమాసికముల విషయము

"మాసాదౌ మాసికంకార్యం" మాసారంభమున మాసికమును పెట్టవలయును. మరియు "మృతేహనితు కర్తవ్యం ప్రతిమాసంతు మాసికం" ప్రతిమాసమున మృత తిథియందు మాసికము నాచరించ వలెను. అని చెప్పుటవలన అనుమాసికముల సంఖ్యకు మాస సంజ్ఞగల మాసములకు సంబంధములేదని గమనింపదగినది. పైత్ర మేధిక సంవత్సరమున త్రింశత్తిథ్యాత్మక మాసమును మాసముగా నిబంధనకర్తలుదాహరించియున్నారు. మాసికమునకు నక్షయ తిథి నిమిత్తములగుట వలన క్షయ మాసములో నొకమాసికమునే పెట్టవలయును. కావుననే కృష్ణంభట్టాచార్యుడు క్షయ మాసమును ఒక మాసముగా గ్రహించి యున్నాడు. 'ద్వాదశ మాసాః సంవ త్సరః। అస్తిత్రయోదశ మాస' ఇతి ఈ శృతి వాక్యానుసారముగా క్షయ మాసమున నొకే మాసికమును పెట్టవలయును - సంసర్పము నిజాశ్వయుజము - క్షయము - అధిక ఫాల్గునము - నిజ ఫాల్గున ములయందు నేప్రకారముగా ద్వాదశ మాసికములు లేక పదమూడు

మాసికములు వచ్చునో అట్లే క్షయ మాసమునకు ముందు వెనుకల యందున్న అధికమాసముల యందు వికల్పముగ సంసర్పత్వము విధించుటచేత ద్విరావృత్తి మాసికముగాగాని ప్రత్యేక మాసికముగా గాని ఆచరించవలయును.

సంసర్పమునకు నల్ప పాపత్వ మంగీకరించుటచేత మల మాసశ్రాద్ధమువలెగాక సంసర్ప మాసమునందును - శుద్ధమాసము నందును - యధావిధిగా మాసికమునుగాని, అబ్దికమునుగాని, పెట్ట వలయును - అందుచేతనే మావృద్ధ ప్రపితామహులు చలమయ్యా శాస్త్రిగారు 'సంసర్పేచశుద్ధేచ యధావిధి శ్రాద్ధాదికంకార్యం' అని వ్రాసియున్నారు.

అదియునుంగాక పైతృమేధిక సంవత్సరమున పదునొకండు మాసికములు పదునాల్గు మాసికములు రాకుండుటకే క్షయ మాసము నకు పూర్వాపరముల యందున్న అధికమాసములకు సంసర్పత్వము ఆరోపించబడినది. కావుననే యల్లయాచార్యుడు చెప్పిన 'క్షయ మాసోయదాజాతః సంసర్పాఖ్యద్వయంభవేత్' అను ప్రమాణము సిద్ధమయినదే. ఈ విధముగ మలమాసముల రెండింటియందు సంసర్పత్వము నారోపించుటచేతనే 'ద్వాదశమాసాః సంవత్సరం॥ అస్తిత్రయోదశమాస' ఇతి శ్రుతి వాక్యమునకు ప్రమాణము సిద్ధించును.

ఈ క్రింద నుదహరించిన వానిలో కొన్నింట పూర్వాధిక మాసమునకు సంసర్పము. కొన్ని యెడల ఉత్తరాధిక మాసమునకు సంసర్పము సిద్ధించుచున్నదో తెలియనగును.

1. దుర్మతి సం॥ ఫాల్గునములో చనిపోయినవారికి సంస ర్పాశ్వయుజ మాసమున 8వ మాసికమును, నిజాశ్వయుజమున 9వ మాసికమును, క్షయమున 12వ మాసికమును, అధిక ఫాల్గునమున ప్రథమాబ్దిక మాచరించవలెను.

2. దుందుభి సం॥ శ్రావణములో మృతులయినవారికి సంస ర్పమున 3వ మాసికమును, నిజాశ్వయుజమున 4వ మాసికమును క్షయమున 7వ మాసికమును అధిక నిజ ఫాల్గునములయందు 8వ మాసికమును ద్విరావృత్తిగా పెట్టవలెను.

3. దుందుభి సం॥ మార్గశిరమున మృతులయిన వారికి క్షయమున రెండవ మాసికమును అధిక ఫాల్గునమున 3వ మాసిక మును, నిజ ఫాల్గునమున 4వ మాసికమును ఆచరించవలయును.

4. క్షయ మాస తిథి పూర్వార్ధమున మృతులయిన వారికి ప్రథమ మాసికమును క్షయమున, అధిక ఫాల్గునమున 2వ మాసిక మును, నిజ ఫాల్గునమున 3వ మాసికమును పెట్టి రుధిరోద్గారి మార్గ శిరమున 12వ మాసికమును ఆ పౌషమున ప్రథమాబ్దికమును ఆచరించవలయును.

ఇట్లాచరించిన ఊనములకు లోపముండదు. మాసిక లోప ముండదు.

వ్రత పర్వాది విషయముల నాచరించు విషయమున

శ్లో॥ కార్తికా దిషు మాసేషు యది స్యాతాం మలిమ్లుచౌ॥
సర్వకర్మహర ప్రోక్తః పూర్వ స్త్రత్రమలిమ్లుచః॥

అనగా క్షయమాసమునకు పూర్వమందగు అధిక మాసము నందు తన్మాసాశ్రయుక్త (అశ్వయుజ) వ్రతాదులను చేయకూడదు' మరియు 'స్పష్టమాస విశేషాఖ్యం విహితం వర్జయేన్మలే' స్పష్ట (శుద్ధ) మాసమున చెప్పబడినది సంక్రాంతి లేని నపుంసక రూప మల మాసమున వ్రతాదులు చేయరాదు.

'అంహస్పతి మాసే మాసద్వయ నామాంకితే కృతేసతి శేషానాంచాంద్ర మాసానాం స్వకీయ సౌరమాస సంయోగనియ స్సంభవతీతి' అను యల్లయాచార్యుని వాక్య ప్రకారముగా శరన్న వరాత్రములు - విజయ 10మీ దీపావళి మున్నగు అశ్వయుజమాస కృత్యములు శుద్ధాశ్వినమందే ఆచరించవలయును.

ఇంకొక్క విషయము -

మహాలయ పక్షములో భూలోకమునకు వచ్చిన పితృ దేవ తలు వృశ్చిక సంక్రాంతితో గూడిన కార్తిక శుద్ధ పాడ్యమినాడే తమ తమ లోకములకేగుదురను విషయము సర్వ గ్రంథ సమ్మత మయినదే వర్షక్రియా కౌముది యందు. వ్రతాదుల విషయముల సంసర్ప మాసమును శుద్ధమాసముగా నంగీకరించినయెడల దీపావ వెడలిన పిమ్మట వృశ్చిక సంక్రాంతితోగూడిన కార్తికమున నొక నెల యంతరముండును. దీపావళినాటి సాయం సంధ్యయం దివిటీలు పట్టుట పితృ దేవతలకు మార్గమును చూపుటకే. ఆ మం చటి దినమునగా వృశ్చిక సంక్రాంతితో గూడిన కార్తిక శు పాడ్యమినాడే పితృ దేవతలు తమ తమ లోకమున కేగుదురు

అంతియకాని వృశ్చిక సంక్రాంతిలేని శుద్ధాశ్వయుజ శుద్ధ పాడ్యమి నాడు పితృ దేవతలు నిర్గమించరు - కావున తులా సంక్రాంతితోఁ గూడిన నిజాశ్వయుజ అమావాస్యనాడు (15- 1- 982) దీపావళీ ప్రయుక్త దీపదానమును గావించవలయును. ఇదియే శాస్త్రనిర్ణయము. కావున వ్రతాదుల నాచరించు విషయమున సంసర్పమును మలత్వ ముగా నాచరించవలయుననియు, ఆబ్దికముల విషయమున శుద్ధముగా అంగీకరించ వలయుననియు నొక్కి వక్కాణించడమయినది.

నవీన పండితులలోఁ గొందరు క్షయ మాసమును జనన మరణ విషయములలో ఒక మాసముగా గ్రహించిన విషయ మంతయు సమస్త సిద్ధాంతములకు ఆర్ష గ్రంథములకు పై ప్రమాణముల ననుసరించి ప్రమాణ రహితమయినదని గ్రహించ నగును-

కావున కృష్ణంభట్టు మతమును విడిచి తులా సంక్రాంతితో గూడిన శుద్ధాశ్వయుజమాసమున 17-10-82 శరన్నవరాత్రారంభ మును, 27-10-8 న విజయ 10మిని, 15-11-82న దీపావళీ- ఆశ్వయుజ ప్రత్యాబ్దికములను ఆచరించవలయును. వృశ్చిక సంక్రాంతి యుక్త కార్తిక మాసమున 19-11-82న నాగచతుర్థియును, 28-11-82 క్షీరాబ్ది 12 శియు, 30-11-82 జ్వాలాతోరణమును, కార్తికమాస ప్రత్యాబ్దికములును, ధనుస్సంక్రాంతి యుక్త మార్గ శిరమాసమున 21-12-82 సుబ్రహ్మణ్య 6ష్ఠియు, 26-12-82న వైకుంఠ 11శియు, మార్గశిరమాస ప్రత్యాబ్దికములను ఆచరించ వలయును. అనగా సంసర్ప క్షయములకు మధ్యనున్న సౌర సంక్రాంతితో గూడిన చాంద్రములు స్వస్వమాస కర్మలకు యోగ్యమయినదిగా భావించవలయును. "ఈ విషయమున యల్లయాచార్యుడు" అంహస్పతి మాసే మాసద్వయ నామాంకితే కృతేసతి శేషానాం చాంద్రమాసానాం స్వకీయ సౌరమాస సంయోగ నియమ స్సంభవతి అని చెప్పియున్నాడు.

మకర కుంభ సంక్రాంతి యుక్త పౌషమాఘ యుగళీభూత అంహస్పత్య నామాంతర క్షయమాసమున "మాసద్వయోదితం కర్మ తత్కుర్యాదితి నిర్ణయః" ఇత్యాది సర్వానిబంధన కర్తృ వాక్యాను సారముగా 21-1-83న రథ 7మి, 25-1-83న భీష్మ 11శి, 28-1-83 తూల పరీక్ష-మహామాఘి. 11-2-83 మహాశివ రాత్రియు పౌషమాస ప్రత్యాబ్దికములను,మాఘమాస ప్రత్యాబ్దికము లన్ను చేయవలయును. చౌల వివాహాది విషయములలో ఈ మూడు మాసములు మలమాసముగా విడువవలయును. గర్భాదానము మొదలు అన్నప్రాశనమువరకుగల శుభకర్మలు ఈమల మాసములలో నాచ రింప వచ్చును.

ఈ విధముగా మావృద్ధ ప్రపితామహులయిన చలమయ్య శాస్త్రిగారును, ప్రపితామహులయిన శేషాచల శాస్త్రిగారును, మా పితృపాదులయిన సుబ్రహ్మణ్యశాస్త్రిగారును నిర్ణయించియున్నారు. మరియు క్రీ. శ. 1822-23 చిత్రభాను నామ సంవత్సరమున చిత్రకూటాశ్రమమున కూడిన విద్వన్మండలియునిట్లే తీర్మానించి యున్నారు. భట్ట భాస్కరులు సంసర్పః అగునపుడు ద్వాదశ మాసై స్సహ గచ్ఛతీతి సంసర్పః అని వ్యాఖ్యానించి సంసర్పము సర్వకర్మానర్హ నిర్ణయమును చేసెను.సిద్ధాంత సార్వభౌమమునందు క్షయ పూర్వము నందు స్యకమాసమే గణితాగతమని. సాధారణ్య మాసము వంటివి అని చెప్పెను. కావున విజయదశమి - దీపావళి నిజాశ్వయుజం అనగా తులా సంక్రాంతి కూడిన చాంద్రమాస మందే చేయమని సర్వ గ్రంథ నిర్ణయము.



# మా ఊరు

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

పుడమితల్లి ఒళ్ళంతా పసుపు పులుముకొని
పులకరిస్తున్న వేళ !
మా ఊరు ఒళ్ళువిరిచి బద్ధకంనుండి బయటపడుతున్న వేళ
ఎదురు చూడని విప్లవం ఏడుగుర్రాలెక్కి ఏకాఏకిని
వచ్చినట్లుగా
మా ఊరి ఎర్ర మట్టి బాట మీద వేగపడి వస్తున్న
ఎర్ర బస్సు
కుచేల సంతానాన్ని మోయలేని తల్లిలా కుములుతూ
నీళ్ళు నములుతూ నిట్టూరుస్తూ నిలబడింది నీరెండ
చాయల్లో-
గుంట కట్ట మీద - మా ఊరి పొలిమేరల్లో !
"నడుము నడుముగా మిగిలిందా ?"- అన్న సందేహంతో
లేవనుంకిస్తుంటే
గోలను గేలి చేస్తూ చెవిని పడింది - ఆర్ద్రతనింపుకొన్న
ఒ ఆడగొంతు !
"ఏంవిరా అబ్బోడా బాగుండావా ?" - అని.
ఆ మాట చెవిని పడుతూనే అరక్షణం ఆలస్యం చేయకుండా
నడుమునుండి మెడదాకా తడబడుతూ వచ్చి
తలక్రింద మెడ తాను తప్పనట్లు తట్టగానే
ఆ మెడను అలవోకగా అటు త్రిప్పినాను.
'చిర్రెంటికల' మధ్య చిక్కుకొన్న పేనులా
ఎక్కుతున్న దిగుతున్న వాళ్ళ మధ్య యిరుక్కొన్న
మా సాలమ్మత్త
సాక్షాత్కరించింది సతమతమైపోతూ కూరగాయల
గంపతో !
"నేను బాగానే వుండాను. నువ్వెట్టుండా వత్తా ?"
కుశల ప్రశ్నలు కుమ్మరించినాను కుతూహలంగా
"ఒరే ! .... నీ బతుకు బంగారంగానూ ! .... ఒక్క
సెయ్యాట్టపట్టితే
నలిసిపోతావా ? అలిసిపోతావా ? సూస్తాట్ట దిక్క
పోతే !"-
సాలమ్మత్త మాటల్ని సాగదీస్తూ ఉంది -
కూరగాయల గంపతో కుస్తీపడుతూ, దిగుతున్న వాళ్ళపై
విరుచుకపడుతూ,
మధ్యలో నామాట చెవిని దూరిందేమో ?

"కనబళ్ళా నా తిప్పలు ! - యింకా అడిగేదెందుకూ ?"
అత్తమ్మే ! అత్తమీది కోపాన్ని దుత్తమీద దొర్లించింది.
నన్ను దింపేసి, మా అత్తమ్మ మాటలకు విరగబడి నవ్వేసి,
మరి కొందరు మా ఊరి వాళ్ళను మోసుకొంటూ
మా ఊరుగాలిని కోసుకొంటూ వెళ్ళింది బస్సు.
నేను గుంటకట్ట దిగుతున్నాను.
చేతిలో పాలచెంబుతో ఎదురయింది చెంగమ్మత్త !
అందరూ అత్తలే ఎదురవుతూంటే మత్తెక్కిన మనస్సు -
కోపెక్కి,
"బాగుండావా అత్తా !" అని గోముగా పలకరించింది.
"ఏంబాగోలే నాయినా మాబాగు ?.... వానలూలే !
వంగుడూలే !....
ఈ పల్లెల్లో సావలేక బతకలేక యిదో యిట్లా బతకతా
వుండాం !"
పాలు తొణికిసలాడుతున్నాయి చేతిలోని చెంబులో
నిరాశా నిస్పృహలు ఆవిర్లు కక్కుతున్నాయి అత్తమ్మ
మాటల్లో !
అంతుపట్టక బదులు పలకడానికి తటాలున తట్టక
ఆలోచిస్తూ అడుగు ముందుకు వేసినాను.
ఊరి నడిబొడ్డులో ఊడల మర్రి
అచ్చబండ గుండెల్ని చీల్చుకొని, ఏపుగా ఎదిగింది మరి !
ఆ ఊరే చెట్టు క్రింద ఒదిగినట్లుంది - పెట్ట రెక్కల క్రింద
కోడి పిల్లల్లా !
ఆ ప్రక్కన్నే ఆ చెట్టెత్తు కరంటుమాను -
ఆ మానికొక దీపం !
పట్టపగలే వెలుగుతూ ఉంది ఆ ఊరి ప్రగతిని ప్రదర్శిస్తూ
స్పష్టంగా !
మండే దీపాన్ని ఆర్పడం మన సంప్రదాయానికి విరుద్ధం
గదా మరి?
అచ్చబండకు రవ్వంతదూరంలో పంచాయతీ కార్యాలయం
పాలనా వ్యవస్థ పట్టు విడుపులు పల్లెల్ని చేరిందనడానికి
నిదర్శనం.
తలుపుల్ని బిగించివున్నా త్రవ్విపోస్తూ ఉంది వార్తల్ని
ఆకాశవాణి
తరాలుగా తన ధర్మాన్ని 'తుచ' తప్పకుండా నిర్వహిస్తున్న
ప్రజావాణి!

కబుర్లతో కడుపులు నిండ వనుకొనిందేమో ?-
ఊరు తన పనిలో తాను తలమునకలవుతూ వుంది.
చిన్ననాటితో పోల్చుకోలేని మా ఊరి కొత్తదనం
నా గుండెల్లో ముద్ద మందారాల బృందావనం !
ఊళ్ళో అడుగడుగునా కిశల ప్రశ్నల వెచ్చదనం -
ఊరిచుట్టూ పొలాల పచ్చదనం !-
వెచ్చదనాన్ని వెనక్కు నెట్టుతూపోతే పచ్చదనం ప్రత్యక్ష
మయింది.

సుంగు విడిచి తలపాగా చుట్టి, బీడీముక్క నోటకరచిపట్టి
పంచె కొంగెత్తి ఒకచేతపట్టి గనిమల మీద తిరుగుతూ
ముత్యాలు కంట పడినాడు - కయ్య తడిపడిందో లేదో
చూస్తూ !

"బాగుండావా ముత్యాలూ ?" అని పలకరించినాను.
"ఏదో వుండాం! వచ్చీరాని కరెంటుతో
సాలీసాలని బతుకులతో యిట్లాసస్తా బతకతా వుండాం!"
తొలికోడి కూతకు ముందు ముత్యాలుకూత చెవిని పడేది
రాళ్లబావిలో మోటగట్టి 'రాంవన్నరాంవో!'అని రాగాలుతీస్తూ
పొద్దు నడిమిట్టకు వచ్చేదాకా తిరుగుడు కపిలతో
బానకుబాన పాతాళగంగను పట్టుబట్టి పైకి దెచ్చిన
ముత్యాలు
నిన్నగాక మొన్న అమెరికా అధ్యక్షునిచే కొనియాడబడిన
ముత్యాలు
ఆ ముత్యాలేనా మాట్లాడేది ?
మా ఊరి మనస్తత్వం చిత్రంగా నా మనస్సులో
యిరుక్కొనింది.
కాలు పెరుక్కొని ముందు పడలేక నిలబడి ఆలోచిస్తు
న్నాను.

మోటు అవసరం లేకనే మీటు నొక్కితే చాలు
పాతాళగంగ ఉరవళ్ళు పరవళ్ళుమీద పైకివస్తూ ఉంది.
అయినా ముత్యాలు మురిసి పోవడంలేదు.
చెంబుడు పాలు సొమ్ము చేసుకోవడానికి
చిక్కటి చీకటి తెరల్ని చీల్చుకొంటూ నడిచి
పేటలోనే పొద్దు మొగం చూస్తూ ఉండిన చెంగమ్మత్త
ఊరి ముందర పాలసేకరణ కేంద్రంలో
ఈ చేత్తో పాలుపోసి ఆ చేత్తో రూక లందుకొంటున్నా
ఎందుకో ఆ బ్రదుకులో తీరని అసంతృప్తి!

మగవాడి చెమటకు మారుపేరు కూరగాయలు
సాలమ్మత్త కష్టానికి మరొక్క పేరు పేటలో బేరం
పైట చెరగే తలమీద చుట్టగా
మెడలు విరిగే బరువు భావికి వెలుగుగా
నాలుగుమైళ్ళ దూరానవున్న పేటకు కాళ్ళీడ్చేసరికి
దేవుళ్ళే దిగివచ్చే వాళ్ళు సాలమ్మత్త దరికి

ఇప్పుడు ఊరి ముందర గుంట కట్టమీద బస్సెక్కుతున్నా
సాలమ్మత్త మొగంలో
సాదుకోవడానికి లేదు రవ్వంత ఆనందం
ఎక్కడుంది లోపం ?

సహకార పరపతి సంఘాలా ? - సాగుతూనే ఉన్నాయి.
అరువులా ? బ్యాంకులు పల్లెలకే తరలి వచ్చి పంచి
పెడుతున్నాయి.
ఎరువులా ? సబ్సిడీ పథకంలో సరఫరా అవుతూనేఉన్నాయి
వెలుగులా ? ఇంటి కొక్కబల్బు నినాదం వినిపిస్తూనే
ఉంది.

నిధులా ? కోటాన కోట్లు విడుదల అవుతూనే ఉన్నాయి
ప్రయాణ సౌకర్యాలా ? ఊరి కొక్క బస్సు కనుపిస్తూనే
ఉంది.

గాంధీజీ కలలుగన్న గ్రామాభ్యుదయం
మూడు పువ్వులారు కాయలుగా కొనసాగుతున్నట్లే
ఉంది.

అయితే - మా ఊళ్ళో యింటింటా నైరాశ్యం నట్టింట
కాపురం పెట్టింది.

స్వాతి మబ్బుల్లా నడమంత్రపుసిరి రూకల్లా
ఊరెని తెలియకనే ఆవరించిన ఈ నైరాశ్యానికి
హేతువేమి ?

ఆలోచించేకొద్దీ గుండెదడ....కాళ్ళు వణకడం....
నన్నెక్కడ ఈ నైరాశ్యం నమిలేస్తుందో ?- అని.
అందుకే ఒక్క ఊపులో గుంటకట్ట మీద పడి
అటుపై మా ఊరి ఎర్రమట్టిబాట మీద దిగబడి వస్తున్న
ఎర్రబస్సును ఎగబడినాను !
ఎందరో నాలాగా ఎగబడివచ్చి దిగబడిపోతున్న వాళ్ళు!
అందుకే అది ఊరు ఊరుగా మిగిలింది.
తలచు కొంటే ఏదో బాధ రగులుతుంది !

....〰....

శ్రీ వసంతరావు వేంకటరావు

# ఆధునిక విజ్ఞానం ఎటు పోతూంది?

గత రెండు దశాబ్దాలలో పెంపొందిన విజ్ఞానం ఆశ్చర్యకరము, అనూహ్యము అయిన భావాలకు దారి తీస్తూంది. ఒక విధంగా మిథ్యావాదాన్ని బలపరచి, హేతువాదాన్ని కించపరుస్తూంది. అది ఎంతవరకు పోయిందంటే ప్రాచ్యదేశాల యోగులు చెప్పిన నిగూఢ జ్ఞానాన్ని మనం తిరిగి ఆవిష్కరిస్తున్నామా అనే స్థితికి పాశ్చాత్య శాస్త్రజ్ఞులను తీసుకొని వచ్చింది. ద్రవ్య నిర్మాణం తెలుసుకోడానికి విజ్ఞానులు పెంపొందిస్తూన్న గణితమూ, నిర్మిస్తూన్న సునిశిత యంత్రాలే దీనికి ముఖ్య కారణంగా చెప్పుకోవచ్చు.

ద్రవ్య నిర్మాణం పరిశీలిస్తే తేలిన విషయాలను ఇట్లా చెప్పుకోవచ్చు: ద్రవ్యమంతా అణువులతో ఏర్పడింది, పరమాణువుల కూటం అణువులు, పరమాణువులో కేంద్రకం దానిచుట్టూ తిరిగే ఎలెక్ట్రాన్లు ఉన్నాయి. కేంద్రకంలో నున్నవి ప్రోటాన్లు, న్యూట్రాన్లు. ప్రోటానుకు ధన విద్యుదావేశముండగా ఎలెక్ట్రానుకు ఋణ విద్యుదావేశముంది. ఈ రెండు విరుద్ధ ఆవేశాలు ఒకదానికొకటి సమానం. న్యూట్రానుకు ఆవేశం లేదు. అది తటస్థకణం. కాగా, పరమాణు నిర్మాణంలో పాల్గొనేవి మూడు కణాలు. ఆ మూడూ ప్రాథమిక కణాలనీ, వాటిని ముక్కలు చేయడంసాధ్యం కాదనీ అనుకొన్నారు.

తరువాతి దశలో అతిశక్తిమంతమైన కణాలను ఒక లక్ష్యం పైన ప్రయోగించగల యంత్రాల నిర్మాణం జరిగింది. అట్టియంత్రాలలో ప్రోటాను వంటి కణాలకు బాగా శక్తినిచ్చి కాంతి వేగాన్ని సమీపించే వేగంతో లక్ష్యంపైన ప్రయోగించగా, ఆ చర్యలో రకరకాల కణాలు ఉత్పన్నమవడం కనిపించింది. ఆ విధంగా బయల్పడిన కణాలను కూడా 'ప్రాథమిక కణాలు'గా భావించేరు. కాని, యంత్ర సామర్థ్యం పెంచి తాడన కణాల శక్తిని ఎక్కువ చేసిన కొద్దీ, ఉత్పన్నమయే కణాల సంఖ్యకూడా పెరగజొచ్చింది. అట్టి ప్రాథమిక కణాలు, ఇప్పటి దాదాపు 150 వరకు కనుగొన్నారు.

వందలకొలది 'ప్రాథమిక కణాలు' ఉండటం అసంభవమని ఎవరికైనా స్ఫురిస్తుంది. వాటి జీవిత కాలం కూడా చాలాస్వల్పం. యంత్రాలలో జన్మించడమే తడవు అవి రూపాంతరం పొందుతాయి. ప్రాథమిక కణ వర్గాన్నిబట్టి దాని జీవితకాలం $10^{-8}$ నుండి $10^{-22}$ సెకను వరకు ఉంటుంది. స్థిరంగా ఉన్న ప్రాథమిక కణాలు — అంటే చాలా కాలం విఘటనం చెందకుండాఉండేవి— ప్రోటాను, ఎలెక్ట్రాను, ఫోటాను, న్యూట్రినో. మిగిలినవన్నీ సెకనులో కోటియవ వంతు కాలంలోనో, ఇంకా అంతకు బాగా తక్కువ కాలంలోనో రూపు మాసిపోతాయి.

లక్ష్యాన్ని ఢీకొనే కణాలకు ఇచ్చే శక్తిమీద ఉత్పన్నకణాల జననం ఆధారపడుతుందని తెలియవచ్చింది. అంటే, కణంయొక్క గతిజశక్తి మాత్రమే క్రొత్త కణాల ఉత్పత్తికి మూలమన్నమాట. శక్తి ద్రవ్యంగా రూపాంతరం పొందడానికి సంబంధించిన సమీకరణం $E = Mc2$

ఇందులో $m$ = కణం ద్రవ్యరాశి, $E$= శక్తి, $c$ = కాంతి వేగం = 186000 మైళ్ళు సెకనుకి. శక్తిమంతమైన కణాల ప్రయోగంలో పరమాణు కేంద్రకాలను విచ్ఛిన్నం చేసినప్పుడు మాత్రమే ఈ విధమైన శక్తి ద్రవ్యాలమార్పు జరుగుతుంది. $c$ విలువ లక్షల మైళ్ళలో ఉండటంచేత ఎంత స్వల్ప ద్రవ్యరాశి $m$ శక్తిగా మారినప్పటికీ అపారమైన శక్తి $mc2$ లభిస్తుంది. అదే విధంగా శక్తి ద్రవ్యంగా రూపాంతరం చెందినప్పుడు అత్యల్ప కణాలు జనిస్తాయి. వాటికి నిలకడలేదు. తాత్కాలికంగా పుట్టి గిట్టడమే వాటి ధర్మం. అయితే లక్షలమైళ్ళ వేగంగల వస్తువులు నిత్య జీవితంలో అనుభవానికి రావు; కాగా, శక్తి ద్రవ్యంగా మారే సంఘటనలు తారసపడవు. కాబట్టి ఉచితమైన యంత్రాలు నిర్మింపబడిన తరవాతనే పై సమీకరణ సత్యం రుజువయింది. అటంబాంబు నిర్మాణానికి దారితీసింది పై సమీకరణమే!

ప్రాథమిక కణాలకు అనేక ధర్మాలున్నాయి. కణం తన అక్షంపైన భ్రమణం చేయడం వాటిలో ఒకటి. ఏకణమూ నిలకడగాలేదు. నిలకడ లేకపోవడం పరమాణువులోని కేంద్రకానికీ ఎలెక్ట్రానులకూ కూడా వర్తిస్తుంది. ఎలెక్ట్రాన్లు ఆత్మ భ్రమణం చేస్తూ కేంద్రకం చుట్టూ తిరుగుతున్నాయి. కేంద్రకంలోని న్యూక్లియాన్లు స్పందిస్తున్నాయి. అణువులోని పరమాణువులు నిరంతరం కంపిస్తున్నాయి. అణువుకే స్పందిస్తున్నాయి. అట్లుకాకపోతే పదార్థాన్ని వేడి చేసినప్పుడు దాని ఉష్ణోగ్రత పెరగదు. అంటే, అణు స్థాయి వరకు నిలకడగా ఉన్న కణం లేదని స్పష్టమే కదా! అయితే, వాటి భ్రమణ గమన చలనాలు మనకేమీ తెలియవే! మనం కూర్చున్న కుర్చీలోని అణువులు స్పందిస్తునే ఉన్నాయి. అయినప్పటికీ కుర్చీ దృఢంగా నిలకడగా ఉండి, మనం స్థిరంగా కూర్చోడానికి ఆస్కారమవుతూంది. ఇదీ సూక్ష్మమైన అణులోక పరిస్థితి.

బృహత్ నక్షత్ర లోకంలో పరిస్థితి కూడా వేరుగా లేదు. నక్షత్రాలు వాటి అక్షంపైన తిరుగుతూనే ఉన్నాయి. సుమారు 27 రోజులలో సూర్యగోళం తనలో తను ఒక్కసారి తిరుగుతుంది. గ్రహాలూ ఆత్మభ్రమణం చేస్తున్నాయి. ఒక్కరోజులో మనభూమి ఒక ఆత్మ ప్రదక్షిణం చేస్తుంది. నక్షత్రాలు గుంపులుగా ఏర్పడిన గేలక్సీ కూడా తన అక్షంపైన తిరుగుతూంది. సూర్యునిచుట్టూ మనభూమి గంటకు 67000 మైళ్ళ వేగంతో తిరుగుతూంది. ఈ విషయాలను యంత్ర సహాయంతో సహేతుకంగా విజ్ఞానం స్పష్టపరుస్తూంది. మనకేమో ఆ భ్రమణ గమనాలు తెలియవు. అవి మన అనుభవానికిరావు. నక్షత్ర లోకంలో కూడా నిలకడగా ఉన్న దేదీలేదు.

వీటి నుండి వెలువడే పరమ సత్యం ఒకటుంది. సూక్ష్మ లోకాలపరిస్థితులు, బృహత్ లోకాల పరిస్థితులు విజ్ఞానంవిశదీకరించినవి మన అనుభవంలో లేవు. పరమాణువుకీ నక్షత్రానికీ మధ్య మానవుని పరిమాణం ఉందని శాస్త్రజ్ఞు లంటారు. $10^{28}$ పరమాణువుల కూటం ఒక మానవుడు, $10^{28}$ మానవుల కూటం (పదార్థంలో) ఒక నక్షత్రం. ఈ రెండింటికీ మధ్య నున్న మానవుని అనుభవాలతో ఆ రెండు లోకాల గురించి విజ్ఞానులు చెప్పినది సరిపోదు. అదే జీవుని విషయంలో కూడా యోగులు చెప్పేరు.

"అవ్యక్తాదీని భూతాని, వ్యక్త మధ్యాని భారత, అవ్యక్త నిధ నాన్యేవ."

"జీవుని శరీరాలు ఉత్పత్తికి పూర్వం అవ్యక్తములు, స్థితి కాలమున వ్యక్తములు, వినాశమైనతరువాత మరల అవ్యక్తములు."

మన ప్రాపంచిక జ్ఞానం కూడా పరిమాణ పరంగా అంతే. సూక్ష్మ పరిమాణాన్ని ఆదిగాను, బృహత్ పరిమాణాన్ని అంతంగాను చెప్పుకొంటే మానవుని పరిమాణం మధ్యస్థమై ఉంది. మన పరిమాణంలో - అంటే మధ్యగా - నున్న వస్తువుల విషయమే మనకు తెలుసు, అది వ్యక్తం. సూక్ష్మ బృహత్ పరిమాణాలు రెండూ మన పంచేంద్రియాలకు అవ్యక్తం. కాబట్టి, పంచేంద్రియాలు సంపాదించిన జ్ఞానాన్నే నమ్ముకొని, అదే ఆధారంగా హేతువాదం ప్రతిపాదిస్తే అట్టి హేతువాదులు మట్టి పాలవుతారని విజ్ఞానం చెబుతూంది.

మానవుడంటే శరీరం, బుద్ధి, మనస్సు, హృదయం మాత్రమే కాదనీ, జీవుడో ఆత్మో కూడా శరీరంలో ఉన్నదనీ విజ్ఞులూ, ప్రాజ్ఞులూ, అనుభవజ్ఞులూ చెబుతారు. విజ్ఞానం పరిధిలో చేరని అంతస్స్ఫూర్తి కూడా మానవునిలో ఉందని మేధావులైన విజ్ఞానులే అంగీకరించేరు. చైతన్య లక్షణం అంతస్స్ఫూర్తి అంటారు. మానవునిలో అపారమైన అంతశ్శక్తులు నిగూఢంగా ఉన్నట్లు దివ్యజ్ఞానులు అనుభవ పూర్వకంగా ప్రకటిస్తారు. ఇంత వరకు అంతశ్శక్తుల జోలికి విజ్ఞానం పోలేదు. సూక్ష్మ బృహత్ లోకాల అవ్యక్తతను అర్థం చేసుకొన్న విజ్ఞానులు ప్రాచ్యదేశ యోగులు చెప్పిన వేదాంత విషయాలను మథించి, వాటి సత్యాన్ని అంగీకరించడానికి ఉన్ముఖు లవుతున్నారు. విశ్వసత్యం దర్శించడానికి యోగులు ప్రయత్నించినప్పుడు పొందే అనుభవాలకు సదృశమైన అనుభవాలనే ఆధునిక విజ్ఞానులు సాపేక్షతా సిద్ధాంతం, క్వాంటం సిద్ధాంతం అర్థం చేసుకోడానికి ప్రయత్నించినప్పుడు పొందుతున్నారన్న భావం విజ్ఞాన లోకంలో బలపడుతూంది. దానికి ఉదాహరణగా ఫ్రిట్‌జాఫ్ కేప్రా రచించిన 'ది టౌ ఆఫ్ ఫిజిక్స్', లోని 'ఆ ముఖం' పేర్కొనవచ్చు.


పుస్తకములు

వ్యవసాయము మరియు పలువిధములైన ప్రయోజనకరమైన గ్రంథములు

మా ఉచిత కేటలాగు కొరకు దయచేసి ఇంగ్లీషులో వ్రాయండి.

N. K PAUL & SONS
P. B. 12202
CALCUTTA - 5

కేప్రా అంటాడు : ''ఒక వేసవి మధ్యాహ్న సమయాన నేను సముద్ర తీరాన్న కూర్చున్నాను. తరంగాలులేచి పడటం చూస్తూ నాశ్వాసోచ్ఛ్వాసాల లయ అనుభవిస్తూ ఉండగా నా శరీ సరాలన్నీ ఒక మహాద్భుత విశ్వనాట్యంలో పాల్గొంటూన్నట్లు ఆ కస్మికంగా జ్ఞానం కలిగింది. నాచుట్టూ ఉన్న ఇసుక, రాళ్ళు, నీరు గాలి కంపిస్తూన్న అణువులతోను పరమాణువులతోను ఏర్పడ్డాయనీ, వాటిలో ఇతర కణాలను సృష్టిస్తూ నాశం చేస్తూన్న కణాలు అంత శ్చర్యలు జరుపుతూ ఉన్నాయనీ, నేను భౌతిక శాస్త్రజ్ఞుడిని అవడం చేత నాకుతెలుసు. కాస్మిక్ కిరణాల జల్లులవల్ల భూవాతావరణం నిరం తరం తాడనం చెందుతూందనీ, అతి శక్తికణాలు గాలిలో చొచ్చి నప్పుడు బహుళ సంఘాతాలకు గురి అవుతాయని కూడా నాకు తెలుసు. అతిశక్తి భౌతిక శాస్త్రంలో పరిశోధనలు చేస్తూన్న నాకు ఇవన్నీ పరిచయమైనవే. కాని, ఆక్షణం వరకు గ్రాఫులద్వారా, చిత్రాలద్వారా, గణిత సిద్ధాంతాలద్వారా మాత్రమే వాటి అవగాహన నాకు కలిగింది. కాని, సముద్ర తీరాన్న కూర్చున్నప్పుడు నా పూర్వానుభవాలు జీవం పోసుకొన్నాయి. బాహ్యాకాశం నుండి అవ తరిస్తూన్న శక్తి ఆవర్తాలను చూచేను ; అందు, లయాత్మక స్పందా లలో కణాలు సృష్టించబడి వినాశమవుతున్నాయి. విశ్వశక్తి తాండ వంలో పాల్గొంటూన్న మూలకాల పరమాణువులనూ, నా శరీరంలోని పరమాణువులనూ చూచేను. ఆ లయ అనుభవించేను,శబ్దంవిన్నాను. హిందువులు ఆరాధించే. నాట్యవిభుడు శివుని తాండవంగా దీనిని ఆక్షణంలో తెలుసు కొన్నాను.... ఆధ్యాత్మిక సత్యాలు చైతన్య గాంభీర్యాల నుండి అప్రయత్నంగా వెల్లుబికి వస్తాయని తెలుసు కొన్నాను."

మహత్తరమైన ఆధ్యాత్మిక సంస్కృతికి వారసుడు భారతీ యుడు. అట్టి విజ్ఞాని పొందవలసిన అనుభవాలివి. అయితే, ఆ అదృష్టం మనకు దక్కలేదు, పాశ్చాత్య విజ్ఞానులను వరించింది.

జ్ఞానార్జన చాలా కష్టంతో కూడిన పని. ఏ క్షేత్రానికి సంబం ధించిన కూలంకష జ్ఞానం సంపాదించాలన్నా తప్త హృదయంతో కృషిచేయాలి. అదే తపస్సు. పాశ్చాత్య విజ్ఞానులు తెలియకుండానే తపస్సు చేస్తున్నారు, ఫలితాలు పొందుతున్నారు. విజ్ఞానంలో కాని, వేదాంతంలో కాని సమగ్రమైన జ్ఞానం ఆర్జించినప్పుడే పరమ సత్యం హృగ్గోచరం కాగల అవకాశం ఉంది. 'చదువుకొన్నాము' అనే ధీమాతో అర్ధ జ్ఞానంతో సిద్ధాంతాలు చేసి ప్రజలపై రుద్దడం కన్న పాపం లేదు. అదొక సంఘ విద్రోహక చర్య మాత్రమే అవుతుంది.



ఆంధ్రపత్రిక
రుధిరోద్గారి
సంవత్సరాది సంచికకు
రచయితలు/రచయిత్రులు
తమ రచనలు
31-12-1982 తేదీ లోపుగా
పంపకోరుచున్నాము.
—సంపాదకుడు

నవంబరు
భారతిలో
రెక్కలు
డా॥ సి. నారాయణరెడ్డి

డా॥ కొండూరు వీరరాఘవాచార్య

# మలికొండల విశ్వబ్రాహ్మణ కవులు

## (ముమ్మనాదులు)

1982 సం॥ మార్చినెల భారతిలో శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు "విశ్వబ్రాహ్మణ కవులు" అని ఒక వ్యాసమును వ్రాసి యున్నారు. ఆ వ్యాసమున అంధ్రమునందు వెలసిన విశ్వబ్రాహ్మణ కవులను కొండఱను మాత్రము ప్రస్తావించి యున్నారు. వారిలో శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానమునందు ఈశాన్య సింహాసనము నధిష్ఠించి, పది రెండు వత్సరములు అష్టదిగ్గజకవులలో ఒకడుగా అసాధారణ ప్రతిభా మహనీయతను అగపఱచిన కందుకూరి రుద్రకవి నుండి కొండఱు కవులను శ్రీ శాస్త్రిగారు ప్రస్తావించినారు. అంతకు పూర్వమే - అనగా ప్రౌఢదేవరాయల ఆస్థానమునందే ముమ్మనాచార్యుడను మహాకవి కలడు. ఆయనను, మలికొండఱు విశ్వబ్రాహ్మణ కవులను గూర్చి ఈ వ్యాసమున ప్రస్తావింతము.

### ముమ్మన

ఈ ముమ్మన శ్రీనాథుని కాలమువాడు. ప్రౌఢదేవరాయల ఆస్థానమున ధర్మాధికారి, విద్యాధికారి పదములను రెంటిని అతి దక్షతతో నిర్వహించి ప్రశస్తి గన్నవాడు. ఈయన గాయత్రీ పీఠాధిపతి కూడాను. అందువలననే ఈయనకు ప్రభుత్వాస్థానమున ధర్మాధికారి పదవిలభించినది. ఆనాడు - ఆనాడే కాదు. అంతకు మిక్కిలి పూర్వము నుండియు - గాయత్రి, సావిత్రి, సరస్వతీ పీఠములు మూడును విశ్వబ్రాహ్మణుల పాలనముననే ఉండేవి. గాయత్రి విశ్వకర్మలకుగల నామరూపాది సామ్యములు, జగన్మాతృ పితృత్వములు మున్నగు వానిని బట్టి ఈ పీఠత్రయము అనాది నుండియు విశ్వకర్మ వంశ బ్రాహ్మణుల పాలనములో నుండుటలో పరమౌచిత్యమున్నది. ఇట్టి ఆభిజాత్యముచేత ధర్మాధికారిగాను, పాండిత్యాది శక్తులను బట్టి విద్యాధికారిగాను ముమ్మన ప్రౌఢ దేవరాయల ఆస్థానమున నుండుట పొసగినది. ముమ్మన ఇంతటి మహిమాఢ్యుడు కనుకనే ప్రౌఢదేవరాయల ఆస్థానమున ఉద్ధతుడై యున్న గౌడడిండిమ భట్టును జయించుటకు శ్రీనాథ మహాకవి పూనినప్పుడు ముమ్మనాచార్యుని సాయము నర్థించవలసి వచ్చినది. రాజాస్థానమున ప్రవేశము లభింపక ఇబ్బంది పడుచున్న శ్రీనాథుడు ముమ్మన వద్దకు వచ్చి ఇట్లు ప్రార్థించినాడని దిగువ పద్యముచే తెల్లమగుచున్నది.

సీ॥ పంపా విరూపాక్ష బహు జటాజూటికా
  రగ్వధ ప్రసవ సౌరభ్యములకు,
తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా
  గంభీర ఘుమఘుమారంభములకు,
కళసాపుర ప్రాంత కదళీ వనాంతర
  ద్రాక్షా లతా ఫల స్తబకములకు,
కర్ణాట కామినీ కర్ణ మౌక్తికరత్న
  తాటంక యుగధాళ ధళ్యములకు,
గీ॥ నిర్ణిబంధనిబంధమై నెనయు కవిత
  తెలుఁగునను, సంస్కృతంబునఁ బలుకనేర్తు;
  ప్రౌఢ దేవేంద్ర రాయభూపాలవరుని
  సమ్ముఖంబున దయఁజూడు ముమ్మసుకవి!"

శ్రీనాథ మహాకవి సాటికవుల నెవ్వరిని లెక్కచేయువాడు కాడు. అట్టి మహనీయుడు ముమ్మన వద్దకు వచ్చి "ప్రౌఢ దేవేంద్రరాయ భూపాలవరుని, సమ్ముఖంబున దయఁ జూడు" మని ప్రార్థించినాడన్నచో, ఆ ముమ్మన ఇంకెంత మహనీయుడో సౌజన్యమూర్తియో తేటతెల్లమగుచున్నదికదా! అందుకు ఆయనను "ముమ్మసు కవి!" అని సంబోధించి ఆతడొక సత్కవీశ్వరుడని కూడ చాటినాడు. దీనిని బట్టి శ్రీ నాథుడు కూడ సత్కవుల యెడ సౌజన్యమూర్తియే అని తెలియుచున్నది.

ముమ్మనకు గూడ గౌడడిండిమభట్టు యొక్క ఔద్ధత్య మన్న కంటగింపుగానే ఉండియుండును. అందుకే శ్రీనాథునితో ఏకీభవించి రాజాస్థాన ప్రవేశము కల్పించి, అతని నోడించుటలో శ్రీనాథునికి పూర్ణ సహకార మందించి యుండును. ఇంతటి మహోజ్జ్వల చరిత్రగల ముమ్మనాచార్యుడు విశ్వబ్రాహ్మణ (ఆంధ్ర) కవులలో మొదటి వాడుగా నగపడు చున్నాడు. ఇమ్మహాకవి పుట్టు పూర్వోత్తరములు ఆంధ్ర విశ్వకర్మ పురాణావతారికనుండికొంత తెలియుచున్నవి. వానిని పరికింతము.

ముమ్మన కవి వంశకర్త, యజుర్వేద ప్రసిద్ధులైన పంచ బ్రహ్మఋషులలో మూడవ వాడగు అహభూన ఋషి. ఇతడు సృష్టికర్తయైన త్వష్ట సంప్రదాయమునకు చెందినవాడు. త్వష్ట్ర దేవునికీ, అహభూనఋషికీ అభేదమును పురాణ వాఙ్మయము చెప్పు చున్నది. విశ్వకర్మ పురాణములో అహభూన శబ్దము "అభువన" అని ప్రయోగింపబడినది. దీనిం బట్టి "అహభూన, అభువన" పదములు పర్యాయ పదములని యెన్న వలసి వచ్చు చున్నది.

విశ్వకర్మ పురాణకర్త పీపూరి వెంకటాచార్యుడు ఈ ముమ్మన వంశమువాడే. ఇతడు తన వంశాభి వర్ణనము చేయుచు తనకు పూర్వము ఏడవ తరము నుండి గల పితాధి పతులను వర్ణించియున్నాడు. విశ్వకర్మ తనయుడగు అభువనఋషివంశమున నాగన్న ఉదయించినాడు. ఈ నాగనాచార్యుడు విద్యారణ్యులతో సహకరించి, విద్యానగర నిర్మాణ సందర్భమున వాస్తు శిల్పా చార్యుడై ప్రకాశించినాడు. ఈయన కుమారుడు గంగన్న. ఇతనిని గూర్చి-

"అభువన గోత్ర పవిత్రం
దభినవమను సూత్ర పాత్రుడల ఋక్శాఖా
ప్రభుడతడు పంచశర వ
న్నిభుడా గంగనకు సాటి నేర్తురె పోలన్."

అని వర్ణింపబడినది. దీనినిబట్టి పీపూరివారు (ముమ్మన వంశము వారు) మను సూత్రులనియు, ఋక్శాఖాధ్యాయులనియును తెలియు చున్నది. *

ఈ గంగనకు కసవన పుట్టినాడు. ఈ కసవన కుమారుడే ముమ్మనాచార్యుడు. ఇతడు మహా విద్యాధురంధరుడు, వేదశాస్త్ర వేత్త, దశక్రియా పరిజ్ఞాత. ప్రౌఢ దేవరాయల వారి ఆస్థానములో నుండి ధర్మాధికార, విద్యాధికార ములను నెఱపి అగ్రహారాది బహు మానముల నందినవాడు. ఈ అంశములు విశ్వకర్మ పురాణస్థము లైన దిగువ పద్యములనుబట్టి తెలియుచున్నది.

"ఆ కసవన కుదయించెన్
జోకన్ముమ్మన మహాయశోధనుడై వా
ణీకాంతోమా కాంతర
మా కాంతుల మించు గుణసమానని రూఢిన్."

* శ్రీ వేదము వెంకట రాయశాస్త్రిగారు తమ వ్యాసములో - అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణమయములైన పంచ శిల్పములను చేయు విశ్వబ్రాహ్మణులను గూర్చి ప్రస్తావించుచు" వీరికి వేదాధి కారము, అందులో ఏ వేదమున అధికారమున్నదో తెలియదు. అథర్వవేదమునకు చెందినవారో కారో తెలియదు. వీరిని పంచా హణంవారు, పంచాననంవారు అనుటకలదు." అని వ్రాసినారు. కనుక ఈ దిగువ వివరములను సంగ్రహముగా పేర్కొనుట యగుచున్నది.

విరాడ్విశ్వకర్మ అయిదు ముఖములు కలిగి పంచాననుడై నాడు. ఆ విశ్వకర్మ బ్రహ్మయొక్క పంచశీర్షములనుండి మను, మయ, త్వష్ట్ర, శిల్పి (దైవజ్ఞ) విశ్వజ్ఞులనెడి పంచ బ్రహ్మలుద యించి - సృష్టి, స్థితి, లయ, తిరోధాసిన, అనుగ్రహములనెడి పంచకర్మలకు కర్తలయినారు. వీరె సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులనెడి పంచ ఋషులై విశ్వబ్రాహ్మణులకు కూట స్థులు, గోత్ర ఋషులు అయినారు. వీరె వరుసగా- అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణమయములైన పంచ శిల్పములకు ఆదిమసృష్టి కర్తలు. పరమేశ్వరుని పంచాననముల నుండి పుట్టినవారుగాన వీరిని పంచాననం వారనియు, పంచాహణం వారనియు, పంచాననులనియు కూడ వ్యవహరించినారు. ఆ విశ్వకర్మ పరమేశ్వరుని పంచానన ములనుండి ఋగ్, యజు, స్సామ, అథర్వ, ప్రణవములనెడి పంచ వేదములు ఉదయించినందున పంచవృష్టులకు, వారి వంశము వారికి అధ్యయనాధ్యాప యోగ్యములయినవి. "జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మంకర్మ స్వభావజం" అని గీత చెప్పినట్లు, మోక్ష ధర్మ ప్రకాశకమగు వేదవిద్య, విజ్ఞాన ప్రధానమగు శిల్ప విద్య వీరికి అపరణీయములై సంపూర్ణ బ్రాహ్మణత్వమును వీరికి చేకూర్చినవి. ఆ మన్వాది బ్రహ్మల పేర్లతో మను సూత్ర, మయ సూత్ర, త్వష్ట్రసూత్ర, దైవజ్ఞ సూత్ర, విశ్వజ్ఞ సూత్రములు వెలసి ఈ బ్రాహ్మణులాయా సూత్రానుసారులయినారు. సంగ్రహ ముగా వేద శాస్త్రముల ననుసరించి సూచిన విశ్వ బ్రాహ్మణుల పుట్టు పూర్వములు, ఆచార వ్యవహారములు ఇట్టివి :

"అర్యులు మెచ్చగాను గను
నందరిలో ఘనమాన మానితో
దార్యుడు, ధైర్యశాలి, యతి
ధన్యు, డతండు ధరం దళక్రియా
చార్యుడు, మేఘవాహనుడు,
సత్యయశోనిధియైన ముమ్మనా
చార్యుడు ధాత్రి నొప్పెనగు
సాధుజనాన్వితుడై మహోన్నతిన్."

"ఆ ముమ్మన నిజ కవితా
శేముషి మెప్పించి యందె సింధుర, తురగ,
స్తోమంబులు, భూషణములు,
గ్రామంబులు ప్రౌఢ దేవరాయల వలనన్."

పై పద్యములనుబట్టి ముమ్మనాచార్యుడు మంచికవి అయి, సజ్జనాగ్రేసరుడనియు, వాస్తు శిల్పాదులలో దళక్రియా పరిజ్ఞాతమనియు, ప్రౌఢ దేవరాయల వలన సముచిత సత్కార బహుమానములందిన వాడనియు తెలియుచున్నది. దురదృష్ట వశమున ఈ కవి వ్రాసిన కావ్యములుగాని, శాస్త్రములుగాని ఏవీ కనబడుటలేదు. ఇంతటి వాడేమీ వ్రాయలేదని అనుకొనుటెట్లు ?

ప్రౌఢదేవరాయల కొలువులోనున్న డిండిమభట్టు మొదలగు తొలి పండితులలో నెల్ల ఈతడగ్రేసరుడని తెలియుచున్నది. డిండిమభట్టాదులు పరోత్కర్షను సహింపలేని అసూయాపరులనుట శ్రీనాథుని వాదసందర్భమునందే తెలియుచున్నది. కావుననే డిండిమభట్టు గర్వమున ఐంపతదాస్థానములో స్థానము సంపాదింప వచ్చిన శ్రీనాథుడీ సౌజన్యమూర్తి నాశ్రయించి కార్యసిద్ధి నందినాడు.

## ఒక అపూర్వ విషయము

ఆంధ్ర విశ్వకర్మ పురాణమును బట్టి శ్రీనాథుడు కూడ ఒక విశ్వకర్మ పురాణమును వ్రాసినట్లు దిగువ పద్యమువలన తెలియుచున్నది.

"శ్రీనాథుం డొనరించె నంచు విబు
ధుల్ చెప్పన్ ధరన్ విన్నదే
కానెందున్ గనమా జగద్గురుని స
త్కారుణ్య దివ్య ప్రభా
లీనానస్థిర శేముషీ మహిమ, వి
ద్యా శ్రీనిధుల్ మెచ్చగా
నానార్థంబుల నీవు చెప్పవలయున్
సర్వం సహా మండలిన్."

శ్రీనాథుడు విశ్వకర్మ పురాణమును రచించినట్లు ఎచ్చటను వినలేదు. కాని ఈ పద్యమును బట్టి వేంకటాచార్యుని నాటికి పండిత లోకములో అట్టి ప్రసిద్ధి కలదని తెలియుచున్నది. ఒకవేళ భీమేశ్వర పురాణమునువలె కవిసార్వభౌముడీ విశ్వకర్మ పురాణమును గూడ రచించెననుటలో అసంభావ్యతలేదు. అది అతని దారిద్ర్య భూయిష్ఠమగు తుది జీవితంలో గణనకు రాక నశించియు ఉండ వచ్చును. శ్రీనాథ మహాకవి ప్రౌఢ దేవరాయలను దర్శింపబోయి నప్పుడు ముమ్మనాచార్యుని సాయమునందినాడు కదా ; వారిరువురికి పొసగిన నెయ్యమునుబట్టి ముమ్మన శ్రీనాథుని విశ్వకర్మ పురాణ రచన చేయుమని అర్థింపగా, అందుకాయన ఆపని చేసి యుండ వచ్చును. ముమ్మన కృతులు నామరూపములు లేకుండ నశించి పోయినట్లే విశ్వకర్మ పురాణమును నశించి యుండవచ్చును. శ్రీనాథుని కృతులయిన "మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతులు" నశింపలేదా ?

## విశ్వకర్మ పురాణకర్త : వేంకటాచార్యుడు

ఈ ముమ్మనకు అంబన జనించినాడు. ఈయన కవి స్తోమ కల్పకముగా పొగడబడినాడు. ఈయనకు కొండన, వీరన అను సుతులు బలాఢ్యులుదయించినారు. వీరిలో వీరన వేదశాస్త్ర సంచారుడు, ధార్మికుడును. రెండవవాడగు కొండన శాస్త్రవేది, మహాదాత. ఈతడు పెందోటయి నుండి ప్రభుడై వెలిగినట్లు దిగువపద్య పాదములు వెల్లడి చేయుచున్నవి.

"ఎవ్వా పట్టణంబును మీటగల కోట
పెందోటయైనాడు పేరుగాంచె
రసికుడీపూరి కొండనార్య ప్రభుండు"

ఈ కొండనను గూర్చి విశ్వకర్మ పురాణమున గొప్పగా వర్ణింపబడినది. కొండనార్యునకు గలిగిన పుత్ర చతుష్టయములో తృతీయుడగు వెంకటాచార్యుడు గాయత్రీ పీఠపాలకుడై దిగ్విజయము చేసినట్లు వర్ణింపబడినది.

"సీ. చెలగి చూచె కళింగ కురునాట కరహాట
భోజ కర్ణాటక భూములందు,
తూర్పెత్తి చూచె సింధుర వత్స ఘూర్జర
శకయు గంధర రాజ్య సమితి యందు,
జల్లించి చూచె మత్స్య విరాట కాశ్మీర
సౌరాష్ట్ర మగధ దేశములయందు,
గాలించి చూచెఁ గొంకణ చోళ మాళవ
గౌళ నేపాళ చక్రములయందుఁ

గీ. దనకు మాఱుద్ది లేమి తత్త్వ ప్రసంగ
మార్గతార్కిక వైదికామ్నాయ శాస్త్ర
కావ్య దీక్షా సమర్థ సంగతుల మేరు
ధైర్యుడీపూరి వేంకటాచార్యుఁడెందు."

దీనిని బట్టి యీతని వేదశాస్త్ర పాండిత్య మపారమనియు, కావ్య నాటక ప్రజ్ఞలోగూడ నీతడు మిన్నయనియు, ఇంచుమించు భారతదేశము నందంతటను సంచారము చేసి పండితుల నోడించి జయ పత్రికలనంది నాడనియు తెలియుచున్నది. ఇందతిశయోక్తి ఉండనక్కరలేదు. వీరందఱు గాయత్రీ పీఠాధిపతులు గావున కవులుగాను, పండితులుగాను, వేదశాస్త్ర విధులుగాను, శిల్పవేత్తలుగాను ఉన్నారనుటలో సందియ మక్కరలేదు. ఈ వేంకటాచార్యునకును అన్నపూర్ణాంబకును కలిగిన పుత్రుడే విశ్వకర్మ పురాణ కర్త యగు వేంకటాచార్యుడు. ఇతని గొప్పదనమునకు నీయన విశ్వకర్మ పురాణమే తార్కాణ గదా!

ఈ విశ్వకర్మ పురాణము పాటూరును పాలించిన విశ్వబ్రాహ్మణ రాజులగు పాటూరి బోడన్న కొండనార్యులు శ్రోతలుగా రచింపబడినట్టిది. ఈ పాటూరి ప్రభువుల చరిత్రము గూడ విశ్వకర్మ పురాణమున గ్రంథకర్తచే పూర్వము ఆశ్వాసములనుండి సవిస్తరముగా వర్ణింపబడినది. వేంకటాచార్య కవి తన్ను గూర్చి క్రింది విధముగా వ్రాసికొన్నాడు. ఈ కవికి స్వప్నములో నగరాడి తన్ను కావ్యరచనకు ప్రేరేచిన వేంకట శైలనాథుడు తన్నీరీతి నాదరించి నాడట -

"సీ. అలరంగ భవభూతి యర్థ గౌరవమును
గాళిదాసు నియలంకార మహిమ,
మురదమెప్ప నలదండి పద లలితత్వంబు
ముక్కు తిమ్మన కలియుద్దు పలుకు,
ధర నల్లసాని పెద్దన్న యల్లిక బిగు
వెన్న బరాత భువన్న సొంపు,
నల రుద్రునుకవి శబ్దాడంబరంబు, పొం
దూరి తెగస చమత్కార రచన,

గీ. యెలమి నా పాండు రంగ కవీంద్రు మురువు
తనరు ధూర్జటి జాతి వార్తా ప్రశంస
నీక కలవెంచి చూడ నన్నియును గూడ
విలసి తౌదార్య వీపూరి వేంకటార్య!"

దీనిని బట్టి యీతడు సంస్కృత కవులతోబాటు, కృష్ణరాయలయుగపు కవీశ్వరుల రచనలనన్నింటిని చదివినాడని తెలియుచున్నది. ఈకవి తాను పేర్కొన్న వారి రచనా మార్గములనన్నింటిని అనుసరించి తన కావ్యమును సుందర తరము చేసికొన్నాడు. ఆముక్తమాల్యదా వసుచరిత్రములలోని పద్యములవంటి పద్యము లిందెన్నియో కలవు. ఆముక్తమాల్యదలోవలె ఇందును సువర్ణ స్తోత్రమును, హనుమత్ స్తోత్రమును చేయబడినవి. ఇట్లీతని కవితలో అయా పూర్వ కవుల కవితా రీతులు గోచరించుటచే నీతని కావ్యము 16వ శతాబ్దము చివర రచితమైనట్లు తోచుచున్నది. లేదా 17వ శతాబ్ది తొలిదశక మందైనం గావచ్చును.

ప్రౌఢదేవరాయల కొలువులో ధర్మాధికారిగాను, విద్యాధికారిగాను ఉన్న సుమ్మనకు విశ్వకర్మ పురాణకర్త అయిదవతరము వాడయినందున అతడు 16వ శతకాంతమున నుండుటలో అనుపపత్తియుండదు. ఈ వేంకటాచార్యుడు తన కావ్యమున అశ్వాసాంత గద్యములలో ఇట్లు చెప్పికొనినాడు.

"ఇది శ్రీమద్విశ్వకర్మ వంశ పయః పారావార సుధాకర భువన గోత్ర పవిత్రాచార్య జనస్తోత్ర పాత్ర వేంకటాచార్యాన్న పూర్ణాంబికా పుత్ర శ్రీమచ్చెన్న కేశవపద పద్మ కవితా నిరాతంక వీపూరి శాసనాంక వేంకటాచార్య ప్రణీతంబయిన విశ్వకర్మ పురాణంబు........"

ఈ విశ్వకర్మ పురాణావతారిక అనేక చరిత్రాంశములకు నిలయముగానున్నది. దీనిని ఆధారము చేసికొని శోధింపవలసిన అంశము లెన్నియో కలవు. ఈ కావ్యమున పది అశ్వాసములలో విశ్వకర్మ మహిమాభివర్ణనము చేయబడినది. ఈ కావ్యము ఏనాడో ముద్రితమయి ప్రతులు దొరక కున్నందున మరల ముద్రణము కావలసిన అవసరమెంతేని కలదు.

## కొమ్మూరు సోమనాథకవి

ఈయన కీ॥ శే॥ శ్రీ కొమ్మూరు సంగమేశ్వర కవిగారి పూర్వ పురుషుడు. విచిత్ర రామాయణమను పేర రామచరితమును వ్రాసినాడు. దానిని కీ. శే. వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు (దుగ్గిరాల) తమ ప్రబోధినీ పత్రికలో "ప్రాచీన విచిత్ర రామాయణము" అనుపేర కొంతకాలము పాటు ప్రకటించినారు. తరువాత అది గ్రంథ రూపమున ముద్రితమైనట్లు విన్నాను గాని, నాకా ప్రతి చిక్కలేదు. ఈ కావ్యము కూడ ప్రబంధ ధోరణిలో వ్రాయబడి సహృదయుల మనస్సుల నలరించునదే!

## గద్దె చంద్రశేఖరకవి

ఈతని కావ్యము "ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర" ఇది ద్విపద కావ్యము. ఈ కవిగారి దేశకాలములు తెలియలేదు. ఇతడు మహావీర శైవుడు. సానగ గోత్ర పవిత్రుడు. గద్దె వీరభద్రా చార్యుని కుమారుడు. "సాహిత్య రసపోషణు" డని బిరుదము నందిన వాగ్దేవీకటాక్ష సంపన్నుడు. ఈ చంద్రశేఖర కవి తన కావ్యమును చెంగల్వరాయని (కుమారస్వామి) కి అంకితము చేసి నానని చెప్పుచున్నాడు. ఈ విషయములు గ్రంథాంత మందలి ద్విపదయున స్పష్టమగు చున్నవి.

"అని యిది దివిజసేనాధిపు పేర
దహుఖత్రాత్రవ గోత్ర దంభోళి పేర
రామణీ యౌదార్యత సద్గుణాభి
రాముడు చెంగల్వ రాయని పేర
నంకితంబుగఁ గాళహస్తీశ చరణ
పంకజ సౌరభ భ్రమ రాయమాణ
వీరశైవాచార విశ్రుత గద్దె
వీరభద్రాచార్య విభు తనూజాత
ధీ జనస్తోత్ర వాగ్దేవీ కటాక్ష
రాజిత సాహిత్య రస పోషణాంక
సావధానానేక శాస్త్ర విజ్ఞాన
కోవిద సానగగోత్రాబ్ధి చంద్ర
చంద్రశేఖర కవీశ్వర కృతంబగుచు
సాంద్రానుమోద పరిశస్తమై మిగుల
జగతినుత్తర హరిశ్చంద్ర చరిత్ర
తగనొప్పు నాచంద్ర తారార్కముగను."

ఈ ద్విపదయున ఈకవి సాహిత్యరస పోషణాంకుడేగాక, అనేక శాస్త్ర విజ్ఞానము కలవాడనియు తెలియుచున్నది. ఈ గ్రంథ మున కృత్యవతరణిక మాత్రము లేదు. కావ్య మీ విధముగా ఆరంభమగుచున్నది.

"శ్రీకంఠు కృపచేత చెలువముబొంది
ప్రకట రాజ్యంబు పాలించె ననుచు
పూర్వ హరిశ్చంద్ర పుణ్య చరిత్ర
సర్వంబు విని మహాశ్చర్యంబు నొంది
అచల ధైర్యము పొందవాగ్రజుడంత
నుచిత మార్గంబున నూహించితాను
మ్రొక్కి మార్కండేయ మునికిట్లు పలికె
ముక్కంటి యెదుర నిమ్ముల హరిశ్చంద్ర
నరనాథునకు గాధినందనుడవని
కర మరుదారంగ కర్గిందున నిచ్చి
దేవత లెఱుగంగఁ దీవులాయొకటి
యే విధంబుగఁ బూని యేలించెననిన
కౌంతేయుఁ జూచి మార్కండేయ మౌని
యెంతయు ముదమంది యిట్లనిపలికె"

బహుశః ఆరంభమున కొంత శిథిలమైనదో యేమో ! ఈ కావ్యము 136 పుటలపై వ్రాయబడియున్నది. 2050 పాదము లున్నవి. ప్రతిపత్రము పురుగులచే తినబడియున్నది. ఇంక కొంత కాలమునకు శిథిలమై పోవచ్చునని తోచుచున్నది. 1950లో నేను మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో దీనిని చూచినాను.

ఈ కావ్యములో చంద్రమతి జన్మ వృత్తాంతము, ఆమెను మయబ్రహ్మ పెంచి హరిశ్చంద్రునకిచ్చి పెండ్లి చేయుట, హరి శ్చంద్రాదుల పూర్వజన్మ వృత్తాంతము, మొదలగు క్రొత్త యంశము లగపడినవి. కథ అత్యద్భుతావహముగా నున్నది. కవి, తన గ్రంథమునకు మూలమేదో పేర్కొనలేదు. పురాణ ధోరణిలో నడిచిన యీ కావ్యము ఉత్తమ సాహిత్య గుణములతో నొప్పు చున్నది. బాణాల శంభుదాసుని సారంగధరతో తులదూగుచు ఆంధ్ర సాహిత్యములో మధ్యమ శ్రేణికి చేరవలసిన కావ్యముగా నున్నది. అస్ఖలమగు ధార, మధురశైలి, లలితమగు భాష కావ్య గుణము నినుమడింప జేయుచున్నవి.

## కిన్నెర చంద్రశేఖరకవి

ఈ కవీశ్వరుడు కంచర్ల అయ్యాగారి పుత్రుడు. ఇతడు భాను కల్యాణమను పేర సంజ్ఞా సూర్యుల వివాహకథను ద్విపదగా వ్రాసియున్నాడు. ఈ కావ్యము కూడ సమగ్రముగానే యున్నది. వ్రాత మాత్ర మంత బాగుగాలేదు. తప్పులుకూడ నెక్కువగానే యున్నవి. శైథిల్యములు, గ్రంథపాతములు కలవు. ఈ కవి విశ్వబ్రాహ్మ వంశ్యుడు. కిన్నెర బ్రహ్మయ్య వంశములో పుట్టిన వాడు. ప్రమథయాచార్యుని పౌత్రుడు. కంచర్లయ్య వారిపుత్రుడు. సువర్ణ ఋషి గోత్రోద్భవుడు. ఇతడు తన భానుకల్యాణమును పురాంతకునికే అంకితమిచ్చి, తన శివ తాత్పర్యమును వెల్లడించు కొన్నాడు. ఈ కావ్యమునుగూడ మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథా లయముననే చూచుటయైనది. ప్రార్థనానంతరము కవి.

"వినరయ్య భూలోక విబుధేంద్రులార,
ఘన విరాట్ప్రభు విశ్వకర్మాన్వయమునఁ
బరగు కిన్నెర బ్రహ్మవంశ జాతుండు

గురుడు సువర్ణసగోత్ర పాత్రుండు
వేదశాస్త్ర పురాణ విషయ కోవిదుడు
ప్రోది మహారాజ పూజ్యచర్యుండు
గురు శిఖామణి నామ గుణ గరిష్ఠుండు
వరుస కంచర్లయ్యవారి పుత్రుండు
చంద్రద్యుతి స్ఫార సత్కీర్తి పరుడు
చంద్రశేఖర కవీశ్వర నామ ఘనుడు
భాసురంబుగ ముద్దు పల్కులఁ గూర్చి
భానుకల్యాణ మేర్పరచి మోదమున
ద్విపద కావ్యంబుగా ధీనిధుల్ మెచ్చ
నిపుణత్వముగఁ జేయు నిశ్చయంబుగను
అంకితంబుగఁ ద్రిపురారాతి చరణ
పంకేజములనతి భక్తి నర్పించి."

అని చెప్పుట చేత ఈ కవి మహోన్నతమగు సద్గురు పరంపరలోని వాడుగా నగపడుచున్నాడు. ఔను కిన్నెర బ్రహ్మయ్య శైవ సంప్రదాయములో మహనీయుడని పాల్కురికి సోమనాథుని బసవపురాణము చెప్పుచున్నది. తాదృశ వంశ పరంపరాగత గురుత్వము ఈయనది. అందుకే "గురు శిఖామణి"నని చెప్పికొనినాడు. కావ్యమును ముగించు సందర్భమునగూడ కవి -

"అని పురాంతకు పేర నభవుని పేర
ప్రణుతింప విశ్వ సుబ్రహ్మణ్య పేర
పురణితుగా విరాట్పురుషుని పేర
ఘనత గాంచిన విశ్వకర్మాన్వయమునఁ
బరగిన కిన్నెర బ్రహ్మ వంశజుడు
గురుడు సువర్ణ సగోత్రపాత్రుండు
సరస సాహిత్య లక్షణ కవీంద్రుండు
సరసుడా ప్రమథ యాచార్య పౌత్రుండు
చంద్రశేఖర కవీశ్వర నాముడగుచు
ఘన తరంబుగ భాను కల్యాణ చరిత
ననువొంద ద్విపద కావ్యంబుగా జేసి."

అని తన వంశము యొక్క గొప్పదనమును చెప్పికొన్నాడు. కిన్నెర బ్రహ్మయ్య మహనీయ చరిత్రుడు. శైవ శిఖామణి. ఈయనను గూర్చి కర్ణాటాంధ్రముల పెక్కు కథలు ప్రచారములో నున్నవి. గద్దె చంద్రశేఖరకవి దేశకాలములవలె ఈ కిన్నెర చంద్రశేఖరకవి దేశకాలములును తెలియబడలేదు. పరిశోధనార్హములుగానున్నవి. ఈ చంద్రశేఖరకవిద్వయము సమధికమగు వంశ గౌరవము కలవారు. కావుననే తమ పూర్వులగు మయబ్రహ్మ, సంజ్ఞా సూర్యులు అను వారి దివ్య చరిత్రలుగల కావ్యములను వ్రాసినారు.

ఈ విధముగా ఆయా ప్రాచ్యలిఖిత పుస్తకాలయములను వెదకినచో విశ్వబ్రాహ్మణకవులును, వారికావ్యములును అనేకము గోచరించునని తోచుచున్నది. ఇంకను నా యెఱింగిన మఱికొందఱు విశ్వబ్రాహ్మణ కవులను గూర్చి మఱొకసారి ప్రస్తావింపగలను.



శ్రీ రేకళిగెమఠం వీరయ్య

# బసవని కుటుంబ వ్యక్తులు కౌటుంబిక జీవన విశేషములు

అర్జునవాడ శాసనము దొరికిన తదుపరి వచనములను వ్రాసిన బసవన్న సంగమ-బసవన్న యనియు, బసవని జన్మభూమి హింగుళేశ్వర బాగెవాడియనియు, అతని తల్లిదండ్రులు మాదలాంబిక మాదరసులనియు, పురాణ సాహిత్యమునకును, శాసనాధారములకును అంగీకారము కుదిరినది. కాని పురాణ సాహిత్యమునందు బసవన్నకులేని అన్న యొకడు ఆ శాసనమువలన బయలుదేరి, పురాణ సాహిత్యమునకును, శాసనాధారమునకును సమన్వయము కుదురని యొక్క క్రొత్త సమస్య యెదురయ్యెను. అందుకు కారణము ఆ శాసనమును పరిశోధించిన పండితులు, విమర్శకులు ఆ శాసనము నందు చెదరిన అక్షరములను పూరించుటయందు దాదాపు అందరును ఒకే విధముగా పొరపాటు చేయుటయే! మిత్రులు డా. బాదాల రామయ్యగారు, అందలి చెదరిన అక్షరములను సముచిత రీతియందు పూరించి, చదివి, ఆ శాసనము నందును బసవన్నకు అన్నలేడనునది రుజువుచేసి, ఆ విషయము నందును, పురాణ సాహిత్యమునకును శాసనాధారములకును, సమన్వయము కుదురునట్లు చేసిరి. ఈ దిశ యందు రామయ్యగారి సూక్ష్మజ్ఞానము, సాహిత్య ప్రజ్ఞ పొగడ దగినదే.

బసవని కుటుంబ వ్యక్తులలో, అతని ఇద్దరు భార్యలు అతని అక్క- మువ్వురి గురించి భేదాభిప్రాయములులేవు. బసవనికి యిద్దరు భార్యలను విషయమునందు సోమనాథుడు, హరిహరుడు ఏకాభిప్రాయులుగారు. సోమనాథుడు బలదేవుని కుమార్తె గంగాంబిక విషయము మాత్రము తెలిపెను. రెండవ భార్యవిషయమే తెలుపలేదు. హరిహరుడు బసవనికి ఇద్దరు భార్యలని తెలిపినను, ఒకరిపేరు గంగాంబిక యనియు, మరొకరి పేరు మాయాదేవి యనియు తెలిపెను. తర్వాత జరిగిన సన్నివేశముల వలన హరిహరుడు తెలిపిన మాయాదేవియే నీలాంబిక యని తెలియవచ్చినది. స్వయముగా బసవన్నయే, తన రెండవ భార్యపేరు నీలలోచన, (నీలాంబిక) యని తెలిపెను. అక్క- నాగమ్మ గురించి భేదాభిప్రాయములేదు. అటులనే అక్క- నాగమ్మ కొడుకు (బసవని మేనల్లుడు) చెన్న బసవన్న గురించియు కూడ భేదాభిప్రాయములు లేవు. కాని అక్క- నాగమ్మ భర్త శివస్వామి గురించి భేదాభిప్రాయములు గలవు. ఈ విషయమునందు మిత్రులు రామయ్యగారి పరిశోధన కొంత పెడదారిని బట్టినటులు తెలియుచున్నది. ఈ విషయమునందు శ్రీ రామయ్యగారు "బసవేశ్వరుని వచనాలు"- సమగ్ర సమీక్షయందు తెలిపిన వివరములను రెండు భాగములుగా విభజించవచ్చును. ఒకటి "బసవని కౌటింబిక జీవన విశేషములు", రెండవది "చెన్న బసవని జనన వివరములు". ఈ రెండు సమస్యలు ఒకదానిపై నొకటి ఆధారపడినటులు తోచినను, వేరువేరుగా విభజించి వివేచించుట సముచితమనిపించినది. మొదట బసవని కౌటింబిక జీవన విశేషములను తెలుసుకొని, తర్వాత చెన్నబసవని జనన వివరముల గూర్చి తెలుసు కొనవచ్చును.

బసవని కౌటింబిక జీవన విషయములందు, అక్క- నాగమ్మ మొదటి నుండియు, తన కొడుకు చెన్నబసవన్నతో బసవని ఇంటి యందుండుట వలన, కసరింపులు, విసిగింపులు నెదుర్కొనవలసి వచ్చినటులును, ఇది లోకసహజమేననియు, శ్రీ రామయ్యగారు తమ తీర్పును చెలుపుచు నొక విషయమును వ్యక్తపరిచియున్నారు. అటులనే చెన్నబసవన్నకు బసవని యింటియందే అనాదరము, అగౌరవము కలిగినటులు కూడా వారు తెలిపియున్నారు.

అక్క- నాగమ్మ బసవని కుటుంబ వ్యక్తులలో నెల్ల వయసు నందును, అనుభవమునందును పెద్దది. బసవన్న తనకు తండ్రిచేయ దలచిన ఉపనయనమును నిరాకరించి ప్రతిఘటించి యిల్లువిడిచి వెడలిపోయిన నాటి నుండి, మరల బసవన్న కల్యాణమును విడిచి కప్పడిసంగమక్షేత్రమునకు పోవువరకు అతనికి తోడునీడయై తల్లికి మారు తల్లియై సంరక్షించినది, బసవని భవ్య వ్యక్తిత్వమునకు అక్క- నాగమ్మ పోషకత్వము కూడా కారణమనునది నిరాకరించ లేని విషయము. రామయ్యగారు అంగీకరించకున్నను, అక్క-

నాగమ్మ శివస్వాముల దాంపత్య జీవన విషయము చెన్నబసవన్న వారి ఔరసపుత్రుండను విషయములను, సింగిరాజు వివరముగా తెలిపి యున్నారు. శివస్వామికి అక్క నాగమ్మకు అంతగా పొత్తు కుదిరినట్లు లేకుండెనని కూడా సింగిరాజు తెలిపినాడు. దాని రామయ్యగారే వ్రాసినారు. బాగెవాడి నుండి బసవన్న వెడలిన నాటి నుండియు, అతని వెంబడి నీడవలెనున్న అక్క నాగమ్మ, బసవన్న కల్యాణమునందు వున్నప్పుడు, విడిది వేరుగా వుండుట ఆమె కెట్లు సాధ్యమగును. అందులో అక్క నాగమ్మ శివస్వాముల పొత్తు కుదరక, దాంపత్యజీవనము అనుకూలముగా సాగకుండుటవలననో, లేక ఆమధ్య శివస్వామి శివసాయుజ్యము నొంది నందువలననో (ఈ కారణములలో ఏకారణమువలననో) అక్క నాగమ్మతనతమ్ముని వద్ద నుండడము స్వాభావికముగాదా? తన పోషకత్వము నందున్న తమ్ముని లోకప్రసిద్ధియై ఊర్జిత స్థితియందుండగా, విడిచియుండుట అక్క నాగమ్మకు సాధ్యమా? బసవన్న ఈ పరిస్థితులయందు ఆమెను వొంటరిగా వుండనిచ్చునా ? సర్వజీవ దయాపరత్వమును బోధించుచు ఆచరించుచున్న బసవన్న తన భవ్య జీవనమునకు కారణభూతురాలైన అక్కయెడల ఇంతటి కఠినత్వమును జూపునా? అట్లుచేయుట బసవన్న స్వభావమునకు సరిపోవునా? ఐనను, బసవని భార్యలు నాగమ్మను, నాగమ్మ కొడుకు చెన్న బసవన్నను చులకనగా జూచుటకు, ఆమె తనకొడుకుతో కలకాలము బసవని యింటియందుండుటయే కారణమని రామయ్యగారి వాదము.

బసవని భార్యలసత్యస్వభావమును నైతిక మానసమును వారు మొదటి నుంచి పెంపొందిన పరిస్థితులను, ముఖ్యముగా బసవని మహామందిరము నందలి ధార్మిక ఆచరణలు, తాత్విక జ్ఞానోదయము, దాసోహ కార్యక్రమము లను కొంత వివరముగా పరిశీలనతో రామయ్యగారు ఆలోచించియుండిన, అట్టి అపవాదములను వారు బసవని భార్యలపై మోపకుండిరని నాకు తోచుచున్నది. ఈ విషయమునందు వారు కొంత తొందరపాటు చెందినారని నా కనిపించు చున్నది. అక్క నాగమ్మ బసవని రెండు వివాహముల కన్న మొదటి నుండియే బసవన్న యింటి యందు యింటి పెద్ద వలె నుండుట వలననూ, బసవని రెండు వివాహముల సమయములందు ఆమెయే పెండ్లి పెద్దల కర్తవ్యములను జేయుటవలనను, వారు ఆమెను చులకనగజూచిరనుట సబబుగానుండదు. గంగాంబిక, నాగమ్మకు కూడ మేనమామ కూతురేగదా! సోమనాథుని ప్రకారము బలదేవుడు బసవన్నను, అక్క నాగమ్మను తన భవనమునకు తోడ్కొని పోయి తన ఇంట కొన్ని రోజులుంచుకొని తర్వాత బసవన్న గంగాంబికలకు వివాహమొనరించి నటులుతెలియుచున్నది. ఆ అవధి యందు అందరు కలసి మెలసి యుండిరేగాక, సింగిరాజు ప్రకారము ముగ్గురును కప్పడిసంగమ క్షేత్రము నందున్నటులు తెలియుచున్నది. ఇంత దీర్ఘకాలము వారు కలిసి మెలిసి యుండియు కోనకు గంగాంబిక అక్క నాగమ్మను గాని ఆమె కొడుకును గాని చులకనగా జూచినదనుట నమ్మరాని సంగతి. అంతే గాక, తన కొడుకు చిన్నతనమునందే శివసాయుజ్యము నొంది నందున గంగాంబిక చెన్నబసవన్నను తన చన్ను గుడుతువు రమ్మని పిలిచి నటులు ఆమె వచనమువలననే తెలియుచున్నది. ఈ సంగతిని రామయ్యగారు కూడా తన 'సమగ్ర సమీక్ష' యందు తెలిపి యున్నారు. తన కొడుకు పోయిన తర్వాత చెన్నబసవన్నను పుత్ర ప్రేమతో జూచి, తన పుత్రశోకమును మరచిన నిర్లిప్త మనీషి ఆమె: తన భర్తకు అన్ని విధముల సహకరించుచు, "చిక్క దండనాయకుం"డని, ప్రసిద్ధిజెందిన, చెన్నబసవన్నను గాని, తనను తన భర్తను చిన్ననాటి నుండి తల్లివలె పోషించిన అక్క నాగమ్మను గాని, ఆమె చులకనగా జూచినదనుట అసంభవము, నమ్మరాని సత్యము.

ఇక నీలాంబిక విషయమునందు కూడ అట్లు తలంచుట నమ్మరాని సంగతియే యగును. సింగిరాజు ప్రకారమే బలదేవదండనాయకుడు, సిద్ధరసు మంత్రి ఇద్దరును సోదరులే, ఆ ప్రకారముగా నీలాంబిక కూడా అక్క నాగమ్మకు మేనమామ కూతురే! అది గాక సిద్ధరసు నీలాంబిక వివాహమున కన్న చాలా మొదలే బసవని అంకెగణిత ప్రజ్ఞకుమెచ్చి రాజు ఆస్థానమునందు ఉద్యోగమిప్పించి, బసవని, అతని భార్య గంగాంబికను, అక్క నాగమ్మను తనఇంట నుంచుకొనెను. అతడు తన అవసాన కాలమందు నీలాంబికను బసవని కిచ్చి వివాహము జేయుమని రాజునకు విన్నవించెను. అంతేగాక, తనకు పురుష సంతానము లేనందున తన ఆస్తిని, రాజోద్యోగమును కూడ బసవనికిమ్మని, సిద్ధరసు ప్రభువుకు విజ్ఞాపించినది కూడ చారిత్రిక సత్యము. వారందరు ఎంతో ప్రేమాను రాగములతో నుండిన సిద్ధరసు, ఆ కోర్కెను ప్రభువునకు విన్న వించి యుండును, ఆలోచింపవలసిన విషయము. అట్లు పరస్పర ప్రేమానురాగములతో నున్న నీలాంబిక, కుటుంబమందలి పెద్ద వ్యక్తియగు అక్కనాగమ్మను, తన భర్త ఉన్నత స్థితికి కారణ భూతురాలైన అక్క నాగమ్మను, చులకనగా జూచుట, కసరుపులు, విసిగింపులు జేయుట జరిగియుండునని, శ్రీ రామయ్యగారి ఆలోచన కెటులు వచ్చినదో ఊహాతీతము. కనీసము నీలాంబిక క్రింది వచనము నందలి భావమునైనా రామయ్యగారు గ్రహించి యుండిన, వారట్లు వ్రాయకుండిరేమోనని నాకు తోచుచున్నది. నీలమ్మకు,

అక్క నాగమ్మ ఎడల యెంత భక్తిశ్రద్ధలుండినవనునది తెలుసుకొనుటకు ఆమె ఈ క్రింది వచనమే సాక్షి:-

"నాకు క్షీరాన్నమును బెట్టిన తల్లీ
నాకు పరిణామమును జూపిన తల్లీ
పరమ సుఖమందున్న తల్లీ
పరవస్తువును నమ్మిన తల్లీ
బసవని గురుమాతే!
సంగయ్యయందు స్వయం లింగమైతివా.
అక్క నాగమ్మ తల్లీ!     (నీ. వ. స. 123)

ఇక చెన్న బసవన్న యెడల ఆమెకు అమితమగు భక్తి గౌరవము లుండెననుటకు ఆమె ఈ క్రింది వచనములే సాక్షి.

"చెన్న బసవన్ననే లింగమని భావించినందున
నాకు చెన్న బసవయ్య లింగమయ్యెను" (నీ. వ. స. 124)

"అడవియందు కన్ను బోయిన
పశువువలె ప్రలాపించు చుంటివయ్యా
కడు దుఃఖముచే బడలు చుండగ
శరణుడు చెన్నబసవయ్య దాని నెఱింగి
'శివశివా' యను మంత్రమును దెలిపి
దుఃఖపు బడలికను తప్పించెనయ్యా
సంగయయందు చెన్నబసవన్నకు
నమోనమో యనుచుండును."     (నీ. వ. స. 12!)

పై రెండు వచనములందు చెన్నబసవన్న తనకు లింగ స్వరూపుండనియు, మంత్రోపదేశము జేసిన పరమగురువనియు, నీలాంబిక తన భక్తి కానుక నర్పించుటయేగాక, అతని అనుగ్రహమువలన తాను శివజ్ఞానమును బొందితినని అతనిని స్తుతించి కీర్తించినది. అట్టి మహాసాధ్వి, చెన్నబసవన్నను చులకనగా జూచి యుండుననీ, శ్రీ రామయగారు వేసిన అంచనా కెంత విలువ యుండునో ప్రాజ్ఞులు తెలుసు కొనవలసిన విషయము.

నీలాంబిక మహామాత, ఆమె పతిభక్తి ఎల్లలు మీరినది. పతి యాజ్ఞను మీరక తన యంగముపైనున్న నగలను తీసి దొంగలకు ఇచ్చిన త్యాగమూర్తి. అంతేగాక పతియాజ్ఞను శిరసావహించి జంగమమూర్తికి తన అంగ సుఖము నివ్వసిద్ధమైన పరిశుద్ధాత్మగల మహాత్యాగి, మహాయోగి, అట్టి మహామాత అక్క నాగమ్మనుగాని, చెన్నబసవన్నునుగాని చులకనగా జూచి యుండునని రామయగారెట్లూహించగలిగిరో తెలియదు.

బసవని మహామందిరము నందు దొంగిలించుటకని వచ్చిన దొంగలు అచ్చటి పవిత్ర, పరిశుద్ధ వాతావరణమును, ధార్మిక పద్ధతులను, తత్త్వజ్ఞాన చర్చలను జూచితిని. తమ నికృష్ట వృత్తిని మాని శరణతత్త్వము నంగీకరించి, శరణుల గుంపులో చేరినట్లు ఐతిహ్యములు గలవు. స్వయముగా బసవన్నను హత్య జేయదలచి వచ్చిన చిక్కయ్యయను ధూర్తుడు మందిరమందు ప్రవేశించి, బసవని వ్యక్తిత్వమును జూచి, తాను జేయదలచినది అతిఘోరపాతకమని తలంచి, బసవని శరణుజొచ్చి, అనుగ్రహమును బొంది శరణుల సంగమందుండి, నిజలింగ చిక్కయ్యయనునొక గొప్ప శరణుండై ప్రసిద్ధిగాంచినములు అతని చరిత్ర తెలుపు చున్నది. అట్టిచో స్వయముగా బసవని భార్యలు రేయింబవళ్ళు ఆ వాతావరణమున మెదలు చుండియు అట్టి అసభ్యరీతియందు ప్రవర్తించి రనుటలో సత్యాంశమెంతయుండునో రామయ్యగారే ఊహించవలసిన విషయము.

ఇక చెన్నబసవన్నకు బసవన్న ఇంటియందే బసవని పడతి(?) పంక్తిభేద మొనర్చి అగౌరవము, అనాదరము చేసిననను రామయ్యగారి మాట కూడ అంతుపొంతు లేని మాటయని రామయగారు ఉటంకించిన భక్తిస్థలమందలి బసవని (౪౩౯) వచనము వలననే తెలియుచున్నది. దాని కన్నడ మూలము ఇది -

"హరగణ పంక్తియనడువె కుళ్ళిద్దు
నాను ఒడెయ తనద నాయ తేజన హోత్తు కొండు
మడది యెన్నగళ దొళగె సకలదేవాన్నవ
ఒడయరిందలు మిగిలాగిక్కలు తెగిదిరిసెదను.
ఈ పరియలి ఆయకళ్ళే తోరలు కల్మష వాదువు
కరుణి చెన్నబసవణ్ణన సమరెదు కొండె నాదడె
ఒడెయ కూడల సంగయ్య కెడహి నరకక్కిక్కువ."
(బ.వ.స. 439)

"హరగణముల పంక్తియందు బసవన కూర్చుండి యుండగా, ఒడయలకన్న (అనగా ఆ పంక్తియందున్న శరణులందరికన్న) బసవని కంచమునందు పడతి (?) దేవాన్నమును ఎక్కువగా వడ్డించి, పంక్తి చేసినది, చూచి సహించక బసవన్న ఆ అన్నమును ప్రక్కకు త్రోసెను. అంత ఆ అన్నము విషమయ్యెను. కరుణాళువు. చెన్నబసవన్నునువిడిచి ఆ అన్నమును నేను భుజించిన ఒడయడు కూడల సంగమదేవుడు నరకమందుంచును" అని పై వచనమునకు తాత్పర్యమగునని, నాకు తోచుచున్నది. ఈ వచనమునందు పడతి (?) పంక్తిభేదము చేసినట్లు అర్థమగుచున్నది నిజమే. కాని ఆ పంక్తిభేదము ఎవ్వరెవ్వరి మధ్య జరిగినదను విషయము ముఖ్యము. వచనమునందు జెప్పబడిన పంక్తి

భేదము, పంక్తియందున్న వారందరికీ సంబంధించినదనియు, ఆ పంక్తిభేదము బసవన్న-చెన్నబసవన్నలకు మాత్రము సంబంధించినది కాదనియు కన్నడ భాషను తెలిసిన వారందరు అంగీకరింతురని నా నమ్మకము, కాని శ్రీ రామయ్యగారు ఆ పంక్తిభేదము బసవన్న - చెన్న బసవన్నల మధ్యనే జరిగినట్లు అర్థముజేసి; చెన్నబసవన్నకు బసవన్న ఇంటనే అగౌరవము, అనాదరము జరిగినదని తెలుపు విఫల ప్రయత్నము జేసినట్లు తెలియుచున్నది. ఈ వచనమునందు బసవన్న చెన్నబసవన్నను సాక్షముగా గొనినట్లు తోచుచున్నదిగాని, ఆ పంక్తిభేదము వారిరువురిమధ్య జరిగినదని తెలుపుట వచనకర్త భావముగాదని కన్నడమూల వచనమువలన తెలియుచున్నది.

'మడది' యను శబ్దమును చూచి, ఆ పంక్తిభేదము బసవని భార్యలలో యెవ్వరో ఒకరు చేసి యుందురని రామయ్యగారూహించిరేగాని, అది సత్యదూర మనిపించుచున్నది. బసవని భార్యల స్వభావమును తెలుసుకొనియు, వారి సౌమ్యజ్ఞానము నెరింగియు వారట్టి తప్పును చేసియుందురనునది రామయ్యగారి యూహేగాని, అది సత్యదూరము, నమ్మరాని సంగతి. బసవని భార్యలలో యెవ్వరైనను అట్టి పంక్తిభేద పాతకము చేసియుండినను, బసవన్న ఆ తప్పునంత సులభముగాపోనిచ్చి సహించేవాడు కాడనునది అతని చరిత్ర వలన తెలియుచున్నది. మహామందిరమందు దొంగలువచ్చి తన అంగము పైనుండి నగలను తీయుటను తెలుసుకొని, నలమ్మ 'దొంగ' అని అన్నంత మాత్రమున బసవన అతి ఉగ్రుడై, 'అయ్యో మాయయ్య చెయ్యినీచ్చె! ఆ నగలను తీసిఅతనికియ్యవే ఓసీ, చాండాలీ' అని గద్దించిన న్యాయ నిష్ఠురమూర్తి, పంక్తి భేద పాపకృత్యమును, ఏ భార్యచేసినను, దానికతడెంత కఠిన శిక్షను విధించుచుండెనో, ఊహకు మీరినది!

బసవని గురించి అమోఘముగ వ్రాయుచు, ఉపన్యసించుచున్న శ్రీ రామయ్యగారు, 'మడది' యను శబ్దమును బసవని భార్యల కన్వయింపి చెన్నబసవన్న పేరుండగానే ఆ పంక్తిభేదము అతనికే జరిగినదని భావించి, బసవని యింటనే చెన్నబసవన్నకు అగౌరవము జరిగినదని వ్రాయుట సరియైన పద్ధతి గాదేమోనని తోచుచున్నది. అటులనే అక్క నాగమ్మ బసవని భార్యలవలన కసరింపులు విసిగింపులు నెదుర్కొనవలసివచ్చినదని గూడ రామయ్యగారు వ్రాయుటవలన, బసవని మహామందిరమందలి నిత్య జీవనమునందును, అసఖ్య గృహ-అప్పజనుల నిత్యజీవనము నందునుగల తారతమ్యమును, వ్యత్యాసమును, వారు పరికించనటులు, పరిశీలించనటులు తెలియుచున్నది. తాము చూచుచున్న చుట్టు ప్రక్కల యందలి అసభ్య కుటుంబములందు జరుగు కలహములు, నీచబాహ్యమగు వాగ్యుద్ధము గూడ బసవని మహామందిరమందును జరుగుచుండవచ్చునని తలంచి, అది లోకాచారమని పెద్దమనస్సుతో తప్పులను మన్నించినటులు వారు వ్రాసినందున బసవని ఘనతను, శరణుల పవిత్ర జీవన విశేషములను వారు శకించనటులు తెలియుచున్నది.

బసవని సంస్కరణలను గురించి మానవతా బాధలనుగురించి దాసోహ ప్రవృత్తిని గురించి బ్రహ్మాండముగా చెప్పునట్టి రామయ్యగారు, బసవని కౌటుంబిక జీవనమునందును, శూద్రజనుల నిత్యజీవనమునందును గల తారతమ్యమును విశ్లేషించి చూడక ఒకేదృష్టితో చూచుట దురదృష్టమనవచ్చును.

చెన్నబసవన్న జననవిశేషమునందును శ్రీ రామయ్యగారువ్యక్తపరచిన అభిప్రాయమును, దాని గురించి నా సమాధానమును, మరొక వ్యాసమునందు తెలియపరచ గలను. పాఠక మహాశయులు నా సమాధానములందలి నిజస్థితిని గ్రహించెదరని నా సవినయ విశ్వాసము.

[31వ పేజీతో మొదలయిన తమ వ్యాసానికి ఈ క్రింది శ్లోకాలని చేర్చవలసినదిగా "దైవజ్ఞచిన్తామణి" శ్రీ పిడపర్తి చిన కృష్ణమూర్తిశాస్త్రిగారు, "భాషాప్రవీణ" శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారు కోరారు. వారి వ్యాసం అప్పటికే అచ్చు అయిపోవటంచేత శ్లోకాలని ఇక్కడ వెయ్యవలసి వస్తోంది. —సం.]

కన్యాం గతే సవితరి పితృరాజానుశాసనాత్
తావతీ ప్రేతపురీ శూన్యా యావద్వృశ్చిక దర్శనం
తతో వృశ్చిక మాయాతే నిరాశాః పితరో నృప
పునస్స్వభవనంయాంతి శాపం దత్వానుదారుణం
హంసే (సూర్యే) కన్యాస్థే శాకేనాపి గృహేవసన్
పంచమ్యా ఉత్తరే దద్యా దుభయోర్వంశయోః ఋణమ్

ఈ భవిష్యత్పురాణ వచనము వలన, వృశ్చిక సంక్రమనముతో కూడిన శుద్ధ పాడ్యమినాడే పితృదేవతలు స్వస్వలోకములకు తరలుటకు దారి చూపించవలెయును గావున నవంబరు 15 తారీఖున దీపావళిరోజున సాయంకాలము పితృదేవతలకు దివిటీలు కొట్టి తమ తమ లోకమునకు పంపి శ్రేయస్సును పొందుదురుగాక -

సోదరులు,

పిడపర్తి చిన కృష్ణమూర్తిశాస్త్రి
సుబ్రహ్మణ్యశాస్త్రి

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# కేంద్రకామ్లాలు జీవరహస్య కీలకాలా?

జీవి అనగా ప్రాణి. జీవ మనగా ప్రాణము. ప్రాణ మన చైతన్యము. అనగా చైతన్యము కలది ప్రాణి అని తెలియవచ్చును. ఈ చైతన్యమెక్కడ ఉన్నది? ఆ జీవ రహస్యపు తాలూకు వివరములు ఎందు భద్రపరచపడి ఉన్నవి? ఈ ప్రశ్నలు యిప్పటివి కావు. ఎప్పటివో కూడ నిర్దుష్టముగా తెలియదు. కొన్ని తరాల ముందు వారివి. మనవి. మన తరువాతి తరాల వారివి. అనంతకాల ప్రవాహంతోపాటు సుదూర తీరాలకు పయనించే మానవజాతి (జీవ రాశి అని చెప్పవలె. అయినను ఆలోచన, వివేచన, విచక్షణ - మూడూ ఉన్నవాడు మానవుడే కాబట్టి మానవజాతి అని అంటిని) ఉన్నంతవరకు ఈ ప్రశ్నలు ఉదయిస్తూనే ఉంటాయి. వాటికి సమాధానాలు ఏదో ఒక రూపంలో చర్చింపబడుతునే ఉంటాయి. వేదాలు ఉపనిషత్తులు, బైబిలు, ఖురాన్ - యివన్నీ అందులోని భాగాలే! మతాలు కూడ యీ ప్రశ్నలను విశదపరచుటకే! ఈ భాగంలో ఒకవంతుగా "సైన్స్" కూడా ముందుకొచ్చినది. పరబ్రహ్మ స్వరూపంతో పోల దగ్గ ఒక విశిష్టమైన చైతన్యకారిణి, కణము లోని కేంద్రకంలో (జీవులన్నీ కణముల సముదాయములని శాస్త్ర భావన. కణంలో కేంద్రకం లేదా "న్యూక్లియస్" కీలకమైనది. దాన్ని వదలిపెడితే మిగతా భాగమంతా కణద్రవ్యం ఉంటుంది. దీన్ని "సైటోప్లాజమ్" అని "ప్రోటోప్లాజమ్" అని పిలుస్తూ ఉంటారు) ఉందన్న గొప్పసత్యాన్ని "సైన్స్" వెల్లడించింది. ఆ పదార్థమేమిటి? ఎలా ఉంటుంది? కంటికి కనిపిస్తుందా? కనిపించదా? ఎలా తయారౌతుంది? ఏం చేస్తుంది? ఎంత కాలముంటుంది? — ఈ ప్రశ్నలకు సమాధానాల కోసం వెదుకుదాము. కొంత వరకైనా సంతృప్తిని పొందుదాము.

కణంలో కేంద్రకం మిల్లీమీటరులో వందో వంతుకన్నా తక్కువ పరిమాణంతో ఉంటుంది. ఇందులో చైతన్యకారిణి ఉంటుందని అనుకొంటుంటే ఎంతో ఆశ్చర్యంగా ఉంటుంది. సూక్ష్మంలోనే మోక్షముంటుందన్న వాస్తవాన్ని యిది గుర్తుకు తెస్తుంది. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అన్న పరబ్రహ్మ (అంతరాత్మ కావచ్చు, పరమాత్మ కావచ్చు) స్వరూపంకూడ గుర్తుకొస్తుంది. ఇంతాచేసి ప్రయోగశాలలో ఆ చైతన్య కారిణిని విశ్లేషించి, విడదీస్తే — ఒక గజం పొడవున్న దారంలాగా అది కనబడడం మరింత విచిత్రంగా ఉంటుంది. దీనికి డి.యన్.ఏ. (డీ ఆక్సీరైబో న్యూక్లియర్ ఆసిడ్). అని పేరు పెట్టారు. ఇది కేంద్రకంలో కొంతవరకు ఆమ్ల ధర్మాలతో ఉండడంవల్ల కేంద్రకామ్లంగా పిలవబడింది. ఇది కేంద్రకంలోనే కాకుండా "మైటోఖాండ్రియమ్"లు (వీటిని "పవర్ హౌసస్ ఆఫ్ ది సెల్" అని పిలుస్తారు) "క్లోరోప్లాస్ట్"లు (కిరణజన్య సంయోగక్రియ ద్వారా పిండిపదార్థాలు లేక "కార్బొహైడ్రేట్"ల తయారీకి ఉపకరించే స్థావరాలివి)- యిత్యాది కణాంగాలలో కూడ ఉంటుందని కొన్ని "రిపోర్ట్"లు ఉన్నాయి. ప్రధాన స్థావరం కేంద్రకం కనుక కేంద్రకామ్లంగానే పిలవబడడం ఉచితం. కేంద్రకంలో "క్రోమోజోమ్"లలో ఒక ప్రత్యేక సరళిలో అమరిఉన్న జన్యువుల్లో యీ "డి. ఎన్. ఏ." ఉంటుంది. జన్యువులో (దీన్ని "జీన్" అని పిలుస్తారు) ఉన్నది. డి. ఎన్. ఏ. నే కాబట్టి అది జన్యుపదార్థంగా నిర్దేశించబడింది. అయితే జన్యువుకు జన్యువుకు ఎంతో భేదముంటుంది. ఈ భేదం జన్యుపదార్థంలోని భేదంవల్లనేనని వేరుగా చెప్పనక్కరలేదు. అన్ని జన్యువుల్లోనూ డి. యన్. ఏ. నే ఉన్నప్పుడు మరి యీ తేడా లెందుకొచ్చినట్లని ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకోవాలంటే డి. యన్. ఏ. నిర్మాణాన్ని గురించి పూర్తిగా తెలుసుకొనవలె. డి. యన్. ఏ. ఎలా ఉంటుంది?

డి. యన్. ఏ. దారపోగులాగా ఉంటుందని యింతకు ముందే చెప్పాను. ఆ దారపోగును నిశితంగా పరిశీలిస్తే రెండు పోచలున్నట్లు బోధపడుతుంది. రెండు పొడుగాటి పోచలు అడ్డు కడ్డీల ద్వారా కలపబడినట్లు తెలిసివస్తుంది. అంటే ఒక నిచ్చెన

లాగా కనిపిస్తుందన్నమాట. అయితే యిది నిటారుగా ఉండకుండా మెలికలు తిరిగి ఉంటుందన్నమాట. ఇప్పుడిలా చెప్పడం సులభమే కాని, యిది యిలా ఉంటుందని చెప్పడానికి ముందు శాస్త్రజ్ఞులుపడిన శ్రమ మాత్రం ఎంతో ప్రయాసతో కూడుకొన్నది. అసలు డి. యన్. ఏ. వల్లే "జెనెటిక్ బ్లూ ప్రింట్"లు తయారౌతాయన్న వాస్తవాన్ని కనుక్కోవడమే గగనతరమై పోయింది. క్రీ. శ. 1944 నాటికి కాని డి. యన్. ఏ. జన్యు పదార్థమని నిర్ధారించబడ లేదు. ఆ తరువాత తొమ్మిది సంవత్సరాలకుగాని (క్రీ.శ. 1953లో) ఫ్రాన్సిస్ క్రిక్, జేమ్సువాట్సన్ అనబడే అమెరికన్ శాస్త్రజ్ఞులు డి. యన్. ఏ. అణునిర్మాణాన్ని ప్రతిపాదించలేక పోయినారు. మొత్తానికి ఎలాగైతేనేం డి. యన్. ఏ. అణునిర్మాణాన్ని స్పష్టంగా తెలియజెప్పి నోబెల్ బహుమానాన్ని పొందగలిగారు. వారి ప్రతిపాదన ప్రకారం డి. యన్. ఏ. అణువు మెలికలు తిరిగిన పొడుగాటి నిచ్చెనలాగ ఉంటుంది. నిచ్చెనను సగానికి విరగ్గొడితే రెండు పోచలు తయారౌతాయి. ఒక్కొక్క పోచను "న్యూక్లియోటైడ్ చెయిన్" అని పిలుస్తారు. ఈ "చెయిన్" లేదా గొలుసులో ఏముంటాయి? "న్యూక్లియోటైడ్"లు అనబడే రసాయనిక ప్రమాణాల సంఖ్య జీవినుంచి జీవికి మారవచ్చు. జన్యువునుంచి జన్యువుకు మారవచ్చు. ఈ పూర్వపు వైవిధ్యం లేదా "వేరియేషన్ సాధ్యపడుతుంది. "న్యూక్లియోటైడ్" అంటే ఏమిటి? అందులో ఏముంటాయి? ఒక చక్కెర అణువు, ఒక "పాస్ఫేట్" అణువు, ఒక నత్రజని క్షారము కలిసి ఒక "న్యూక్లియోటైడ్" ఏర్పడుతుంది "పాస్ఫేట్" అణువును తొలగిస్తే "న్యూక్లియోసైడ్" అని పిలుస్తారు. నత్రజని క్షారాలు రెండు రకాలవి ఉంటాయి, "ప్యూరిన్"లని "పిరమిడన్"లని. వీటిలో "అడినిన్"(A), "గ్వయనిన్" (G) అనేవి "ప్యూరిన్"లు. "సైటోసిన్" (C), "థైమీన్" (T), యురాసిల్ (U) అనేవి "పిరమిడన్"లు. ఒక "ప్యూరిన్" ఒక "పిరమిడన్"తో కలుస్తుంది. ఈ కలవడమనేది చాల బలహీనమైన ఉదజని బంధాలద్వారా జరుగుతుంది. అంటే అడినిన్ ఎప్పుడూ థైమీన్‌తోనూ (డి. యన్. ఏ. నుంచి ఏర్పడే ఆర్. యన్. ఏ. అనబడే మరో కేంద్రకామ్లంలో మాత్రం "యురాసిల్"తోనూ) "సైటోసిన్" ఎప్పుడూ "గ్వయనిన్"తోనూ కలుస్తుంది. నత్రజని క్షారం చక్కెర అణువులోని మొదటి కర్బన పరమాణువుతో ఎప్పుడూ సంధించబడి ఉంటుంది. చక్కెరఅణువులోని ఐదవ కర్బన పరమాణువుతో "పాస్ఫేట్" అణువు సంధించబడుతుంది. మూడవ కర్బన పరమాణువు "హైడ్రాక్సిల్" (OH గ్రూప్)తో కలుస్తుంది. ఇదంతా "చెయిన్"లోని మొదటిచక్కెర అణువుకు మాత్రమే వర్తిస్తుంది. రెండవ చక్కెర అణువులోని మూడవ కర్బన పరమాణువు "హైడ్రాక్సిల్" బదులుగా మొదటి చక్కెర అణువుతో సంయోగించబడి ఉన్న "పాస్ఫేట్" అణువుతో బంధాన్ని ఏర్పరచుకొంటుంది. ఇలాగే ఎన్నో 'న్యూక్లియోటైడ్'లు వరుసగా అతికించబడుతాయి. మళ్ళీ చివరగా చక్కెర అణువులోని ఐదవ కర్బన పరమాణువు "హైడ్రాక్సిల్‌తో" సంతృప్తము చెందుతుంది. అంటే "చెయిన్" పూర్తవుతుందన్నమాట.

విషయం క్లిష్టంగా ఉండడంవల్ల సులభంగా అర్థమయ్యేందుకు వీలుగా రేఖాచిత్రాలను పొందుపరుస్తున్నాను.

## 1. డి.యన్.ఏ. అణునిర్మాణము (స్థూలంగా)



## 2. విస్తరించి చూపిన భాగము



### 3. "న్యూక్లియోటైడ్ చెయిన్" నిర్మాణము




(కేవలం నాలుగు నత్రజని క్షారాలున్నట్లు "చెయిన్" ని ఊహించుకొని గీచిన రేఖా చిత్రమిది)

ఎంతో కష్టపడి డి. యన్. ఏ. యిలా ఉంటుందని ఒక నిర్ణయానికి రావడం జరిగింది. ఇందులో ఎందరో మేధావుల కృషి తాలూకు వివరాలున్నాయి. ఎన్నో వాదోపవాదాలు జరిగాయి. చర్చలు, సభలూ జరిగాయి. ఏమైతేనేం, మొత్తాని కందరూ వ్యాట్సన్, క్రిక్‌ల "డబుల్ హెలిక్స్" సిద్ధాంతాన్నే బలపరిచారు. "న్యూక్లియో టైడ్"ల సంఖ్య మారుతూ ఉండడంవల్లనూ, నత్రజని క్షారాల పంపిణిలో భేదం ఉంటూ ఉండడంవల్లనూ, నత్రజని క్షారాల పంపిణిలో భేదం ఉంటూ ఉండడం వల్లనూ వైవిధ్యమే కాదు, "స్పీసియేషన్" (జాతి ప్రత్యేకీ కరణం) కూడ ఏర్పడిందని కొందరు భావిస్తారు. ఈభావన వాస్తవమే అని చెప్పడానికి ముందెనుకాడినా, త్రోసిపుచ్చేందుకు వీలులేదు. కొన్నిప్రాణులలో ఉన్న "న్యూక్లియోటైడ్"ల సంఖ్యనూ, నత్రజని క్షారాల పంపిణీని తెలియబరుస్తాను.

**పట్టిక 1**

| వరుస సంఖ్య | ప్రాణి పేరు | | "న్యూక్లియోటైడ్"ల సంఖ్య (జతలు) |
|---|---|---|---|
| 1. | ఎస్కరిచియా కోలై (బ్యాక్టీరియమ్) | — | $4 \times 10^6$ |
| 2. | నత్త | — | $4.7 \times 10^9$ |
| 3. | కప్ప | | $2.3 \times 10^9$ |
| 4. | కుక్క | | $2.5 \times 10^9$ |
| 5. | మనిషి | | $2.8 \times 0^9$ |

**పట్టిక 2**

| వరుస సంఖ్య | ప్రాణి పేరు | పంపిణీ శాతము | | | |
|---|---|---|---|---|---|
| | | A | T | G | C |
| 1 | మనిషి వీర్యకణం | 31 | 31.5 | 19.1 | 18.4 |
| 2 | కోడి దేహకణం | 28.8 | 29.2 | 20.5 | 21.5 |
| 3 | "ఈస్ట్" కణం | 31.7 | 32.6 | 18.8 | 17.4 |

మనిషి కంటే తక్కువ స్థాయికి చెందిన జంతు వర్గాలలో "న్యూక్లియోటైడ్"ల సంఖ్య ఎక్కువగా ఉండడం ఆశ్చర్యాన్ని కలిగించే అంశం. నత్రజని క్షారాల పంపిణీలో ప్రత్యామ్నాయపు క్షారాల నిష్పత్తి (అంటే A : T, G : C) 1 : 1 ఉండడం గమనించవలసిన విషయం. ఈ అంశాలన్నీ కూడ "డబుల్ హెలిక్స్" సిద్ధాంతాన్నే బలపరుస్తాయి।

అంతా సాఫీగా సాగుతోందనుకొంటున్న తరుణంలో అలెగ్జాండర్ రిచ్ అనే శాస్త్రవేత్త ఒక "సంచలనాన్ని" సృష్టించినాడు. ఇది క్రీ. శ. 1979వ నాటి మాట. డి. యన్. ఏ. ను గురించి తెలుసుకొనే ప్రయత్నంలో "ఎక్స్‌రే డిఫ్రాక్షన్" "కాలమ్ క్రొమటోగ్రఫీ"- వంటి ప్రక్రియలను ఉపయోగిస్తారు. ఇతడు వ్యాట్సన్, క్రిక్‌లు ప్రతిపాదించిన "డబుల్ హెలిక్స్"కు మౌలి

కంగా భిన్నంగా ఉన్న డి. యన్. ఏ. అణువును కనుక్కోగలిగినారు. ఇతడు కనుగొన్న డి.యన్.ఏ. 'క్లాసిక్' డి. యన్. ఏ.కు పూర్తిగావ్యతిరేకమైనది. దర్పణంప్రతిబింబంవంటిది. మామూలుగా వాట్సన్, క్రిక్‌ల నమూనాలో కుడి నుంచిఎడమకు మెలికలు తిరిగి ఉంటాయి. పైగా ''కౌంటర్ క్లాక్‌వైస్ డైరక్షన్''లో ఉంటాయి. రిచ్ నమూనా అలాకాదు. ఎడమనుంచి కుడివైపుకు మెలికలు తిరిగి ఉండి సవ్యదిశలో ఉంటుంది (గడియారం ముల్లు తిరిగే దిశను సవ్యదిశగా గుర్తిస్తారు). ఈ వ్యత్యాసమే కాకుండా నిచ్చెన గోడలలో ఉన్న అణువులు కూడ (ముఖ్యంగా చక్కెర అణువు, పాస్ఫేట్ అణువులు, చిందర వందరగా అంటే "జిగ్ జ్యాగ్"గా ఉన్నాయి. అందువల్లే యీ డి. యన్. ఏ. కు "జిగ్‌జ్యాగ్-డి. యన్. ఏ." అని నామకరణం జరిగింది. ఇలా ఎందుకు జరిగి ఉంటుందనేది ఒక ప్రశ్న. మరొక రకపు డి. యన్. ఏ. లో ఒక "అమైనో ఆసిడ్" (దీన్ని గురించి ముందు ముందు తెలుసుకొంటాము) నిర్దేశించే జన్యుసంకేతం సాధారణ సంకేతంకన్నా భిన్నంగా ఉన్నది. దీనివల్ల ఒక విషయం తెలియవచ్చుచున్నది. అన్ని జీవరాశులలోనూ డి. యన్. ఏ. అణువు తప్పనిసరిగా ఒకే నిర్మాణాన్ని కలిగి ఉండవలసిన అవసరంలేదని. అంటే దోమ జన్యువులోని డి.యన్.ఏ. ఒకఏనుగు జన్యువులోని డి.యన్.ఏ.తో పోలి ఉండకపోవచ్చు. ఈ పోలి ఉండడం లేక వ్యత్యాసం ఉండడం అనేవి ఎందువల్ల ఏర్పడుతాయనే సందేహానికి "మ్యూటేషన్"లు ఒక కారణమని సెలవిచ్చారు. ఈ "మ్యూటేషన్"లు ప్రకృతి పరిమితులు. అంటే యిక్కడ మళ్ళీ ప్రకృతే గొప్పదని అనుకోవాలా ? అంటే డి. యన్. ఏ. ప్రకృతికి లోబడి ఉంటుందనేకదా ! అది, అటువంటప్పుడు, పరబ్రహ్మ స్వరూపంగా ఎలా గుర్తించబడుతుంది ? ఒకరకంగా జీవరహస్య కీలకం అందులో లేదనే కదా ? ఆలోచిద్దాం. "మ్యూటేషన్" మాత్రమే కాకుండా "రీ కాంబినేషన్" అనే ప్రక్రియ కూడ డి. యన్. ఏ. లో మార్పుకు సహకరిస్తుంది. జడ్-డి. యన్. ఏ. అనేది యిలాంటి ''రీ కాంబినేషన్" వల్లనే (''న్యూక్లియోటైడ్ చెయిన్''లు తెగి, అస్తవ్యస్తంగా గజిబిజిగా తికమకగా ఏర్పడితే అటు మళ్ళీ కలిసి పోవడమని "రీకాంబినేషన్"కి ఒకరకంగా అర్థం చెప్పుకోవచ్చు) ఏర్పడి ఉంటుందని భావించడం ఎంతమాత్రమూ అసమంజసం కాదు. జీవశాస్త్ర వేత్తలు అన్నిరకాల డి. యన్. ఏ. అణువుల్లోనూ (యిక్కడ రకమూ అంటే ప్రాణి భేదం మాత్రమే!) రమారమి 1-3 శాతము వరకు జడ్-డి. యన్. ఏ." అనేది ఉంటుందని ఊహిస్తున్నారు. ఇది కేవలం 'గెస్' మాత్రమే. నిజానిజాలు యింకా క్షుణ్ణంగా తెలియాలి. ఇకపోతే ''మ్యూటేషన్''కు కాని 'రీకాంబినేషన్'కు కాని-అవెందుకు ఏర్పడుతాయో చెప్పడంలో సంతృప్తికరమైన సమాధానాలను చెప్పలేకున్నారు. ''మ్యూటేషన్''కు ప్రకృతి ప్రభావం కారణమను కొంటే (పెరామీటర్ ఏదైనా కావచ్చును.) 'రీ కాంబినేషన్'కు కూడ అదే కారణాన్ని చెప్పుకోవలసి వస్తుంది. అంటే ఒక విధంగా ప్రకృతి గొప్పతనాన్ని కొనియాడవలసి వస్తుంది. దీన్ని కాదనుకొని, డి. యన్. ఏ. ను నియంత్రించే మరొక విశిష్టమైన పదార్థం కేంద్రకంలోనే ఉందను కొంటే, అది ఏవిధంగా, ఎలా, ఉంటుందనే సందేహాలను నివృత్తి చేసుకోవలసి వస్తుంది. ఆ పదార్థం ఏమిటి అనేది యింతవరకు అంతుబట్టలేదనే అభిప్రాయపడవచ్చును. ఆ సంగతి సరే. ఇంతకూ యీ డి. యన్. ఏ. అనేది ఏంచేస్తుందని దాన్ని జీవరహస్య కీలకంగా భావించాలి ?- అనే విషయాన్ని గురించి ప్రస్తుతం యోచించాలి.

డి. యన్. ఏ. "ప్రోటీన్"ల సంశ్లేషణలో ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తుంది. ఈ "ప్రోటీన్"లు అటు దేహంయొక్క పెరుగుదలకూ, యిటు దేహంలో చైతన్యానికి-రెండింటికీ సహకరిస్తాయి. చైతన్యం "ఎంజైమ్"లు "హార్మోన్"లు అనబడే క్రియాశీల "ప్రోటీన్''లపై ఆధారపడిఉంటుంది. "ఎంజైమ్"లన్నీ "ప్రోటీన్''లేకాని''హార్మోన్''లన్నీ 'ప్రోటీన్'లా? 'హార్మోన్.'ల తయారీలో డి. యన్. ఏ. పాత్రఉన్నదా ?- అనేవి మప్పైఅయిదు సంవత్సరాలుగా అర్థంకాకుండా ఉన్నాయి. ''ఒపెరాన్ భావన'' కొంత వరకు యీ ''ప్రోటీన్''ల తయారీని గురించి విశదపరుస్తుంది. ఒక్క మాటలో చెప్పవలెనంటే డి. యన్. ఏ. యే ప్రాణి వ్యవస్థకు ఆయువుపట్టని నిర్ణయించవచ్చు. డి. యన్. ఏ. నుంచి ''ప్రోటీన్'' లు ఏర్పడే విధానాన్ని ''ట్రాన్స్‌లేషన్'' అంటారు. ఈ ప్రక్రియ ఎంతో క్లిష్టతతో కూడుకొన్నది. దీనిని గురించి తెలుసుకొనవలసిన అవసరం ఉన్నది. డి. యన్. ఏ. నుంచి ''ప్రోటీన్''లు ఏర్పడే విధానాన్ని రేఖామాత్రంగా వివరిస్తాను.

### డి. యన్. ఏ. క్రియాశీలత



డి. యన్. ఏ. నుంచి డి. యన్. ఏ. ఎలా ఏర్పడుతుందో పరిశీలిద్దాము. డి. యన్. ఏ. తరతరాల నుంచి ఒక ప్రాణి ద్వారా మరో ప్రాణికి అందజేయపడుతూ ఉంటుంది. మొదటిసారిగా యీ డి. యన్. ఏ. అణువు ఎలా ఏర్పడి ఉంటుంది ? అని సందేహం అంత త్వరగా పరిష్కరించబడేది కాదు. డి. యన్. ఏ. ఉన్నది. అది మరో డి. యన్. ఏ. ను తయారు చేయగలదు. అంత మాత్రమే ! ఈ కారణంవల్లే డి. యన్. ఏ. ని జీవరహస్య కీలకంగా గుర్తిస్తారు. డి. యన్. ఏ. సంశ్లేషణలో విశిష్టమైన "ఎంజైమ్"లు పాల్గొంటాయి. ఈ "ఎంజైమ్"లు డి. యన్. ఏ. ద్వారానే ఏర్పడి ఉంటాయా ? అనేది ఒక అనుమానం. లేక స్వతః సిద్ధంగానే ఏర్పడిఉంటాయా ? (ఎలా అనేది "డిఫరెంట్‌యి ష్యూ!") అనేది మరో అనుమానం. ఈ "ఎంజైమ్"లు డి. యన్. ఏ. అణువుపై ప్రభావాన్ని చూపి చైతన్యాన్ని కలిగిస్తాయి. అప్పుడు డి. యన్. ఏ. నిచ్చెన రెండుగా చీలిపోతుంది. ప్రతి పోచకూ ప్రత్యామ్నాయంగా మరో పోచ రూపొంది మొత్తంమీద ఒక్క డి. యన్. ఏ. అణువునుంచి రెండు అణువులు ఏర్పడుతాయి. దీని వల్ల రెండు అణువుల్లోనూ "న్యూక్లియోటైడ్"ల సంఖ్య ఒకే విధంగా ఉంటుంది. వాటి నిర్మాణ ప్రమాణాలుకూడ ఒకే విధంగా ఉంటుంది. అందువల్లే డి. యన్. ఏ. "జెనెటిక్ బ్లూ ప్రింట్"కు సాధనమని భావించడం ! "నెగటివ్ లోంచి "ఫొటో ప్రింట్" చేసినట్లుగా ఈ చర్య జరగడం సృష్టిలో ఒక అద్భుతం !

(డి.యన్.ఏ. రూపొందడం–రేఖాచిత్రం 59వ పేజీలో చూడండి)→

ఇటువంటప్పుడు వైవిధ్యం ఎప్పుడొస్తుందని అనుమానం రావచ్చు. వైవిధ్యానికి కారణాలుగా ''మ్యూటేషన్'', ''రీకాంబినేషన్'' ల గురించి యింతకుముందే చర్చించినాము. ఇకపోతే డి. యన్. ఏ. "ప్రోటీన్" సంశ్లేషణను ఎలా కొనసాగిస్తుందని చర్చించుకోవలె. జీవరహస్యానికి కీలకం యిక్కడే ఉన్నది.

"ప్రోటీన్"ల సంశ్లేషణ ఆర్. యన్. ఏ. ("రైబోన్యూక్లియక్ ఆసిడ్") సాహచర్యంతోనే జరుగుతుంది. ఆర్. యన్. ఏ.ఎలా పుడుతుందనే ప్రశ్నముందు నిలుస్తుంది. డి.యన్.ఏ నుంచీ ఆర్. ఎన్.ఏ. పుడుతుంది."ఎంజైమ్"ల ప్రభావంవల్ల డి.యన్.ఏ.పోచలు విడిపోతాయి. కొన్ని ముక్కలు కూడ అవుతాయి. ఈ పోచలకు ప్రత్యామ్నాయంగా నిర్మాణాలు జరుగుతాయి. అయితే ఒక్కటే భేదం. డి. యన్. ఏ. లో అయితే ''అడినిన్'' కు బదులుగా సమాధానంగా ''థైమిన్'' ఉంటుంది. కాని యిక్కడ, అంటే, ఆర్. యన్. ఏ. తయారీలో "యురాసిల్" ఉంటుంది. పైగా అక్కడ, అంటే, డి. యన్. ఏ. సంశ్లేషణలో పోచలు ఉదజని బంధాలద్వారా కలుపబడతాయి. అలాగాక, ఆర్. యన్. ఏ. ప్రత్యామ్నాయం విడిగానే ఉండి "మెసంజర్ ఆర్. యన్. ఏ." అని పిలవబడుతుంది. ఇందులో డి. యన్. ఏ. సమాచారం "కమ్యూనికేట్" చేయబడి ఉంటుంది. ఈ ''కమ్యూనికేషన్'' త్రిక్ సంకేతాలద్వారా జరుగుతుంది. మూడేసి నత్రజని క్షారాలు ఒక్కొక్క సంకేతంగా భావించ బడుతుంది. దీన్ని ''జెనెటిక్ కోడ్'' లేదా 'కోడాన్'' అని పిలుస్తారు. ప్రతి ''కోడాన్'' ఒక ''అమైనో ఆసిడ్''ను నిర్ణయిస్తుంది. ఈ "అమైనో ఆసిడ్" లు ''ప్రోటీన్"ను నిర్మించే ప్రమాణాలు. సాధారణంగా తొంభై శాతం వరకు "ప్రోటీన్" లు నూరునుంచి మూడు వందల వరకు ''అమైనో ఆసిడ్"లను కలిగి ఉంటుంది. సాధారణంగా కణద్రవ్యంలో ఇరవై మౌలికమైన ''అమైనో ఆసిడ్''లు ఉంటాయి. ఇవే ''పాలీపెప్టైడ్ చెయిన్"ని (''ప్రోటీన్''ని) రూపొందిస్తాయి. ''అమైనో ఆసిడ్''ల సంఖ్యను బట్టి ''ప్రోటీన్''లు మారుతూ ఉంటాయి. ఈ విధంగా ''కోడాన్''లను తయారు చేసుకొన్నపిదప ''మెసంజర్ ఆర్. యన్. ఏ.'' కేంద్రకాన్ని వదలి కణద్రవ్యాన్ని చేరుకొంటుంది. కణద్రవ్యంలో ముఖ్యంగా''రైబోసోమ్" అనబడే కణాంగాలపై స్థిరపడుతుంది. ఈ ''రైబోసోమ్''లలో ''రైబోసోమల్ ఆర్. యన్. ఏ.'' అనబడేది ఉండి, చర్య యొక్క క్రియాశీలతను ఎక్కువ చేయడంలోనూ, చర్యను ప్రోత్సహించడంలోనూ తోడుపడుతుంది. ఈ ''రైబోసోమల్ ఆర్. యన్. ఏ.'' కూడ డి. యన్. ఏ. నుంచి రూపొందినట్టిదే. ఇకపోతే కణద్రవ్యంలో (దీన్ని ''సైటోసాల్''అని కూడ అంటారు) ''సాల్యుబల్ ఆర్. యన్. ఏ." లేదా ''ట్రాన్స్‌ఫర్ ఆర్. యన్. ఏ.'' ఉంటుంది. ఇది కూడ డి. యన్. ఏ. ముక్కలుగా తెగడంద్వారా రూపొందినట్టిదే. ఈ ''సాల్యుబల్ ఆర్. యన్. ఏ." లో ''మెసెంజర్ ఆర్.యన్. ఏ."కు ప్రత్యామ్నాయంగా నిలువగలిగే 'ఆంటీ కోడాన్'లు ఉంటాయి. అంటే 'రైబోసోమల్ ఆర్. యన్. ఏ.' పర్యవేక్షణలో 'మెసెంజర్ ఆర్. యన్. ఏ.' మరియు 'సాల్యుబల్ ఆర్. యన్. ఏ.'లు కలిసికట్టుగా త్రిక్ సంకేతాలకు పూర్ణ భాష్యం లిస్తాయి. ఉదాహరణకి GAG అనే 'కోడ్' తో 'మెసెంజర్ ఆర్. యన్. ఏ.' రంగంలోకి దిగితే దానికి ప్రత్యామ్నాయంగా CUC అనే 'ఆంటీకోడ్'తో 'సాల్యుబల్ ఆర్. యన్. ఏ.' సమాధానం చెబుతుంది. ఇవి రెండూ కలసి 'గ్లూటామిక్ ఆసిడ్' అనబడే 'అమైనో ఆసిడ్'ని నిర్దేశిస్తాయి. ఒకే 'అమైనో ఆసిడ్'కు ఒకటి కంటే ఎక్కువ 'కోడ్'లు ఉండవచ్చు. "గ్లూటామిక్ ఆసిడ్" కే GAA అనే మరో 'కోడ్' కూడా ఉంది, అలాగే "లైసీన్" అనబడే "అమైనో ఆసిడ్"కు AAA. AAG అనే రెండు "కోడాన్"లు ఉన్నాయి. ఈ విధమైన త్రిక్ సంకేతాలు

# డి. యన్. ఏ. రూపొందడం




మాతృక (1)




చీలిన మాతృక (2)







(3)

దాదాపు 64 వరకూ - అంటే అమైనో ఆసిడ్ ల సంఖ్యకు మూడురెట్లు ఉంటాయని భావన. సరే. ఈ పాలీపెప్టైడ్‌యిన్‌చే కొనసాగుతూ ఉండవలసిందేనా ? దీనికి అంతం ఎప్పుడు ? అని ప్రశ్నించుకొంటే 'చెయిన్ ఎండ్' లు లేదా 'పీరియడ్'లు అనబడే మూడు త్రిక్ సంకేతాలున్నాయి. అవి TAA, TFG, TGAలు. ఇవి "చెయిన్" ని పూర్తి చేస్తాయి. "సాల్యుబుల్ ఆర్. యన్. ఏ." లో CCA ఎప్పుడూ చివరి సంకేతంగా ఉంటుంది. దీనిలో 70-80 "న్యూక్లియోటైడ్"లు ఉంటాయి. అణుభారం 2,500 - 30,000 వరకు ఉంటుంది. మెసెంజర్ ఆర్. యన్. ఏ.' అలా కాదు. ఇది దాదాపు డి. యన్. ఏ. ను పోలి ఉంటుంది. దీని కాల పరిమితి రెండు నిమిషాలు మొదలుకొని రెండు గంటల వరకూ ఉంటుంది. 'రైబోసోమల్ ఆర్. యన్. ఏ. వందలు, వేలకొలది 'న్యూక్లియోటైడ్' లను కలిగి ఉంటుంది. అణుభారం రెండుకోట్ల వరకూ ఉంటుంది. జేమ్స్ బాన్నర్ అనే శాస్త్రవేత్త క్రీ॥ శ॥ 1935లో బటానీ గింజల్లో బంధీకృతమై ఉన్న ఆర్. యన్. ఏ.ను కను గొన్నాడు. ఇందులో నలభై వరకు 'న్యూక్లియోటైడ్'లు ఉన్నాయట. దీని ప్రయోజనం ఏమిటీ అన్నది యింకా నిర్ధారింపబడలేదు. అయినా దీనికి, 'సాల్యుబుల్ ఆర్. యన్. ఏ.'కి పెద్దగా తేడాలేదని గుర్తి స్తున్నారు. ఈ విధంగా డి. యన్. ఏ. తెరవెనుక ఉండి ఆర్. యన్. ఏ. ల ద్వారా జీవ చైతన్యానికి నాందీ పలుకు తోందన్నమాట. అంటే డి. యన్. ఏ. పరబ్రహ్మంగా మిగిలిన మూడు ఆర్. యన్. ఏ. లూ బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా వ్యవహరిస్తూ ఉన్నాయని చెప్పుకోవచ్చు. అయితే కొన్ని సందేహా స్పదమైన అంశాలుండడం వల్ల డి. యన్. ఏ. ను జీవరహస్య కీలకంగా ఒప్పుకోడానికి కొన్ని అవాంతరాలు ఏర్పడినాయి.

క్రీ. శ. 1980 సంవత్సరం కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయపు 'రిపోర్ట్' ప్రకారం కొన్నిచోట్ల డి. యన్. ఏ. 'జెనెటిక్ గ్రామర్' ను 'ఫాలో' కావటంలేదు. ఎందుకనీ అంటే సమాధానం లేదు ! GA అనేది 'పీరియడ్' అని, అది 'పాలీపెప్టైడ్ చెయిన్'ని 'ఎండ్' చేసే త్రిక్‌సంకేతమని యింతకు ముందే గ్రహించి ఉన్నాము. కాని యీ TGA 'ట్రిప్టోఫ్యాన్' అనబడే 'అమైనో ఆసిడ్'కు 'కోడ్'గా వ్యవహరించడం విపరీతంగా ఉంది. ఇది యింతవరకూ అర్థం కాలేదు. బహుశా ఎప్పటికైనా అర్థమౌతుందో లేదో చెప్పడానికి కూడ సందేహపడవలసి వస్తుంది. మరో ఉదాహ రణముంది. 'హీమోగ్లోబిన్' నిర్దేశానికి ఉపాంతంగా నిలిచే జన్యువులో డి. యన్. ఏ. 1200 'న్యూక్లియోటైడ్'లను కలిగి ఉన్నా 'మెసెంజర్ ఆర్. యన్. ఏ.' కేవలం 700 'న్యూక్లియో టైడ్' లను మాత్రమే (అదీ గిరి గీచినట్లుగా, లెక్కపెట్టుకొని తీసుకొంటున్నట్లుగా !) 'రైబోసోమ్'ల దగ్గరికి మోసుకొనిపోవడం విస్మయాన్ని కలిగిస్తుంది. అంటే డి. యన్. ఏ. కన్నా కూడ 'మెసెంజర్ ఆర్. యన్. ఏ.'కు 'సెలెక్టింగ్ పవర్' ఎక్కువగా ఉంటుందా? డి. యన్. ఏ. నుంచి వచ్చిన యీ ఆర్. యన్. ఏ.కు ఆ 'పవర్' ఎలా వచ్చి ఉంటుంది ? — వీటికి సమాధానాలు చెప్పుకోవడంలో, కణాలలో స్వయం నిర్దేశకశక్తి ఉన్న కొన్ని ప్రత్యేకమైన 'ఎంజైమ్'లు ఉంటాయన్న వాదం ధృవపడింది. పీటర్ జైన్నె అనే శాస్త్రజ్ఞుడు (క్రీ.శ. 198 ) యిదే అభిప్రాయాన్ని పునరుద్ఘాటించాడు. దీనివల్ల ఒక విషయం స్పష్టమౌతుంది. డి. యన్. ఏ. లోని లోపాలను సవరించడమే కాకుండా తమలోని లోపాలను సవరించుకొనే ప్రత్యేకమైన 'ఎంజైమ్'లు కణంలో ఉండడంవల్ల జీవరహస్య కీలకం డి. యన్. ఏ. కాదని అది కేవలం జీవరహస్య స్థావరం మాత్రమేననితెలుస్తుంది. 'ఎంజైమ్' లు ఎక్కణ్ణుంచి వచ్చాయి ? డి. యన్. ఏ. నుంచే రావాలి. అంటే డి. యన్. ఏ. కే ఎక్కువ చైతన్యశక్తి ఉండాలి. నిర్దేశక శక్తి ఉండాలి. మరి నిజానికలాలేదు. అటువంటప్పుడు యీ 'ఎంజైమ్'లు ఎలా వచ్చాయి ? ఎక్కణ్ణుంచొచ్చాయి ? అంటే ఏమి సమాధానం చెప్పాలి. ఇవి స్వతః సిద్ధాలా, స్వస్వతంత్రాలా అనుకొంటే ఈశ్వరవాదమే కదా ! మరి 'సైంటిఫిక్'గా ఏనం సాధించిన మనత ఏమున్నది ? వేదాలలో యీ విషయాన్ని ఎప్పుడో చెప్పిఉన్నారు కదా ! అది తెలియదు అని తెలుసుకోవడం గొప్పే ? కాదనను. ఎందుకు తెలియదు అనేదానికి సమాధానం ఎలా చెబుతారు ?—ఇవి యింకా యీనాటికీ వేధిస్తున్నసమస్యలు. ఈ అర్థంకాని 'ఎంజైమ్'ల క్రియాశీలతకు 'మెగ్నీషియమ్ అయాన్'లు ATP వంటి శక్తిని విడుదల చేసే "పాస్ఫేట్"లు, చర్యాశీలతకు తోడుపడే యౌగికాలు అవసరమని భావిస్తున్నారు. మొత్తానికి యీ రోజువరకు డి. యన్. ఏ. ను జీవరహస్య కీల కంగా భావించినా. భావిలో అది నిజంకాదని తేలిపోతుంది. డి. యన్. ఏ. ను నియంత్రించే ప్రత్యేక "ఎంజైమ్"ల పుట్టు పూర్వోత్తరాలపై పరిశోధించవలసి ఉంది. జీవరహస్య కీలకాన్ని రేఖాచిత్రంలో చూపుతాను ("ప్రపంచాన్ని" కాగితంపై యిరి కించినట్లు!)

## జీవ రహస్య వివరాలు




కాబట్టి, యింతవరకు అందిన సమాచారాన్నిబట్టి, డి.యన్.ఏ. ను జీవరహస్య కీలకంగా భావించడమనేది పొరపాటు చర్య అని గమనించవలె. డి. యన్. ఏ. ను సరిదిద్దే ప్రత్యేక ''ఎంజైమ్''లే జీవరహస్య కీలకాలని కూడ చెప్పకూడదు. ఎందుకనగ ఆ 'ఎంజైమ్'లకు ఉత్ప్రేరణ ఎక్కడనుంచి వస్తున్నదో అక్కడే జీవరహస్య స్వయంగానే సర్వస్వతంత్ర జైవిక చైతన్య ప్రతిరూపాలని భావిస్తే, ఆ ''ఎంజైమ్''లలోనే జీవరహస్య కీలకాలున్నాయని చెప్పుకోవచ్చు. కాని యీ చెప్పుకోవడమన్నది వివేకవంతమైనదా? కాదా? – అన్నది ఎవరికి వారే విమర్శించుకొని నిర్ణయించుకోవలె.

ఇప్పుడు చెప్పండి. అందరూ భావిస్తున్నట్లుగా కేంద్ర

# శారదా నవరాత్రులు

## (అనే ఆయుధపూజ)

శ్రీ సోమసుందర్

"తట్టండి తట్టండి! నూత్నలోకపు తలుపు
వినవచ్చె నితెరండి, నవమానవుని పిలుపు!"
అంటూ గాలి అదే పనిగా ఇన్నాళ్ళూ పాడిన
ఆహ్వాన గీతం ఉత్త అసత్యమేనా?

విదేశాల విఫణి వీధులలో
వసంత వనుల సంతలలో
పూవు లందించిన చేతులతోనే —
నీ స్వదేశం పీడులలో పల్లెలలో
పర్ణశాల పంచలలో — ఎందుకు తల్లీ?
నిప్పులు వెదజల్లుతున్నావు!
ఎవ్వరిదీ అపరాధం? ఎందులకీ కార్పణ్యం?

నువ్వొక చేత్తో తిమిర సహస్రాన్ని
వేరొక చేత్తో నవజాగృత కాంతి గుళుచ్ఛాల్నీ
ఆశీర్వదిస్తూ, సమదర్శని వనిపించుకుంటూ —
ఎన్నాళ్ళు తల్లీ? ఈ దొంగాటకం!

ఇకపై వినాశాయచ సాధూనామేనా గతి?
నాథూరామ్‌లకేనా సద్గతి?

### 2

ఎందులకీ చితాభస్మరాశుల ఆతిథేయం?
ఎందులకీ మృషాశ్రుమాలాలంకరణం?

ప్రజా తంత్రం నిర్మించిన శాసనసభలలో
నీవు పెంచి పోషించిన రాసభాలు ....
మోరలెత్తి అదేపనిగా నిన్నే కీర్తిస్తున్నాయి;
నిరుపేదల నెత్తురు త్రాగే
మృగరాజుల రాజసాలు దుశ్శాసన పర్వం పఠిస్తున్నాయి!

మానవ ధూమం కోసం గగన వీధులలో
గంతవ్యా లెరుగక పారాడుతూన్న రాబందులు
నిన్ను చూసే కలనాదా లొలుకుతున్నాయి ....
శని చక్రం త్రిప్పుతూన్న నూనెగానుగ కిర్రులలో
ఏ భయంకర మకరాలు పీల్చేశాయి గతాల జ్ఞాపకాలు?
కలల పొలిమేరలలో మెలకువల కువకువలు ....
వలవంతల ముసుగులలో పలవరింతల కలతలు ....

### 3

గతాన్ని వర్తమానంతో బంధించే
కనిపించని బంగరు గొలుసులు
ఎలా తెగిపోయాయమ్మా? ఎవరు త్రెంచారు?
నడినెత్తికెక్కిన గ్రీష్మంలా
వర్తమానం భగభగ లాడుతూంటే —
ఏ వాహనం చూసినా, మృత్యుకు ఆహ్వాన తోరణంతోనే
ఎదరవుతూంటే — ఏది దారి? ఎక్కడ మురారి?

నాగరికత మత్స్య న్యాయానికి గురై
సాగరగతగా విపరిణామం చెందిందే!
హనుమదారాధన చేసి చేసి జాతి
వానరత్వ మందుకొంటోందే — ఏది దారి? ఎలా పరా?

పాలూ నీళ్ళూ కలగలిపినట్లు
మంచీ చెడూ విడతీయరాని మిశ్రమమై
భావిపౌరులకు పంచిపెట్టే బలవర్ధక ఆహారమై
ప్రశంసించ బడుతోందే — ఏది దారి? అంతులేని ఎడారి!

కాకుల హజారంలో నిలువలేక
కోకిలలు కుటజాంతరాలకు పలాయించి
జితోస్మి మంత్రం జపిస్తూంటే
ఇంకా స్వాదుగాన రస తరంగిణి ఎక్కడ?

## 4

ఎన్ని కలలనో పేర్చుకొని
వచ్చే ఎన్నికలు ఉద్ధరిస్తాయనుకుంటే
నీ కన్నీళ్ళతో ఓట్లు కొట్టుకుపోతున్నాయమ్మా !

నిరుపేదలపై దినవారీ విషాదాలు
సవారీ చేస్తూ విషాలుమ్మేస్తూంటే _
దీనులపై ఉరికి పడుతూ కదలివచ్చే
కళ్ళులేని బండరాళ్ళు _ ఎవళ్ళు వాళ్ళు ?
మరు భూముల చీకటి దూతలు _ వాళ్ళా ?

కటివరకూ దుఃఖాలను దుకూలాలుగా
చుట్టుకొని, దశదిశలనీ ధరించిన విరించులు
చేతులెత్తి శూన్యాన్ని వెదుక్కొనే నిర్భాగ్యులు !
ఆ అనదలపై ఎందులకమ్మా కక్షా నేత్రం ?
కీలలు కురిపించే శిక్షా గాత్రం ?
ఆ బక్క పీనుగులపైనా బలిసిన నీ వేటకుక్కల
నుసికొల్పేది ? కసిగా నుసి చేసేదీ !

## 5

మా కరకు గోడల తలల నిండా
నెత్తురు చిమ్మే వేలాది చిల్లులు ....
ఆశలు దుళ్ళిపోతున్న గోడల
మొండేలపై మమ్మల్నే తినచూసే
ఆకలితో పారాడే బల్లులు !

మా అడుగులలో పడగల నీడలు;
దాహం తీర్చుకుందుకెత్తిన గ్లాసుడు నీళ్ళల్లో
మమ్మల్ని పీల్చేసే జలగలు !

క్షయవ్యాధి పీడితునిలా
మా చుట్టూ అలముకొన్న సముద్రం !
ఆరోగ్యవంత భూముఖంమీద
చిమ్ముతోంది విషక్రిముల ఫేనం !
అందుకే మా బ్రతుకులు
సదా మూలిగే తీరభూములు !

## 6

మా చుట్టూ అల్లిన ముళ్ళ తీగలపై
కృతాఘ్నుల దగ్ధ కామనలు;
మానవుల కందించదు వర్తమానం
సాంత్వన మిచ్చే రుచిర దరస్మితం !

ఆగామిలో కాల కాహ్వాన మంత్రం
జపించదు ప్రస్తుత జీవన సంక్షోభం !
కలల మత్తుమడతలలో మణిగిన చిత్తంలో
అవతలి తీరాలు వినిపించే విస్ఫోటనం !

ఆధునిక జీవితం _ నేటినుంచి రేపటికి
ఉత్సాహంగా పొంగవలసిన ప్రవాహం !
తన చుట్టూ తానే గుడిసుళ్ళు పడుతూ
క్రుంగుతోంది నైరాశ్యధ్వాంతంలో !
ఎందుకు తల్లీ ఈ నిర్దయ ?
మళ్ళీ మళ్ళీ ఎందులకీ దుర్దశ ?

బ్రతుకు కొమ్మ పలవలలో వ్రేలాడే
దయ్యపు బొమ్మలు; బియ్యపు గింజలు
దొంగిలించి చెట్లెక్కిన దయ్యపు బొమ్మలు !
సుడిగుండాలను కల్పించే సిరిబొమ్మలు !

ఇక్కడ ఎంత ఎత్తయిన తాటి చెట్లయినా
మరుగుజ్జు ముళ్ళ తుప్పలకు దడుస్తాయి !
ఒంగి ఒంగి సలాములు చేస్తాయి !
ఇక్కడ ప్రతిపూవు గుండెల్లోనూ
రోగక్రిములు చేరి బలుస్తాయి !
ముళ్ళతీగల కంచెలు పంటచేలను మేస్తాయి !

అదిగో ఎర్ర ఎర్రని మందారం _
రేకు రేకూ మూడు ముక్కలుగా చీలింది పాపం !

## 7

వనమహోత్సవంలో తల్లీ
నువ్వెంత ముచ్చటపడి నాటిన వృక్షాలన్నీ
విషకుక్షుల కావాసం !
కొమ్మ కొమ్మకీ రాక్షస పక్షుల క్రేంకారం !

నగ్నాటవుల ఉద్విగ్నా వేశాలకు
వీడ్కోలు పలికే అశరీరవాణులు,
సశరీరంగా నడిచే శతఘ్నులు ....
వేదిక లెక్కే తెల్లటోపీల క్రింద
నల్లని పీతకాళ్ళ కృతఘ్నులు !
తల్లీ వీళ్ళంతా ధృతరాష్ట్రపుత్రులు ....
గాంధారి కష్టపడి కన్నపుత్రులు !

నా దేశపు గడియారంలో
కాలాన్ని కష్టపడి ముందుకులాగే
చిన్నముళ్ళు నిర్దయగా విరచబడ్డాయి.
పెద్దముళ్ళదాష్టీకానికి అదుపులేదు !

ఇంత దట్టంగా అలుముకున్న
ఈ చీకటి పాతరనుంచి, రేపయినా
అగ్నిస్కంధు లుద్భవిస్తారంటావా ?
జ్వాలా జిహ్వా సహస్రులు ? మహస్సులు ?

## 8

ఇక్కడ పేదరాశి పెద్దమ్మలకు ఆధారం లేదు
పెద్దబాలశిక్షనైనా చదవని చేటుపెయ్యలు
చెదరని నిశానీలు ఏలుబడికి పెద్దలు !

కనవయినా అందని నిసుగుల
పెదవులవలె కాలం నల్లబడింది ....
నల్లబడి చల్లబడిపోయింది.
జీవభాండం చిల్లుపడింది.

స్వాతంత్ర్యోత్సవ ధ్వజారోహణ సమయంలో
కొత్త నీతిమంతురాలు దొమ్మరిసాని
గెడపైకెక్కి గంతులు వేసింది;
అమె ప్రజ్ఞా పాటవాలకు ముగ్ధులైన జనం
ఆమెనే తమ నాయకమణిగా ఎన్నుకుంది!

ఆ తర్వాత చూసుకో ! శ్మశాన దుశ్శాసనం
నల్లని తెర కప్పింది; అదృశ్య హస్తం
ఉరికంబపు కప్పి తాడు లాగింది;
తన గుండెల దడదడ చప్పుళ్ళకు
తానే దడుసుకుని కళ్ళు మూసుకొన్న
అరిపేద పాపం — ఉన్నదంతా దానం
చేసిన బలిచక్రవర్తి ! పాతాళం విలవిల లాడింది !

## 9

దూరపు తూరుపు తీరా లెత్తిన
మాయావి హస్తాల సైగలకు తనిసి
అరుణోదయమని భ్రమసిన విద్యార్థికుడు
శుష్కావేశాల వ్యక్తి విద్వేషాలతో
శ్రామికజన విప్లవ మిదేనని నమ్మిస్తున్నాడు
వెర్రిబాగులవాడు సాదా పౌరుడు
తనకేమీ పట్టనట్లు తప్పించుకు తిరుగుతున్నాడు ....

అటువికంగా తెగనరుకబడ్డ కుతుకలు
ఆకాశ రక్త వర్ణాంకిత శూన్యభితికలు ....

ఈ మసిబారిన. చీకటిలో
మత్తుగా నిదించే ఒత్తిని
దీపానికి ముట్టించే దెప్పుడు ?
అనంత కాంతుల జ్వాలా తోరణంగా
పీడితులంతా ఉజ్జ్వలించే దెప్పుడు ?

ఈ విష ఝుంఝూ ప్రభంజనంలో
ఎగిరే తుర్రేళ్ళే జీర్ణ పత్రాలేనా జనం ?
పీడకలలతో గడచిన
ప్రతి జాగృత రాత్రిం
దుఃఖ గాథా కథన సంక్షుభిత గాత్రిం !

ఈ దేశంలో తల్లీ ప్రతి బలహీన తీరం
కర్కశ జలధీ క్రకచ దంత క్షత కోమలాధరం !
సుమహాసం అంకురించ దిక్కడ . . .
మృదుగానం వికసించని మొద్దుదిబ్బ ....

ఇది నీరవ తమోగర్భ
రాక్షస గర్జా దుర్భర ....

దీనికి అంతం లేదా తల్లీ ?
ఇది నర రక్తంతో తప్ప చల్లారని పిపాస !
ఇది యుగాలుగా సాగుతున్న జిఘాంస !



శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తి

# బౌద్ధ-తామ్ర కరండము

1973 ఆగష్టు మాసమున "భారతి" మాస పత్రికలో "భూగర్భ వినాయకులు - నూతన సమస్య" అను ఒక చారిత్రిక వ్యాసమును ప్రకటించి యున్నాను. అందు వెలువరించిన సందేహములకు నేటివరకును ఏ విధమైన సందేహ నివారణ గల వ్యాసమును గోచరించలేదు. అందుకే తిరిగి 1980 జూన్ 30 తేది ఆంధ్ర దినపత్రిక ఆదివారం అనుబంధములో "రాజమహేంద్రి పురావస్తు త్రవ్వకాలు" అను ప్రత్యేక వ్యాసమును ప్రకటించుచు తొల్లిటి సందేహములనే వెల్లడించియున్నాను. కాని దానికిని నేటి వరకు సందేహ నివారణా వ్యాసము గోచరించలేదు. నేడాతావు నందే ఇంకను బలవత్తరమైన సాక్ష్యాధారములు లభ్యమగుటచే ఆ వెనుకటి వ్యాసముల కనుబంధముగ నీ వ్యాసమును ప్రకటించు అవసరమేర్పడినది. కావున కోవిదులు, చారిత్రికులు పరిశీలించి సందేహ నివృత్తి గావింప వేడుచున్నాను.

ఆనాడు "భారతి"లో ప్రచురించిన వ్యాసమునందు గల సందేహము : నేటి వరకును శిష్టాగ్రహారమై శ్రౌత, స్మార్తకర్మ క్రియాలాపముల కాలవాలమై వేద-శాస్త్ర నిష్ణాతులకు నిలయమై పొగడొందిన "దుళ్ల" గ్రామమున 10'-12' లోతున బౌద్ధ బిక్ష పాత్రలు, ఎఱ్ఱమట్టి కుండలు-పెంకులు, వాటి మధ్య మానవాస్థి శకలములు లభ్యమగుటయు వాటితోపాటుగ చిన్న చిన్న పచ్చిమట్టి వినాయక విగ్రహములు లభ్యమగుటయు, ఆ విగ్రహములందు వైదిక ప్రబోధక పవిత్ర చిహ్నములే మాత్రము లేకుండుట - కేవలము మానవ సన్యాస చిహ్నములే గలిగియుండుటచేనవి వేద మత విరుద్ధమైన అన్యమత సాంప్రదాయకులు లనుద్యోతకము లగుటచే అబ్బుర మేర్పడినది. ఆ వివరములన్నియు "భారతి" మాసపత్రిక 50 సంపుటము - 8 సంచిక 1973 ఆగష్టు 38-40పే. వివరించితిని. సమాధి సాంప్రదాయకులగు వేర్వేరు మతములు - శాఖల జీవించిన వారల నిర్యాణ సమయమున నిర్మించు సమాధుల యందు వారివారి సాంప్రదాయానుసారముగ రుద్రాక్షలు - త్రిశూలములు - విభూతి పండ్లు నిక్షేపించు ఆచారము నేటికిని దృగ్గోచరములే. ఆ విధముగనే ఆ మానవ సన్యాస చిహ్న స్వరూపము గల ఆ వినాయక విగ్రహములను నాటివారి మత సాంప్రదాయక సమాధి నిక్షేపములనియే యోజింపననువైనది. అంతియేగాక ఆ విగ్రహములందు దైవాంశములగు చతుర్భుజత్వము - కిరీటము - దుకూల వస్త్రధారణము - నాగయజ్ఞోపవీతము - ఏకదంతము - కేయూరాంక భూషణములు వ్యగ్యమైనవి. కేవల మవధూత సాంప్రదాయకమగు దిగంబరత్వము గూడగా చరించినది. అందుచే నవి వేదబాహ్యమైన బౌద్ధమత సాంప్రదాయక మనవలసి వచ్చెను.

ఇట్టి సాంప్రదాయక చిహ్నము లిదివరలో నెచ్చటను కని విని యెఱుగని దౌటచేతనే సందేహ నివృత్తికై ప్రశ్నించితిని. అయితే 1980లో "రాజమహేంద్రవర పురావస్తు త్రవ్వకము లందు" పవిత్ర గోదావరీ తీరమున పుష్పగిరి రేవున కుత్తరమున గల శేషగిరి పాద అంతమున (పాతాళమున) అడుగు భాగమున నాటి (క్రీస్తుశకారంభమునకు సరియగు కాలము) బౌద్ధస్థూపావశేషములును, దానిపై 6, 7 శతాబ్దములనాటి శైవ మతావశేషములును- దానిపై 13, 14 శతాబ్దముల నాటి వైష్ణవమతావశేషములును అందుకు సంబంధించిన చిహ్నములు విగ్రహములు కూడ లభ్యమైనవి. అందును ఇట్టివినాయక విగ్రహములే రెండును బయల్పడినవి. ఇదియు విచిత్రమైనదే. అయితే ఉభయ సింధువులని యుగ యుగముల నుండి ప్రసిద్ధికెక్కిన పావన గౌతమీ తీరముగుటచేనది అది నుండియు భిన్న విభిన్న మత సాంప్రదాయములకు నిలయమగుటచే



బౌద్ధ తామ్ర కరండము (దుళ్ల - తూ. గో. జిల్లా)

అనేక మత సాంప్రదాయక చిహ్నములు నేడు వెలువడుటలో వింత, ఆశ్చర్యములు కానరావు. కాని బౌద్ధ, శైవ, వైష్ణవ మత సాంప్రదాయక చిహ్నము లొకతావునందే ఒకదానిపై నొకటిగా లభ్యమగుటయు అందును తొలు దొల్లిటి దశయందున్న బౌద్ధమత సాంప్రదాయక చిహ్నములు విరివిగా గానవచ్చుటయు ఇంకను ఎచ్చటను గానరాని కనివిననేరని యీ వినాయక విగ్రహములును గానవచ్చుటయు మాత్రము వింతయైన విషయము మాత్రమేగాక ఆనాడు బౌద్ధమతాచార్య, గురు, పీఠాధిపతులు, తథాగతుల నిర్యాణ కాలమందలి సమాధులలో వారిఆరాధ్యదైవమగు వినాయక విగ్రహములను నిక్షిప్తముగావించు ఆచారము గలదని ధృవీకరించు చున్నది.

ఒక్క సంశయము :- హిందూమత సాంప్రదాయకమున వేద కర్మలన్నిటికిని ఆదిదైవము అధిదైవమై యుండగా వేదబాహ్యమైన బౌద్ధమతమునకు వినాయకుడెట్లు ఆరాధ్య దైవమయ్యెను అను దానికి సమాధానము కావలెను.

వేదమత సాంప్రదాయకముగల వినాయకునకు కొన్ని ప్రత్యేక దైవీ చిహ్నము లుదాహరింపబడినవి. అట్టి వేషయునిందు గానరాక పోవుటచే ఈ విగ్రహములు ఆ వేదమతమునకు ప్రత్యర్థిగానిలిచిన వేరొక (పాషండ) మత సాంప్రదాయకమని ధృవము. అందుకు నిదర్శనముగా అమరసింహుడు తనని ఘటువున 'షడభిజ్ఞాదశబలో ద్వైవాదీ వినాయకః' అనియు 'సశాక్యసింహ సర్వార్థసిద్ధ శౌద్ధోధనుశ్చసః' అని ప్రాకుృచ్చుచు 'వినాయకః, సర్వార్థసిద్ధః' అను రెండు పదములను వక్కాణించి యున్నాడు కావుననే 'తథాగతాదు'ల సమాధులయందు వీరి మ(తగురులగు) తాధిపతులగు వినాయక విగ్రహముల నిక్షేపించుట వింతగాదు సరిగదా ప్రకృతి సిద్ధమనక తప్పదు. అయితే ఇంతవరకు అట్టివి గానరాకుండుటకు కారణము. ఆయా సమాధుల నిర్మూలన మందు నిర్లక్ష్యముచే రూపుమాయుటయే యనవచ్చును. అట్టి వినాయకులకు వేద సమ్మతమగు దైవీచిహ్నములు గానరాక ప్రకృతి సిద్ధమై మానవానుచరణమగు సన్యాసి (అవధూత) రూపములే ప్రత్యక్షములు కాగలవు. ఇంతవరకు నా యల్పబుద్ధిచే సాధించిన సందేహ నివృత్తి. ప్రస్తుత విషయము : తొమ్మిది సంవత్సరములనాడు ఏ శ్రౌతస్మార్తక్రియా కలాప వేదమత సాంప్రదాయకమైన శిష్టాగ్రహారమగు యీ దుళ్ల గ్రామ మొకానొకప్పుడు వేదమత విరుద్ధమైన బౌద్ధమత సాంప్రదాయకమైన ఆరామముగా భావించితినో ఈ శిష్టాగ్రహారమే పూర్వము అనగా క్రీస్తు శకారంభ కాలమున ప్రసిద్ధిగన్న మహాయానము పిదపవజ్రయానములకు సంబంధించిన కాలమందు ఈ దుళ్ల గ్రామము తప్పక బౌద్ధమత సాంప్రదాయకమైనవని ఆరామ విహార, స్థూపాదాదులకు నిలయమై బౌద్ధమత గ్రంథములగు త్రిపిటికములకు సంరక్షణ స్థానమై ప్రసిద్ధికెక్కినట్లుగ ఆదినాయక విగ్రహములతోబాటు (బౌద్ధ) తామ్రకరండము- 11శతాబ్దపు తామ్ర శాసనములభ్యమైనవి. క్రిందటి వేసవిలో నేను 'దుళ్ళ' గ్రామము వెళ్ళునప్పటికి ఒకచోట పెద్ద గొయ్యి పాటిమట్టి త్రవ్వి పొలము లకు గొంపోవుచుండిరి. ఆ స్థలము వెనుక బౌద్ధమత చిహ్నము లును వినాయక విగ్రహములును కనుగొన్న ఎత్తైన ప్రదేశమే. అందే వెనుక సుమారొక గోనెడు ప్రమాణముగల ధాన్యపుపాతర ఎప్పుడు వేసినదోగాని ఆ ధాన్యమును - అందలి వరిఆకులు గూడ బాగానల్లబడి మెఱుగారి శిలారూపమును దాల్చుచున్నవి. తీసి నలుపగా చితికి బూడిద అయినవి.

అందుకనే ఆ గోతియందు దిగి పరిశీలింపగా ఆ మట్టి యందు ఒక చిన్న రాగిపాత్ర అడుగు (పట్టు)భాగము 5 సెం. మీ. వ్యాసము 1 సెం. మి ఎత్తు గలది బాగా చిలుముపట్టినది దొరికినది. అది యేదియో యని వదలివేసితిని. కాని మనస్సు స్థిరపడలేదు. తిరిగి భోజనమైన పిదప వెళ్ళి ఆ మట్టిని పరిశీలింపగా వేరొకటి రాగిపాత్ర పైభాగము (కప్పు)దొరికినది. అదియు అడుగు 5సెం.మీ వ్యాసము. 4 సెం.మీ ఎత్తు కలిగియున్నది. దానిపైభాగము మాత్రము (పూర్వపు మట్టి సిరాబుడ్డి మూతివలె) గంటాకారమున యుండి 1 సెం.మీ వ్యాసముగల రంధ్రమున్నది. ఆ రెంటిని జత గూర్చగా ఆ రెండు భాగములును ఒకే గంటాకారపు (బెల్ జార్) రాగిపాత్ర భాగములు రెండును బాగా చిలుముపట్టి యున్నవి. పైభాగపు క్రిందియందు అంపపుపళ్ళవలె శిథిలమైనది. మధ్యభాగమున (విడదీయుటలో గలిగిన దెబ్బవలన) సొట్ట యేర్పడినది. అడుగు మట్టున పెద్ద ఆవగింజలవలె చిన్న చిన్న రంధ్రములు 3, 4 గలవు. ఆ పట్టి లోపల బరికింప చిన్న నైలాను బొత్తాముపరిమాణము (1 సెం.మీ) లోపుగల 3, 4 దట్టమైన చిలుము గుర్తులున్నవి. అవి ఆనాడు ఆ భరణి యందించిన వస్తువుల చిలుము చిహ్నములు. క్రిందిపట్టు 24 గ్రా. పైభాగము 16 గ్రా. మొత్తము 40 గ్రా. బరువున్నది. అందుపై 1956 బౌద్ధ సావనీరునందును తెలుగు భాషా సర్వస్వము 3 భాగము మొదలగు వానియందు ఇది బౌద్ధ స్థూపములందు లోపలి భాగమున క్రిందుగా నుంచిన బౌద్ధ కరండములుగా గుర్తింప వీలైనది. ఈ కరండములను మరలపెద్ద కరండమునను వాటిని మట్టిపాత్రల యందును నిక్షేపింతురు. ఆ మట్టిపాత్రలును దొరికినవికాని యీ కరండమందలి ఆ తథాగతుల స్మారక చిహ్నములు మాత్రము మట్టి గలిసినవి. అది చాల దురదృష్టకరము:- ఏమన బౌద్ధ స్థూపము అడుగంట అణగారినగాని ఇట్టి కరండము బయటపడదు. అందున్న వస్తు సముదాయము, ఆ

పాత్రలు నిక్షిప్త విధానము ననుసరించి కాల నిర్ణయము చేయ వీల గును. అట్టిది వ్యంగ్యమైనది. కాని వెనుక సిద్ధార్థ వినాయక ప్రతి మలను బట్టియు, స్థూపము నందలి కరండమునుబట్టియు నది క్రీస్తు **శతాబ్దమునకు జెందిన** కాలపుదని దోచును.

**అంతియేగాక "భారతి"** మాసపత్రిక 1971 డిసెంబరు 43 సంపుటము 12 సంచికలోని "సిరిపోడిపూన్దిత్రామ శాసనము" అయిదవతేకు మొదటి పుటపు 94 పంక్తి ఎల్లలు (సీమావిభాగము) ఉదహరించుటలో "జినయు సీమము మార్తట్ట దాంక కడపొలమున" అని యుదాహరింపబడినది. అది 95వ పంక్తిలోనే 'దుల్ల పొలగరుసు' అని యున్నది. కావున పూర్వకాలమున (అనగా క్రీ. శ. 1018కి పూర్వమునందే) ఆ దుళ్ళ గ్రామమున 'జినయు, మార్తట్టము' అను నొక ప్రసిద్ధ ప్రదేశమున్నది అని ఋజువగుచున్నది. అందు "జినయు" అను పద మాలోచింప అమర సింహుని నిఘంటువున "సమస్త భద్రో భగవాన మారజిత్ లోకజిత్ జినః" అని యున్నది. కావున "జినుడు" అనగా బుద్ధదేవుని రూఢి పదము. ఆ ప్రదేశము "మారట్టము"ట. దానిని విచారించవలెను. "అట్టము" అనగా పరమ పవిత్రమైన వేదవిభాగము. అది వేద - హైందవమత సాంప్రదాయము. అయితే ఇందు "మారట్ట"ము అనుటచే (మారు+అట్టము- మారు = వేరొక, అట్టము = పవిత్రమైన వేదమువంటి విభాగము అగుచున్నది. ఆనాడు వేదమతమునకు ప్రత్యర్థిగా నిలిచినది. బౌద్ధ మతము. వారిపవిత్రమతగ్రంథములు 'త్రిపిటకములు'. అయ్యదియే మారట్టము అని ద్యోతక మౌతున్నది. అనగా పూర్వమొకప్పుడు బౌద్ధ మత పవిత్ర గ్రంథములైన త్రిపిటకములను భద్రపఱచి సంరక్షించి మతప్రచారము గావించిన ప్రసిద్ధ బౌద్ధక్షేత్రమైయుండుట తథ్యము. అందువల్లనే యీ గ్రామమున నేడీబౌద్ధ చిహ్నములు బయల్పడినవి. అంతేగాక యీ గ్రామము పరమ పవిత్ర గోదావరి (గౌతమీ)కొలి పాయయగు "తుల్యానదీ"తీరము 'ఆదిషడ్బిస్తులా తుల్యా" అను సార్థక నామముగల దౌటచేతనే ఉభయ మతముల వారును దాని పొడవునను ఆక్రమించి తమ తమ పుణ్యక్షేత్రముల నెలకొల్పిరి. అందుకు తగినట్లుగనే ప్రక్కనున్న ఏడిద గ్రామ మందు పెద్ద బుద్ధ విగ్రహము, బౌద్ధవిహార చిహ్నములుగ విశాల మైన ఇటుక పునాదులు, నిలువులోతున నల్లని గచ్చుగల విశాల భవన ప్రదేశమున వివిధ ఆయుధములు 50 ఏండ్లనాడు దొరికినవి. ఆ ప్రక్కనే "సంగమేశ్వరము" అను శైవ పుణ్యక్షేత్రమున పుష్కరిణివద్ద నేటికి "బుద్ధ పాదములు" గల శిలాఫలకము రామ పాదములను పేర నిలిచియున్నవి.

మురమండ గ్రామమున రావిచెట్టులో నగమువరకు నిలిపి యున్న 'నాగరాణి' విగ్రహమున్నది. నవాబుపేట గ్రామమున 'నాగరాజు' విగ్రము లభింపగా అది నేడు రామచంద్రపురము వి. యస్. యం. కాలేజి రిజిష్టరు మ్యూజియమునందున్నది.

దీనికి సంబంధించినదే సుమారు 1 మీ. ఎత్తుగల పాషాణ బుద్ధవిగ్రహము (వెనుక వైపు పీఠఫలకము నందారు వైపుల సింహ దండములుగల) గుమ్మనేరు పబ్లిక్ రోడ్‌ను చేరిన యొక ఆధునిక కట్టడము (గుడి) యందున్నది. దానిని గమనింప ఈ ప్రదేశమంతయు నాడు బౌద్ధ వాటికయే యనక తప్పదు. అందువలననే నదీ తీరమలందు చాలవరకు ప్రతి చోటను బౌద్ధ క్షేత్రములు, శైవ పుణ్యక్షేత్రములు ఒకదానినొకటి ఒరసికొని దర్శనమిచ్చుచుండును. "సప్తగోదావరి సంగమమున "అనంతారామమున" హరిహర దేవులకు హవిర్బలులుగా" అని యొక శిలా శాసనము గాన వచ్చుచున్నది. ఇదివరలో సామాన్యముగా పంచారామములే అంద రెఱిగినవి. కాని అంతేగాక ఇంకను బౌద్ధారామముల గలవని దీని మూలమున ఋజువగుచున్నది. ఈ బౌద్ధారామము "అనంతారామము" అనియు అది "సప్త గోదావరి సంగమున" గలదని విశదీకరించుచున్నది. "సప్తగోదావరము" అన నేడు మనముచ్చరించు సప్తగోదావరియే. అది కేవలము ద్రాక్షారామమునందుగల చెఱువు (భీమదేవుని పుష్కరిణి) మాత్రమే కాదనియు రాజమహేంద్రవర పుటుత్తర భాగమునగల వీరభద్రశైలమునుండి ద్రాక్షారామమునకు గవ్యూతి తీరమునగల (నేటిమాసనబాదా-భీమక్రోసపాలెము)భీమేశ్వరమువరకును సుమారు ఇరువదిమైళ్ళు ప్రవహించిన పుణ్యస్రవంతి. (దానికిని శాసనాధారములు గలవు.) అఖండ గోదావరినుండి ఏక ముఖమున తుల్య ఆత్రేయ, భరద్వాజలు ప్రవహించి ఈ దుళ్ల సమీపమున విభాగములై ప్రవహింపసాగినవి. వీటితోనే కౌశిక నుండియు ప్రవహించివచ్చిన సప్తగోదావరము దానికి సమీప మందున్న ఏడిద సంగమేశ్వరము సప్తముని సింధు సంగమేశ్వ రము అనుపేరున తుల్యానదితో సంగమించినది. కావుననే తుల్యా సంగమేశ్వరము - సప్తముని సింధు సంగమేశ్వరులు సప్త గోదావర సంగమము అనుపేర్లు పేరుకెక్కినది. అందుచే ఆనాడు ఈ శిలా శాసనకాలమునకును "అనంతరామము" అను పేరున బౌద్ధా రామముగా నున్నట్లు గోచరించుచున్నది. ఆనాడు బౌద్ధము అశో

కుని కాలమందే దక్షిణా పథమునకు వ్యాపించియున్నట్లు చరిత్ర గానవచ్చుచున్నది గదా అయితే నిది బౌద్ధ క్షేత్రమనుటకు సందేహములేదు. రాజమండ్రి-సమాచారమ్ 25 - 1956-81 రజితోత్సవ ప్రత్యేక సంచిక 97వ పే. "రాజమహేంద్రిలో బుద్ధునివంత మ్మూదీ" అను వ్యాసమును బరికింపగా "కళింగ రాజధాని గంజాముకు 233 నుండి 250 మైళ్ళ దూరములోనున్నదని అది గోదావరీ తీరములోనున్న సముద్రి తీరములోనున్న కోరంగి కాని, గోదావరి తీరంలోనున్న రాజమహేంద్రిపుని కావచ్చునని పేర్కొన్నారు. క్రీ. శ. 750 ప్రాంతంలో వేంగిరాజు కళింగనుజయించి తన రాజధానిని వేంగినుండి రాజమహేంద్రికి మార్చినాడు.

* * * *

బుద్ధుడు మరణించిన తరువాత ఆయన విజయదంతము ఒకదానిని కళింగదేశానికి తీసికొనివచ్చి బ్రహ్మదత్తుడనే రాజ్యాధినేత దాన్ని భద్రపఱచినాడు. ఆ దంతం భద్రపరచబడిన పురం "దంతపురం." అది ఒక గొప్పనదీ తీరంలో యీ దంతపురమున్నది. అది గోదావరియని ఖచ్చితంగా చెప్పవచ్చును.

* * * *

బుద్ధభగవానుని దంతం పరిరక్షింపబడిన దంతపురం మనపట్టణమే (రాజమండ్రి) అయితే ఆదంతము తప్పనిసరిగా ఒకకొండలో భద్రపఱచియుండాలి అని వ్రాయుచున్నారు. ఈ దంతకధనమే సరియైన దైనచో పవిత్ర గౌతమీ తీరపు రాజమండ్రికిని, తుల్యాతీరమందలి దుళ్ళ గ్రామమునకును, సప్తగోదావరి తీరమందలి ద్రాక్షారామమునకును, సముద్రతీరమందలి కోరంగికిని, కళింగదేశమందలి మహేంద్రి పర్వతమునకు గల దూర వ్యవస్థ ఇంచు మించుగా సరిసమానమే గాని వ్యత్యాసము గానరాదూ. ఈ స్థలములందెచ్చటను ఇట్టి ఇంత పవిత్ర చిహ్నమైన బౌద్ధ కరండ మింత వరకు గానరాలేదు. పై నుదహరింపబడిన లక్షణము లన్నియు నిచ్చటనుగాన వచ్చునవి. కావున ఆ పవిత్ర బుద్ధ విజయ దంతము భద్రపరుపబడిన ప్రదేశము 'జీవయు - మారత్తము' అను శాసన ప్రసిద్ధిగాంచిన తుల్యా తీరమునందలి దుళ్ళ" యేల కాకూడదు. కాకున్న ప్రాంచమందలి ఖ్యాతినంది పంచారామముల మిగుల ప్రసిద్ధికెక్కి సప్త గోదావరి పుణ్య స్రవంతీ తీరమునగల నేటి శైవ పుణ్యక్షేత్రమైనాడు డాకిరేపుగా (బౌద్ధుల కాలమున) దక్షారామమను పేర బరగి తూర్పుసముద్రప్రాంత సమీపముగానున్న ద్రాక్షారమేల కాకూడదు. నేటికిని ద్రాక్షారామమున బౌద్ధక్షేత్ర పశేషములు లభించుచున్నవి. కావున కోవిదులును చారిత్రికులును ఎంతేని పరిశీలింప వలసిన బాధ్యతగలవని నా మనవి. అట్లుగాకున్న భావితరముల వారికి చారిత్రికలోపమేర్పడి తీరని (లోటు) అపచారము గలుగ గలదని సవినయముగా నా మనవి.

నేను దుళ్ళ గ్రామమున దొరికిన బౌద్ధ-తామ్ర - కరండము ఛాయా త్రమును ఈ వ్యాసమునకు జత చేర్చి ముద్రించుటకై బంపించుకొనియున్నాను. ఈ బౌద్ధ - తామ్ర - కరండము నేను రామచంద్రపురము - వి. యస్. యం. కాలేజి రిజష్టర్డ్ మ్యూజియములో భద్రపరచడమైనది.



# కలగూరగంప

## సుమగర్భంబుల తేనె!

సుమగర్భంబులఁ దేనె, నిండు నెలలన్ జ్యోత్స్నామృతం, బబ్ద గ
ర్భములన్ నీరము, శాలిగర్భముల క్షీరం, బాల యాపేన గ
ర్భములన్ స్నిగ్ధపయస్సు, వేణుజగర్భంబందు నుద్గీథ, మ
బ్రముగా గుండియనైన లోతు లుబికింపన్, వేణుగోపాలకా!

సుప్రసిద్ధ కవి పండితులైన శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు రసప్రసర ర్భరంగా ఇటీవల తాము రచించి ప్రకటించిన శ్రీ వేణుగోపాల శతకం వారి భక్తిని, వైరాగ్య సంపదను, ఆధ్యాత్మిక భావనా పరిపూత చేతస్సంజాతమైన స్థితప్రజ్ఞత్వాన్ని బహుధా వెల్లడిస్తున్నది. అంతర్ముఖుడైన కవి తన జీవిక యందలి ప్రతి నిముషాన్ని తాత్వికుడై పరిశీలించును. తనను తాను త్రవ్వుకొను కవి తన స్మృతి పరంపరలనుండి వైరాగ్యము, పశ్చాత్తాపము, ఆర్తి మొదలైన ఆంతరమైన భావనలు వెల్లడించును. ఐహిక జీవితమున విరసుడైన కవి కానీ కావ్య ప్రపంచమున సరసుడు కాలేడు. ఆ సరసత్వమును సంతరించుకొన్న వాడే పరమ తత్వమును కాంచగలడు. అతడే ద్రష్ట, స్రష్టయును! నేను చెప్పేది తుచ్ఛమైన శృంగార వర్ణనా బంధుర ప్రబంధములల్లు కవుల గూర్చి కాదు సుమా! పారమార్థిక ఫలాభ్యున్నతికై ప్రాకులాడుచు, ఐహికమునకు రోసి, జ్ఞాన యజ్ఞ తప్తులైన తత్వచింతనగల కవులఁ గూర్చి మాత్రమే!

మల్లంపల్లి వారు ఐహిక భోగ భాగ్యములకై వెంపర లాడెడి వారుకారు. తమ జన్మాంతర పుణ్య సంస్కారముచేత పరబ్రహ్మ తత్వాన్ని మథిస్తున్న ధన్యులు. సారస్వత గాంగ ఝర నిత్య స్నాత. పూర్వ మహా కవులతో ఆంతరంగికమైన అక్షర మైత్రి గలవారు. వారి శతకంలో తమ ఆధ్యాత్మిక తాపం అంతా వ్యక్తం చేసారు.

"తెరలెత్తన్ పయిదింప రేబవళులెంతే, ఘూర్ణమానార్ణవాం
తర మందీ దెసలేని నావచన, నానాద్వీపముల్ వోలె ద
వ్వరుగన్ శైశవ యౌవనాదు, లదె, సాయాహ్నంబు నంతంత ద
గ్గఱియెడిగ్గురులయ్యె గుండియ, పరంగా! వేణుగోపాలకా!"

జీవుని యొక్క నిరంతర ప్రస్థానం సాగుచున్నది. సంక్షుభితమైన సంద్రంలో దిక్కులేని నావవలె. రేయింబవళ్ళులే తెరచాప నెత్తుటయు, దింపుటయునుగా, నెమ్మదిగా శైశవ యౌవనాదులనే ద్వీపాలు దాటిన నావకు ఇంకను గమ్యంచేరలేదు. అంతలోనే ప్రొద్దు పడమరకు వ్రాలుచున్నది. ఇది చూచిన జీవుని గుండెలు దిగ్గుమన్నవి. భావింపగా మనకే ఒళ్లు జలదరిస్తున్నది కదా! కవి ఆత్మీయంగా చెప్పుకున్న విషయమే అయినా ఇది సార్వజనీనమైన జ్ఞానుల యొక్క భయమే! వేణుగోపాలుణ్ణి "పరంగా" అని పిలవడం ఇక్కడ ఒక గొప్ప చమత్కారం!!

ఇంద్రియములు విషయలోలత్వంలోపడి జీవుడు అజ్ఞానాంధకారంలో తలబంటి మునిగి పోతాడు. ఏ ఇంద్రియ నిర్వ్యాపారత్వమును సాధించడంవల్ల శుద్ధ చైతన్య ప్రకాశం దర్శనమిస్తుందో ఆ వెలుగు ఒకటి ఉందనే స్పృహ కూడా పోతుంది. విషయ లంపటంలో మునిగిన జీవునికి లౌకికమైన, మిథ్యా సౌఖ్యములను మరిగి పర్వులు పెట్టే ఇంద్రియాలను మేతకై బహు దూరం పోయి చీకటులలో చిక్కుకొని తెరువెరుగక అల్లాడే ధేనువులతో పోల్చారు. చూడండి ఈ పద్యాన్ని!

సదయా! ఇంద్రియధేనువుల్ విషయఘాసగ్రాసలోలమ్ములై
బ్రదుకుంబీడులబట్టి నిన్ మఱచి పోవంబోవ ప్రాయంపుప్రొ
ద్దదె! డిందన్, పయిగ్రమ్ము చీకటులలో నల్లాడవే, సుంత, నీ
మృదువౌ మోవిని పిల్లగ్రోవి నిడవేనీ, వేణుగోపాలకా!

శతకంలోని భావములు ఎక్కడినుండీ ఎరువు తెచ్చుకొన్నవి కావు, పదబంధాలు పేనికీ అను సరణలుకావు. అన్నీ స్వంతములు. మాధుర్య రేఖా ప్రభావంతములు. ప్రతి పద్యంలోను మల్లంపల్లి వారి స్వీయముద్ర ఉన్నది.

నవనీత ప్రియ! నీదు తెంబెదవి పైనన్ కజ్జ లాంకంబులే
లవలీపల్లవ గల్ల! మీగళమునెల్లన్ కంకణాంకంబులే
నవకా మీయురమెల్లెడన్, శివశివ, శ్యామా పదాంకంబులే
విపులంబు జెక్కులిపై నఖాంకములెవో, శ్రీవేణుగోపాలకా!

గోపికా బృందముతో విహరించే స్వామిని అంతస్సన్నిధి కల్పించుకొని వర్ణించారు పై పద్యంలో. జగన్నాటక సూత్రధారి, శృంగార కళారహస్య వేత్త అయిన శ్రీ కృష్ణుని వక్షస్థలంపై చిహ్నితమైన గోపికా పాదముద్రల్ని చూచి, వెలిగంది, చెప్పె

టకు క్షణం సంశయించి 'శివ శివ' అన్నారు నెమ్మదిగ అయినా తప్పదు కదా చెప్పేసారు. "శ్యామాపదాం కంబులే" అని. ఏమి అన్నా స్వామివారిది ఒక్కటే సమాధానం. వారన్నట్లుగా "మంద స్మేరముఖారవిందం."

వేణుగోపాలుని యెడల ఏతత్కవి చేసిన సంబోధనలు ఆలంకారిక శోభతో మెరయు చుండుటయేగాక, ఆత్మీయములై, హార్దములై, స్వామివారి యెడల వారికి గల ప్రపత్తిని తెలియ జేయుచున్నవి.

> శ్రిత పింఛేంద్రి ధనుస్సమంచిత! కృపాసించన్నవాంఛఃకణ
> ప్లుత పృథ్వీ నవగంధ బంధుర ! దిశాపుంజీ ఛవత్ పారణ
> వ్రత కృచ్ఛాతక వద్వీ నీతజన ! గోపాలాంగ నాపాంగ ని
> ర్మిత విద్యుద్వలయాంబుదాంచిత వపుః శ్రీ ! వేణుగోపాలకా!

ఇంతేగాక, శతకంలో ఎడనెడ, పింఛనవమౌళీ, శరదబ్జాక్ష, నీలద్యుతీ, శమితార్తీ, చిరబంధూ, కేళీకృతా జాండ ! మొదలైన సంబోధనలు భక్తులకు స్వామి వారి విరహతాపాన్ని ఎడలించుటకు సమర్థములై దర్శన మిస్తున్నవి.

> "మతినే యత్నము లేదహో సహజమౌ మాంధ్యమ్మె బోధంబనన్
> సతమీ జీవితమిట్లుసాగెడు యదృచ్ఛా ప్రాప్త భోగంబె, యా
> యతి, నీ యైహిక మెట్టులైనను ప్రభూ! అముష్మికంబందు వం
> చితమైనన్ తెరువెట్టు లంచితదయా ! శ్రీవేణుగోపాలకా !!

శరభయ్యగారి లౌకిక జీవితమునకు అద్దంపట్టే పై పద్యం శతకంలో ఒక మేలురాయి. వారిది యదృచ్ఛా ప్రాప్తభోగం ! ఆశకు ఆయనకు ఆమడదూరం.

ఈ సకలమైన ప్రపంచము మాయయే. జీవులందరూ మాయావశులే. పరమేశ్వర లీలావిలాసమైన ఈ మాయను తరించ వలెనంటే జీవుడు పరమేశ్వరుడే కావాలి. అందుకే ఈ సుఖదుః ఖాల్ని, భవబంధాల్ని, బుద్బుదప్రాయమైన భోగ భాగ్యాల్ని తృణీకరించి, "నిష్ఫుర జాగ్రిత్ పరిపూర్ణ నిష్కల పరబ్రహ్మై క్యాన్ని కాంక్షిస్తాడు జ్ఞాని. ఆ ఆర్తితోనే ఒకచో అంటారు గదా శరభయ్యగారు-

> భువి నే యర్థములైన నిన్నునడుగంబోనయ్య, నాజియ్య, యే
> లవి? యానుశ్రవికంబులేవియును నొల్లన్, జెల్ల,త్వన్నాభిసం
> భవ పద్మప్రభవాదిదివ్యుల కలభ్యంబైన యేకాంత వృ
> త్తివిశేషంబున నన్నుమిమ్ము, శమితార్తీ, వేణుగోపాలకా !

ఆ స్థితికి చేరుకున్న అంతః కరణ కలిగిన వారవడం వల్లే నొకచో 'శివుడవే, శ్రీ వేణుగోపాలకా!' అంటూ శివకేశవాభేదమైన పరబ్రహ్మను దర్శించారు !

ఈ శతకంలో వీరు చేసిన దశావతార వర్ణనలు వినూత్న ములై, అపూర్వములై, హృద్యములై యున్నవి. మచ్చునకొక్క పద్యం. నృసింహావతార వర్ణన

> భరితైనః కటలీ మహాంధ్య భరితంబై యాయస స్తంభ ని
> ర్భరమై పేర్చిన నాహ్వాదంతరమునం బ్రద్ధాంశుభాస్వత్సటా
> భర సంరంభ విజృంభితోత్పతన కుంభద్దంభసింహంబవై
> తెరలన్ రాదె పటాలునన్ నృహరిమూర్తీ, వేణుగోపాలకా !

నృసింహావతారాన్ని ఈ విధంగా స్ఫురణకు తెచ్చే పద్యం! పూర్వసాహిత్యంలో లేదని చెప్పవచ్చు. ఈ విధంగానే మిగిలిన అవతారములను ప్రత్యక్ష వర్ణనచేయక, పరోక్షంగా పాఠకునకు ఆయాయి అవతారాలు స్ఫురించేలా వర్ణించి క్రొంగొత్త త్రోవ తీసారు శ్రీ శరభయ్యగారు. మరొక్కటి.

> వెనుకందోలిన ముందుతోలినను నీవే, మత్తనూస్యందనం
> బున బోధామృత హర్ష వర్షముల సంబోధంబుపై క్రమ్మి పా
> రణసేయింపగ దేఋచున్నవి మనః ప్రాణంబు లల్లంత తే
> జిన పైజూలు విదుల్చువాజులనసిన్ శ్రీ వేణుగోపాలకా !

ఇదీ వారు కృష్ణావతారాన్ని స్ఫురింపించిన తీరు !

ఇలా పద్యాలుదాహరించుకుంటూ పోతే మొత్తం శతక మంతా తిరిగి చెప్పవలసి వస్తుంది. ప్రతి పద్యంలోను భక్తిఉన్నది. ప్రతిపద్యంలోను ఆర్తి ఉన్నది. ప్రతి పద్యంలోను రసముప్పొంగు తున్నది. ప్రతి పద్యంలోను చమత్కృతి ఉన్నది. మనస్సును పట్టి నిలవేసే శక్తి ఉన్నది. రక్తి ఉన్నది. ప్రతి పద్యంలోను వేణుగోపాల నామక పరబ్రహ్మం అక్షరరూపమై దర్శనమిస్తున్నది!

శరభయ్యగారు ఏతత్కృతి నాయకుడైన వేణుగోపాల స్వామిని కృష్ణాజిల్లాలోని వేములమడ గ్రామంలో స్వహస్తాలతో ప్రతిష్ఠించి ధన్యులై, ఈ శతకంలో ఆస్వామిని, ఆసంవిద్రూ పాన్ని, ప్రతి పద్యంలోను ప్రతిష్ఠించి ధన్యతములైనారు. ఆ స్వామివారి ప్రతిష్ఠామహోత్సవానికిగల వెనుకటి కథ అంతయు కృతికి ముందు వివరించబడియున్నది. బహుచిత్రమైన గాథ !

ఈ వ్యాసమునకు శ్రీకారము చుట్టిన దాదిగా ఈ క్రింది పద్యము నామనస్సున ప్రతిధ్వనించుచు నన్ను ప్రలోభ పెట్టు

చున్నది. దీనిని గూడ ఈ వ్యాసమున జేర్చునంతవరకు ఊరు కొనునట్లులేదు.

"నీ వంశీధ్వని వాహినుల్ వరదలై నిండార బ్రహ్మాండముల్
ద్యోవీధిన్ గ్రహతారకాగణము చిందున్ బిందులై బిందులై
జీవాంతర్ హృదయాంబరమ్ము నినదించెన్ స్పందమై
మంద్రమై
నీవేణుధ్వని స్థూలసూక్ష్మములు నిండెన్, వేణుగోపాలకా!"

సుకృతియగు శరభయ్యగారు విరచించిన అఖండ మధు రసాకృతియగు నేతత్కృతి — శ్రీ వేణుగోపాల శతకము, సహృదయ పాఠక రసజ్ఞ భృంగములకు నిజముగ "సుమ గర్భంబుల తేనె" యే!

జయంతి తే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు
లంకలపాలెం

# సోమలదేవి - దాక్షారామ శాసనము

సోమలదేవి దాక్షారామ శాసన విషయమై నాకు కలిగిన సందేహములకు శ్రీ తురగా కృష్ణమూర్తిగారు జులై 1982 భారతిలో దయతో సమాధానమిచ్చినందుకు వారికి నా కృతజ్ఞతలు. వారి సమాధానములు చదివిన పిదప ఈ నాలుగు మాటలు వ్రాయసాహసించితిని.

క్రీ. శ. 1065 నాటి దాక్షారామ శాసనకాలము నాటికి చాళుక్య విజయాదిత్యుని కుమార్తె సోమలదేవి వయసు 30 సం॥ లకు తక్కువ యుండి యుండదని నేను వ్రాసిన దానిని శ్రీ కృష్ణమూర్తిగారంగీకరించలేదు. సోమలదేవి చాళుక్య రాజ రాజ నరేంద్రుని సోదరుని కుమార్తెగనుక, రాజ రాజ నరేంద్రుడు 1019 నుండి 1061 వరకు పరిపాలించాడు కనుక, ఆమె క్రీ. శ. 1035 ప్రాంతమున జన్మించి యుండవచ్చని భావించుట సమంజసమని నా అభిప్రాయమునువెల్లడించినాను. ఈ సోమలదేవియే అనంతవర్మ చోడగంగదేవుని తండ్రియగు దేవేంద్రవర్మకు 'మనో మానస హంసి' గా అభివర్ణింపబడినది అని కూడా నా అభిప్రాయమును వెల్లడించినాను. వీటిని శ్రీ కృష్ణమూర్తిగారు విమర్శించారు.

కళింగ గంగ రాజైన దేవేంద్రవర్మ భార్య రాజసుందరి. ఈమె 'చోడమహీభుజాత్మజ' అని శాసనాలలో చెప్పబడింది. ఈ చోడరాజు ఎవరు? గంగైకొండ చోడుడని 'కళింగదేశచరిత్ర'లో కలదని శ్రీ కృష్ణమూర్తిగారు వ్రాశారు. చాళుక్య రాజ రాజ నరేంద్రుని కుమారుడైన కుళోత్తుంగచోడుడను రాజేంద్రచోళుడని శ్రీ సుందరంగారు వ్రాసిన దానిని నేను పేర్కొన్నాను.

గాంగరాజు సేనలు చోళసేనలని వేంగివద్ద జయించినట్లు తోస్తుంది. ఆ తర్వాత 7వ విజయాదిత్యుడిని వేంగీ సింహాసనం మీద కూర్చుండపెట్టి ఉంటారు. కులోత్తుంగుడు తనకుమార్తె రాజసుందరిని అతనికి ఇచ్చి వివాహంచేసి సంధి చేసుకుని ఉంటాడు. (ది సింహాచలం టెంపుల్ పు. 19లోని వాక్యాలకి తెలుగు)

ఆంధ్రులచరిత్ర - సంస్కృతి (ఖండవల్లి వారి రచన)లో ఈ విషయమై ఇట్లుకలదు.

రాజ రాజ నరేంద్రుని కుమారుడైన కుళోత్తుంగచోళుడు పినతండ్రియగు విజయాదిత్యుని వేంగినుండి పారద్రోలినాడు. "ఇంతలో వీరరాజేంద్రుడైన పశ్చిమ చాళుక్య ఆరవ విక్రమాదిత్యుడు తన భార్య సోదరుని అధిరాజేంద్రుని చోళసింహాసనముపై కూర్చుండబెట్టెను. రాజనరేంద్రకుమారుడు దీకల్లోల సమయమున గొప్ప సైన్యముతో చోళరాజ్యముపై దండు వెడలిపోయెను. రాజేంద్రుడిట్లు చోళ సామ్రాజ్యము నాక్రమించుటకు బోవుటను చూచి కళింగాధిపతి పూర్వగాంగ రాజరాజ దేవేంద్రవర్మయు, చేదిరాజు యశఃకర్ణదేవుడును విజయాదిత్యుని పక్షము వహించి వేంగిపై దండెత్తి వచ్చియచ్చట గాపుండిన రాజేంద్రుని సైన్యము నోడించిరి. రాజేంద్రునకు వారితో దీర్ఘముగ యుద్ధము సేయ వలనుగాకపోయెను. కావున నతడు రాజ రాజ దేవేంద్రవర్మకు తన కూతురు రాజసుందరినిచ్చి వివాహము చేసి విజయాదిత్యుని కామరణ పర్యంతమును వేంగీరాజ్యాధిపత్యము నిచ్చుటకు ఒడబడి సంధి చేసికొనెను." పుట 216

పై విషయములను బట్టి రాజసుందరి చాళుక్య రాజరాజ నరేంద్రుని మనుమరాలని, మరదలుకాదని, తెలియుచున్నది.

శ్రీ తురగా కృష్ణమూర్తిగారు రాజసుందరి గంగైకొండ చోళుని కుమార్తె, రాజరాజనరేంద్రుని మరదలు అని 'కళింగదేశ చరిత్ర'లో వ్రాసిన దానిని అంగీకరిస్తూనే, రాజసుందరి దేవేంద్రవర్మల వివాహము క్రీ॥ శ॥ 1068లో జరిగినదని వ్రాసిరి. రాజరాజనరేంద్రుడు అమ్మంగదేవిని 1020 ప్రాంతంలో వివాహము చేసికోగా అమ్మంగదేవి సోదరిగా చెప్పబడుతున్న రాజసుందరిని ఆ తరువాత 48 సం॥లకు అనగా 1068లో దేవేంద్రవర్మ పెండ్లాడెనని చెప్పుట హాస్యాస్పదము, ఈ విధముగా చూచినను రాజసుందరి రాజరాజ నరేంద్రుని మనుమరాలేకాని మరదలు కాజాలదు.

ఇక సోమలదేవి జననకాల నిర్ణయ విషయము. సోమలదేవి తండ్రి విజయాదిత్యుడు వేంగిసింహాసనానికై రాజరాజ నరేంద్రునితో పోటీపడి 1020 ప్రాంతములో రాజకీయ జీవితమును ప్రారంభించాడు. అప్పటి కతని వయసు అధమము 15 సం॥ అనుకొన్న అతని జననము 1005 అగును. అతనికి సుమారు 30 సం॥ల వయసున కుమార్తె సోమలదేవి జన్మించి యుండవచ్చని నా యూహ. శ్రీ కృష్ణమూర్తిగారి యూహ ప్రకారము 1065 నాటికి సోమలదేవి వయసు 15 సం॥లే అనుకొన్న ఆమె జననము 1050 ప్రాంతమున - అనగా విజయాదిత్యుని 45వ సం॥న అగును, అట్లయినను కావచ్చును.

కాని, దేవేంద్రవర్మ 1070లో పట్టాభిషిక్తుడైనాడు. అతని కుమారుడు అనంతవర్మ 1078లో పట్టాభిషిక్తుడైనాడు. అనంతవర్మ జననం 1070 ప్రాంతమని కృష్ణమూర్తిగారి అంచనా. దీనిని బట్టి పట్టాభిషేక కాలము నాటికి అనంతవర్మ వయసు 8 సం॥లు అగును. 8 సం॥ల వయసుగల కుమారునికి పట్టాభిషేకము చేయవలసిన అవసరము ఏవయసు మళ్ళిన రాజుకో గాని 35-40 సం॥ల ప్రౌఢప్రాయమున నున్న రాజునకు కలుగదు. కనుక కృష్ణమూర్తి గారూహించినట్లు 1070 నాటి పట్టాభిషేక సమయానికి దేవేంద్రవర్మకు 25 సం॥ ప్రాయమనుట చెల్లదు. అప్పటి కతని వయసు 50 సం॥ పైబడి యుండియుండవలెను. అనగా అతని జననము 1020 ప్రాంతమగును. సోమలదేవి అతనికన్న వయసున చిన్నదే.

ఇక్కడ క్రీ. శ. 1108 నాటి ముఖలింగ శాసన విషయం ప్రస్తావించవలసియున్నది. "సోమలమహాదేవీ మనోమానస హంసియా త్రికళింగ మండల పతేః శ్రీ గంగ చూడామణేః" అని ఆ శాసన పాఠము. ఇందులో 'గంగచూడామణి' అన్న పదం ముఖ్యముగా గమనింపదగినది. గంగరాజైన దేవేంద్రవర్మ చోడరాజు కుమార్తె రాజసుందరిని వివాహం చేసుకొన్నందువలన చోడ గంగ వంశాలకు సంబంధం కలిసినది. వారి కుమారుడు చోడగంగుడని స్పష్టముగా చెప్పబడినాడు. సోమలదేవి 'గంగ చూడామణి' మనోమానసహంసి గాని 'చోడగంగు'ని మనోమానసహంసికాదు. కనుకనే నేను సోమలదేవి అనంతవర్మ చోడగంగుని మనోమానస హంసి కాదని, అతని తండ్రియైన గంగ చూడామణి - దేవేంద్రవర్మ - మనోమానసహంసి అని భావించినది.

దాక్షారామ శాసనములో సోమలదేవి తండ్రిపేరే చెప్పబడినదికాని భర్తపేరు చెప్పబడలేదు గనుక అది 'సాంప్రదాయ విరుద్ధము గాదా' అంటూ శ్రీ కృష్ణమూర్తిగారు శాసన కాలము నాటికి ఆమె కన్య అనే భావించారు. స్త్రీ ఎంతటి జగదేకవీరునికి భార్యయైనప్పటికి స్వదేశమున ఆమె ఫలానావారి కూతురనే వ్యవహరింపబడుట సహజము. సోమలదేవి శాసనమును వ్రాయించినది స్వదేశమున కనుక ఆమె ఎవరి భార్య అయినప్పటికి శాసనకర్తలకు బెజయిత దేవుని కూతురే. భర్తపేరు లేనంత మాత్రమున ఆమె అవివాహిత అని చెప్పబూనుట సరికాదు.

ర్యాలి శాసనములోని 'సంతాన బలాయురారోగ్య వృద్ధ్యర్థం' అన్న పదబంధానికి 'విజయాదిత్యుని కుటుంబములోని ప్రతివ్యక్తి బలాయురారోగ్య వృద్ధ్యర్థం' అని అర్థము చెపుతూనే శ్రీ కృష్ణమూర్తిగారు 'ప్రత్యేకముగా యువరాజు ఆయురారోగ్య వృద్ధినిమిత్తమాదాన ముద్దిష్టమైయున్న'దనుట వింత. "మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారిక" అను సమాసము క్రీ. శ. 11, 12 శతాబ్దములలోని అనేక శాసనములలో దాదాపు పదికట్టు పదంగానే ప్రయోగింపబడినది.

ఇక పంచ బ్రహ్మోదయ భాష్యములో చెప్పబడిన రాజమందిరము రాజమహేంద్రవరమే అని శ్రీ కృష్ణమూర్తిగారు సెలవిచ్చినారు. రాజమహేంద్రవరము రాజమందిరమై రాజమండ్రియై రాజమండ్రిగా మారి యుండవచ్చును. పంచబ్రహ్మోదయ భాష్యరచనా కాలమును కృష్ణమూర్తిగారు తెలియజేయలేదు. ఆ గ్రంథ రచనా కాలము క్రీ. శ. 1100 తరువాతనే గదా ! ఆ కాలమున రాజమహేంద్రవరము రాజమందిరముగా ప్రసిద్ధిజెంది యుంటే అది ఆపేరున ఆనాటి ఇతర సాహిత్య గ్రంథములలోను, శాసనముల లోను కన్పించవద్దా ? రాజమహేంద్రవరములో కొన్నాళ్ళు నివసించిన శ్రీనాథుడు కూడా కాశీఖండ భీమఖండములలో దానిని రాజమహేంద్రమనే పేర్కొనినాడు కాని రాజమందిరమని పేర్కొనలేదు. కనుక పంచబ్రహ్మోదయ భాష్య రచనాకాలము నాటికి రాజమహేంద్రవరము రాజమందిరముగా ప్రసిద్ధి చెందియుండలేదు. ఆ గ్రంథ శ్లోకములలో చెప్పబడిన రాజమందిరము రాజమహేంద్రవరము కాదు.

శ్రీ సూర్యదేవర రవికుమార్

కొల్లూరు

# తెలుగు చుట్టం జె. పి. ఎల్. గ్విన్

ఇంగ్లాండులో నేను కలుసుకున్న ఆంగ్ల ప్రముఖులలో శ్రీ జె. పి. ఎల్. గ్విన్‌గారు చిరస్మరణీయులు. ఈయన తెలుగు నాట చిరపరిచితులు. తెలుగుదేశంలో ఐ. సి. ఎస్ ఆఫీసరుగా, విద్యాశాఖ కార్యదర్శిగా, రెవెన్యూ బోర్డు సభ్యులుగా పనిచేశారు. తెలుగునేల పల్లెలూ, పట్నాలూ తిరిగి, తెలుగువారిమీదా, తెలుగు భాషమీదా ముఖ్యంగా జనం మాట్లాడే వాడుక భాషమీదా మక్కువ పెంచుకున్నారు. ఉద్యోగం విరమించాక స్వదేశం ఇంగ్లాండు తిరిగి వెళ్ళి బ్రోమ్లీలో స్థిరపడ్డారు. బ్రోమ్లీ లండన్ నగరానికి పదకొండు మైళ్ళ దూరంలో వుంది. సుప్రసిద్ధుడైన ఇంగ్లీషు రచయిత హెచ్. జి. వెల్సు పుట్టి పెరిగిన చోటు ఇది. ఇక్కడే వుండి శ్రీ గ్విన్ తెలుగుభాష కోసం పాటు పడుతున్నారు. వాడుక భాషకి వ్యాకరణం రాశారు. అది అచ్చులో వుంది. ఇప్పుడు వాడుక భాషకి నిఘంటువు నిర్మించే పనిలో నిమగ్నులై వున్నారు.

ఎన్నదగిన మనీషి గ్విన్‌గారు. తొణకని నిండుకుండ, తేనె మనసు. నెమ్మదీ, నిరాడంబరం, సౌజన్యం మూర్తీభవించినఆయన నిండు విగ్రహం ఎదుటివాళ్ళని ఇట్టే ఆకట్టుకుంటుంది.



జె. పి. ఎల్. గ్విన్

నేను లండన్‌లో వున్న నాలుగైదు నెలలలో ఆయనా నేనూ ఎన్నోసార్లు కలుసుకున్నాం. ఎన్నో విషయాలు కలబోసుకున్నాం. తెలుగు మాటలగురించి – ముఖ్యంగా ఆయన కూరుస్తున్న తెలుగు వాడుక మాటల నిఘంటువు గురించి ఎంతో చర్చించుకున్నాం.

శ్రీ గ్విన్ తరుచు లండన్ వచ్చేవారు. ఓ మారు తమ ఇంటికి బ్రోమ్లీ పిలిచి విందుచేశారు. నన్ను ఆక్స్‌ఫర్డ్ తీసుకు వెళ్ళి, ఆయన చదివిన యూనివర్సిటీ అదీ చూపించారు. ఇక్కడే తెలుగు వాడుక భాషకి ఇంగ్లీషులో వెనుక నిఘంటువు రాసిన గిల్లెట్ దొర ఇంటికీ వెళ్ళాం. లండన్ ఇండియా ఆఫీసు లైబ్రరీకి కూడా నన్ను గ్విన్‌గారే తీసుకువెళ్లారు. ఆయనతో మాట్లాడడం ఒక తృప్తినీ, ఉత్సాహాన్నీ కలిగిస్తాయనడంలో సందేహంలేదు.

లండన్‌లోని 'ఈ తెలుగు చుట్టం' గ్విన్‌గారిని తెలుసుకోడం భాషాభిమానులైన తెలుగు వారందరికీ సంతోషం కలిగించకపోదు. పైగా అది మన కనీసధర్మం కూడా. అందుకని ఆయన స్వీయ చరిత్ర విషయం అడిగాను. ఆయన ఇలా చెప్పారు.

"నేను 1916 జూన్ 2? తేదీని లండన్‌లో పుట్టాను. డబ్లిన్‌లో ఐర్లాండులో చదువుకున్నాను. డబ్లిన్ యూనివర్సిటీలో ఎం. ఏ. (క్లాసిక్సు) పరీక్ష పాసయాను. మా తండ్రిగారు 1905 నించి 1919 వరకు ఐ. సి. ఎస్ ఆఫీసరుగా పనిచేశారు. యుద్ధ కాలంలో లండన్ నౌకాదళ కార్యాలయంలో పనిచేశారు. 1919లో ఇండియా వెళ్ళి వొక సంవత్సరం వుండి వచ్చేశారు. వారితో నేనూ వెళ్లాను. అప్పటికి నాకు మూడేళ్ళు. మేం వెళ్ళిన మచిలీపట్నం నాకు గుర్తులేదు. కాని మద్రాసు ఇలియట్సుబీచి జ్ఞాపకముంది.

"నేను 1939లో సబ్‌కలెక్టర్‌గా ఇండియా (తెలుగుదేశం) వెళ్లాను. తరువాత కలెక్టరుగా పనిచేశాను. మొదట బళ్లారిలో ట్రెయినింగు అయాను. 1941లో బళ్లారిలోనూ, 1943లో హోసూరులోనూ పనిచేశాను. 1950 వరకూ తమిళ జిల్లాలలోనూ, మలయాళం మండలాల్లోనూ పనిచేసి, తమిళం, మలయాళం నేర్చుకున్నాను, కాని మరిచిపోయాను.

"1950–'52 పశ్చిమ గోదావరిజిల్లా (ఏలూరు) కలెక్టరుగానూ 1953–'56 వరకూ విశాఖపట్నం జిల్లా కలెక్టరుగానూ వున్నాను. అప్పుడే వొక మాసం శ్రీకాకుళంలోనూ, ఆరుమాసాలు గుంటూరులోనూ పనిచేశాను. 1956 నుంచి 1967 వరకు ట్రాన్స్‌పోర్ట్ కమిషనరుగానూ, ఎడ్యుకేషన్ సెక్రటరీగానూ, రెవెన్యూబోర్డ్ మెంబరుగానూ హైదరాబాద్‌లో వున్నాను. 1967లో రిటైరై లండన్ వచ్చేశాను.

"నేను ఐ. సి. ఎస్ పరీక్షకి తయారయే ముందు 1938 ప్రొబేషన్ కాలంలో ఆక్సుఫర్డు యూనివర్సిటీలో తెలుగు నేర్చుకున్నాను. అప్పుడు తెలుగు కష్టమైన భాషగానే తోచింది. అయినా ఎందుకో అదినన్ను ఆకర్షించింది. ఆక్సుఫర్డులో ఎన్. రామారావు అని వొకాయన నాకు తెలుగు నేర్పారు. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో హిందీ, బెంగాలీ, గుజరాత్ భాషలకు ప్రొఫెసర్లున్నారు. తెలుగుకిలేరు. ఏమైతేనేం ఉద్యోగరీత్యా తెలుగుజిల్లాలకు వెళ్ళే దాకా తెలుగు కృషికి అవకాశం లేకపోయింది నాకు.

"బళ్ళారిలో నా క్యాంప్‌క్లార్కు కంపిలి కృష్ణమూర్తిరావు నాకు తెలుగు నేర్పారు. ఇతరభాషలు నేర్చుకోడమంటే ప్రత్యేకమైన శ్రద్ధకూడా వుందినాకు. అయితే ఇండియా భాషలలో తెలుగు వొక మంచి ప్రధానమైన భాష. అందుకని దానిలో నేను ప్రత్యేకమైన కృషిచేశాను.

"తెలుగుదేశం తిరిగి చూడాలని నాకు తొలినించీ కోరిక వుండేది. అది నేను రెవెన్యూబోర్డు మెంబరుగా వున్నప్పుడు నెరవేరింది. బారువా నించి కల్యాణ దుర్గం, అదిలాబాద్ నించి సూరుపున శ్రీహరికోట వరకు డ్యూటీమీద తిరిగాను. పల్లెలూ, పట్టణాలూ చూశాను. ఒక్క రాష్ట్రంలో ఇంత వైవిధ్యం వుండడం, అందమైన రకరకాల ప్రకృతి అవుపడడం చిత్రమనిపించింది. కోస్తానించి లోపలికి వెళుతూ వుంటే ఎన్నో మార్పులు కనిపిస్తాయి అడుగడుగునా. చారిత్రకమైన ప్రాధాన్యం ప్రతి చోటా ప్రత్యక్ష మవుతుంది. నాగార్జున కొండ, గోల్కొండ, వరంగల్ మొదలైన చారిత్రిక ప్రదేశాలు నన్ను బాగా ఆకర్షించి, పరవశపరిచాయి. పురాతత్వ శాఖలోని వొకరి సాయంతో నాగార్జునకొండ పరికించాను. మంత్రులతో సంచారం చేసి మరింత కొత్త అనుభవం సంపాదించాను. ఉదయం ఏడుగంటలు మొదలు రాత్రి తొమ్మిది గంటల వరకూ ఆగకుండా పర్యటించేవాణ్ణి. డా. బెజవాడ గోపాలరెడ్డి గారితో వూరూరూ తిరిగి తెలుగు సీమ చూశాను. ప్రజల ప్రతిపాదనలు విన్నాను. ఆ దినాలు ఎంతో ఉల్లాసంగా గడిచాయి. నరసాపురంలో కొత్త సినిమాహాలు ప్రారంభం నాడు సినీతార వైజయంతి నాట్యం చూశాను. ప్రతి చోటా ఆప్యాయంతో ఆదరించే తెలుగు ప్రజల మధుర ప్రకృతి చవి చూశాను. తెలుగువారు సరళ స్వభావులు. ప్రగతి కాముకులు.

"మధురమైన తెలుగుభాష మరుపురానిది. గ్రాంథిక భాష మీద కంటే తెలుగు జనం మాట్లాడే వాడుక భాష మీదే మక్కువ కలిగింది నాకు. నేను విశాఖపట్నంలో వున్నప్పుడు ముఖ్యంగా డా. భద్రిరాజు కృష్ణమూర్తి వాడుక భాష మీదనాకు శ్రద్ధ కలిగించారు. తెలుగుభాషని "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అంటారు. ఈ మాట మొదట ఎవరన్నారో నాకు తెలియదు, కాని ఆ మాటమాత్రం నిజం.

"తెలుగు వాడుక భాషకి సరైన వ్యాకరణం లేదు, నిఘంటువూ లేదు. ఇవి అవసరమని భావించి, నేను ఆపనికి పూనుకున్నాను. వ్యాకరణం పూర్తి చేశాను. ముప్ఫయి అధ్యాయాల నాలుగువందల పుటల పుస్తకం అది. డా. భద్రిరాజు ఎంతో సహాయం చేశారు దానికి. ఆయన సాయంతోనే నిఘంటువు తయారు చేస్తున్నాను.

"అడపా దడపా నేను ఇండియా వెళ్ళి వస్తున్నాను. హైదరాబాద్ తెలుగు మహాసభలకి పిలుపు వచ్చింది. వెళ్ళి వచ్చాను. నేను తెలుగుదేశంలోనే పెళ్ళి చేసుకొన్నాను. నా ఇల్లాలు పేరు పెగీసత్తూర్. ఇండియాలో - తెలుగుదేశంలో ఎంతో మంది స్నేహితులున్నారు నాకు. ఇప్పుడు కూడా నేను ప్రత్యేకించి తెలుగు చరిత్ర అధ్యయనం చేస్తున్నాను.

"స్వీయ చరిత్ర రాయమంటున్నారు మీరు. దాని కంటే ఇప్పుడు నేను చేస్తున్న తెలుగు పని ముఖ్యం అనుకుంటున్నాను నేను. ఇది సక్రమంగా నెరవేరిందంటే చాలు. అదే నాకు సంతోషం.

"నా జీవితకాలంలో నాకు వచ్చిన వుత్తరాలూ, నేను రాసిన వుత్తరాల నకళ్ళూ, ఇంకా ఎన్నో రిపోర్టులు - అన్నీ కేంబ్రిడ్జి యూనివర్సిటీలో సౌత్ ఏషియన్ స్టడీస్ ఆర్కైవ్స్ వారికి ఇచ్చేశాను."

మన 'తెలుగు చుట్టం' గ్విన్ గారికి తెలుగునాడు ఏనాడూ రుణపడే వుంటుంది.

పురిపండా అప్పలస్వామి
విశాఖపట్టణం.

## లేఖలు

'82 సెప్టెంబరు "భారతి"లో డా. వీరభద్రయ్యగారి 'అనుభూతి కవిత్వం - స్వరూప స్వభావ ప్రయోజనాలు' అన్న వ్యాసము ఆసక్తితో చదివాను. అనుభూతి అన్న పదాన్ని ఇంకా బాగా అర్థం చేసికొనటానికి శ్రీ సంజీవదేవ్‌గారి యీ క్రింది వాక్యాలు ఉపకరిస్తాయి.

'బుద్ధి జీవులది ఆలోచన, హృదయ జీవులది అనుభూతి. మొదటిది విశ్లేషణాత్మకం. రెండవది సంశ్లేషణాత్మకం. ఒకటి

విడగొట్టి చూస్తుంది. రెండవది కలిపి చూస్తుంది. ఒకటి విజ్ఞానం పాండిత్యం హేతువాదం. రెండవది కళ రససృష్టి, తన్మయత."

(రసరేఖలు, పుట 121)

శ్రీ నూతలపాటి గంగాధరంగారి యీ క్రింది మాటలుకూడ చదవండి.

'భావకవిత్వంలో ప్రధానమైంది కవి అనుభూతి. అభ్యుదయ కవితలో అనుభవం. అందులో సౌందర్యం. ఇందులో హేతువాదం. దాని ప్రయోజనం ఆనందం. దీని ప్రయోజనం సామాజిక ప్రగతి' (భారతి, అక్టోబరు '69)

పై మాటలనుబట్టి అనుభూతి ప్రధానమైన కవిత్వం ఈనాటిది కాదని తెలుస్తున్నది. కాగా డా. వీరభద్రయ్యగారు 'అనుభూతి కవిత్వం అన్నది ఈ 6, 7, 8 దశకాలలో వస్తున్న కవిత్వం' అనటం సరికాదు. వారి వ్యాసమే "ఈ మధ్యకాలాన 'అనుభూతి' కవిత్వం అన్న పేరుతో కొంతమంది కవితలు రాస్తున్నారు" అని ప్రారంభించబడింది. 'అనుభూతి కవిత్వం' అనిపేరుపెట్టి ఈనాడు కొందరు వ్రాస్తున్నారు కాబట్టి అది యీనాడు క్రొత్తగా వెలసిన కవితా ప్రక్రియగా భావించి దాని స్వరూపాదులను వివరింపబూనారు వ్యాసకర్త. అనుభూతి కవిత్వం ఒక ఉద్యమంకాదు. అది కవిత్వంలో కనిపించే కవి హృదయస్పందన. దాన్ని గురించి చర్చించటం అవసరమే. కాని ఈ మధ్యకాలంలో వస్తున్న కవితల లోనే అనుభూతి కవిత్వం కనిపిస్తున్నదనటం, ఆ కవితలను మాత్రమే అనుభూతి కవితలుగా ఉదాహరించటం మాత్రం అనుచితం. కవిత్వంలో అనుభూతి భావపరమైనదేగాని ఛందఃపరమైనది కాదు కనుక వచన కవితలలో నుంచే కాకుండా సంప్రదాయ కవితలలో కూడ అనుభూతి ఎలా వ్యక్తీకరింపబడినదో వివరించటం పరిశీలకుల విధి అని మనవి.

సూర్యదేవర రవికుమార్

కొల్లూరు.

# మనిషి కారణజన్ముడా?

"మనిషి కారణ జన్ముడు" అనే శీర్షిక క్రింద "భారతి" (ఏప్రిల్, 1982)లో శ్రీ నిఖిలేశ్వర్ ఒక గేయం రచించి, ఈ విశాలమైన సృష్టిలో కేవలం ఒక రేణువుగా ఉన్న మానవునికి అతిశయోక్తులు అంటగట్టినారు. వస్తుగత భావవాదం (ఆబ్జెక్టివ్ ఐడియలిజం) ఎంత హానికరమో స్వీయాత్మక భావవాదం (సబ్జెక్టివ్ ఐడియలిజం) కూడ అంతే హానికరమని భౌతికవాది అయిన నిఖిలేశ్వర్ గ్రహించక పోవటం విచారకరం.

ఆదిమ మానవుడు ఆకసంలో ఎగిరే పక్షిని చూచి నివ్వెరపోయినాడు. ఆధునిక మానవుడు వ్యోమగామి అత్యల్పకాలంలో విశ్వమంతా చుట్టి తిరిగి వస్తున్నాడు. ఇట్లు మానవుడు ఇప్పటికే గొప్ప చరిత్రను నిర్మించినప్పటికీ, అతనిలోని అనేక బలహీనతలు కారణంగా చరిత్ర నిర్మాణం భవిష్యత్తులో కూడ అసంపూర్ణంగానే నిలిచిపోతుందనేది వాస్తవం. మానవుని ఔన్నత్యాన్ని, అతని ఘన కార్యాలను వర్ణించడానికి సముద్రం అంత సిరా, ఆకసం అంత కాగితం కావలసి ఉంటుంది. అయినప్పటికీ, భావవాదులు దేవునికి అంటగట్టినట్లు, భౌతికవాదులు మానవునికి అతిశయోక్తులను అంటగట్టటం ఎంతమాత్రం తగదు. ఎందుకంటె అతిశయోక్తులు ఆత్మ వంచనకే తోడ్పడతాయి.

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని గీతావాక్యం. శ్రీకృష్ణుడు మొదలైనవారు "కారణజన్ముల"ని మత విశ్వాసాలతో ప్రేరితులైన భావవాదులు చెప్పటంలో అబ్బురం ఏమీ లేదు. కాని భౌతికవాది అయిన శ్రీ నిఖిలేశ్వర్ దశావతార పురుషులకు పోటీగా మానవులను నిలబెట్టి, "మానవుడు కారణ జన్ముడు" అని కీర్తించటం అత్యంత విచారకరం. ఒక ఉద్దిష్ట కార్యం నిర్వహించటం కోసరం – శిష్టరక్షణ, దుష్టశిక్షణ కోసరం – అవతరించిన శ్రీరామాదులను భావవాదులు "కారణ జన్ములు" అన్నారు. ఇట్టి "కారణ జన్ముల" అవతరణ, అంతకు చాలా పూర్వమే నిశ్చయమై, అది అంతా ఒక ప్రణాళికా బద్ధంగా జరుగుతుంది. దీనిని శ్రీ నిఖిలేశ్వర్ మానవులకు కూడ వర్తింపజేయటం అంటే స్వీయాత్మక భావవాద పరిష్వంగం నుండి బయట పడటానికి ఆయన సిద్ధంగా లేరని భావించవలసి ఉంది.

మానవుడు "కారణ జన్ముడు" అంటే, ఈ సిద్ధాంతం సర్వ కాలాలకూ, సర్వభాగోళిక ప్రదేశాలకూ వర్తిస్తుంది. కారణ జన్ముడు అయినవాడు స్వయంగా దేవుడో, అతని దూతో అయి ఉండవలెను. ఇట్టి వారు అప్పుడప్పుడు – ఒక్కొక్క యుగంలో ఒక్కొక్కరు చొప్పున జన్మిస్తూ ఉంటారు; మానవులవలె కుప్పతెప్పలుగా కాదు. అతడు గతంలో ఎన్నో జన్మలు – అవతారాలు పొంది పూర్వ జన్మవాసన సైతం కలిగి ఉంటాడు. అతడే స్వయంగా దేవుడే అయితే, తన ప్రణాళికను అనుసరించి భూలోకంలో నటిస్తాడు. ఆ ప్రణాళికకు అనుగుణంగా లేనిపని దానికివెలిగా ఉన్నపని ఏదీ చేయడు. అతడు దేవుని దూత అయితే దేవుని ఉత్తర్వులను మాత్రమే అమలు పరుస్తాడు; మరొక పట్టుకొనడు.

నిజమే, నేడు పెద్ద పెద్ద పట్టణాలలో, జనసమ్మర్దంగా ఉన్న ప్రాంతాలలో, ఇంటి నుండి బయలుదేరిన మనిషి సురక్షితంగా గమ్యస్థానం చేరుకొనటం, ఒకవేళ చేరుకొంటే సురక్షితంగా ఇంటికి తిరిగి రావటం నమ్మశక్యంగా లేదు. అతడు ఏ లారీ క్రిందనో, బస్సుక్రిందనో పడి చావకుండా ఇంటికి తిరిగి రావటమే గొప్ప. ఇట్టి స్థితిలో ఒక సైకిల్ వాహనంగా చేసికొని, జీవితం గడుపుతున్న మానవుని చూచి, శ్రీ నిఖిలేశ్వర్ మనస్సులో ఎన్నో భావాలు - స్వీయాత్మకమైనవి - చెలరేగినాయి. దీనినే ఇతివృత్తంగా స్వీకరించి, ఆయన ఈ గేయం రచించినారు. మానవుకు "చావును రోజూ పరిహసించి బతుకు వాహనంపై ఎక్కే విజేత" అన్నారు. మానవుడు "కాలవాహనంపై దూసుకు పోతున్నాడు కారణ జన్ముడుగా" అని పొగడినారు. మానవుడు వ్యోమగామి అయి రోదసీయానం చేస్తూ ఉండటం గమనించి నప్పుడు కూడ కవికి ఇట్టి భావాలే కలుగవచ్చును గదా! గూటిలోని పిల్లల ఆకలి తీర్చటానికై ఆకసంలో ఎగిరిపోతున్న పక్షిని, లేదా ఆహారం సేకరించుకొని గూటికి చేరుకొంటున్న పక్షిని చూచినప్పుడు వస్తుగత భావవాది మనస్సులో సైతం ఎన్నో దివ్యభావాలు కలిగే అవకాశముంది మరి! అది "కాలవాహనం"పై, "బతుకువాహనం"పై దూసుకు పోవటంలేదని చెప్పగలమా?

ఋగ్వేదకాలంలో ఆర్యులకు తొలిసారిగా వాయుదేవుని దర్శనం జరిగింది. తమ కన్నుల ఎదుట ఒక చెట్టు కొంతసేపు కదలటం, కొంతసేపు కదలక ఉండటం వారికి ఆశ్చర్యం కలిగించింది. చెట్టు కదలినప్పుడు - ఎక్కడనుంచో ఒక అజ్ఞాతశక్తి అకస్మాత్తుగా ప్రవేశించి చెట్టును ఊపుతున్నట్లు భ్రమించి, దానికి వాయుదేవుడని పేరుపెట్టి, అతనిని కీర్తించిన ఘటన ఋగ్వేదంలో వర్ణింపబడింది. కాలక్రమంలో ఇది వస్తుగత భావ వాదానికి దారి తీసింది. వారు మామిడి చెట్టునిండా కాయలు కాచి ఉండటం చూచినారు. అది తన పండ్లను తానే తినటం లేదని, పరహితం కోసరం అది ఫలించిందని సిద్ధాంతీకరించినారు. దీనిని ఉదాహరించి, పరహితం కోసరం పాటు పడమని తోటిమానవులకు ఉపదేశించినారు. కాని ఈ సూక్తి మానవ సమాజంలో ఆచరణకు వచ్చిందా? "లేదు" అని చరిత్ర కంఠోక్తిగా చెప్పుతుంది. ఇట్టి స్థితిలో ప్రకృతి నియమాలను సమాజానికి వర్తింప జేయటం అవివేకమని భౌతిక వాదం ఉద్ఘోషిస్తున్నది.

రాబర్ట్ క్లైవు భారతీయుల దృష్టిలో దోపిడీదారు, బ్రిటిష్‌వారి దృష్టిలో "కారణజన్ముడు". ఏల? అతడు బ్రిటిష్‌వారికి ఎంతో మేలు చేసినాడు. నెపోలియన్ 'కారణజన్ముడు' అని భావవాదులు నేటికీ వాదిస్తారు. ఇది సిద్ధాంతాలమధ్య జరుగుతున్న పోరాటం. ఇది మరి కొంతకాలం ఇట్లే సాగుతుంది. అట్లని భౌతికవాదులు మానవులందరినీ "కారణజన్ములు"గా పరిగణించరు. ఎందుకంటే ఒక మానవతీతశక్తి ఏదీ మానవులకు ఒక ఉద్దిష్ట కార్య ప్రణాళిక ఇచ్చి, భూలోకానికి పంపదు. మానవుని జన్మ ప్రణాళికాబద్ధంగా జరుగుతూవుంటే, సైకిలుమీద బయటకుపోయిననాడు సురక్షితంగా తప్పక తిరిగి వస్తాడు. కాని నేటి పరిస్థితి ఆవిధంగా లేదు. దారిలో ఏదో దుర్ఘటన జరిగిపోతుందని నిత్యమూ భయం. దీనికి సామాజిక తదితర నియమాలు ఎన్నో అడ్డు వస్తున్నాయి. ఇదంతా ప్రణాళికా బద్ధంగానే సాగుతూ ఉంటే, మానవుడు తన జీవితం గూర్చిదిగులు పడవలసిన అవసరమేలేదు. కాని 'కారణజన్ముడు' అయిన అతడు రేపటినిగూర్చి ఆలోచిస్తూనేఉన్నాడు. ఆదిమ మానవుడు తన పొట్ట కూడే సంపాదించుకొనలేక ఎన్నో ప్రయాసలు పడినాడు. కాని అధికోత్పత్తి చేస్తున్న నేటి మానవుని జీవితకాలం, అల్ప సంఖ్యాకులైన వరాన్నభుక్కులను పోషించటానికే పరిమితం అయింది. ఇది మానవుని బలహీనతలలో కెల్లా పెద్ద బలహీనత అని చెప్పవచ్చు. ఇట్టి మానవుని 'కారణజన్ముడు' అనిపిలిస్తే, 'వెట్టికుదిరింది, రోకలి తలకుచుట్టు' అన్నట్లు ఉంటుంది.

శ్రీ నిఖిలేశ్వర్ సైకిలు ప్రయాణికుడు అనుకొందాం. ఆయన సురక్షితంగానే బయటకుపోయి, సురక్షితంగానే ఇంటికి చేరుకొన్నారు అనుకొందాం. ఆయన ఒక ప్రొద్దుకాడ ఎవతోనయినా ఇష్టగోష్ఠి జరిపినారు అనుకొందాం. ఆ గోష్ఠిలో మానవుని ఔన్నత్యాన్ని తలచుకొని 'నేను కారణజన్ముడను' అంటే, వారు 'మీరు అన్నది నిజమే, నాది కూడా మిమ్ము అన్వేషిస్తూ, ఈ భూలోకంలో దిగిన 'కారణజన్మే' అని శ్రుతి కలుపుతారా?

బండ్లపల్లె ఓబుళరెడ్డి
అనంతపురం



# గ్రంథ విమర్శలు

## సమాలోచన

(ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలపై సమీక్ష)

[సంపాదకుడు : డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం. వెల : రూ. 9-00. ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్ - 500 004]

ఇందులో మొత్తం పదిహేను వ్యాసాలున్నాయి. నేటి సాహిత్యం - సామాజిక స్పృహ ఆర్. ఎస్. సుదర్శనం, నేటి సాహిత్య విమర్శ - ప్రమాణాలస్థాయి డా॥ దివాకర్ల వేంకటావధాని, పరిశోధన - పరమార్థ పరిశోధన డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, సాహిత్య భాష - వ్యవహార భాష డా॥ బూదరాజు రాధాకృష్ణ, నేటి పద్యరచన దాని భవితవ్యము మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, వచనకవిత - ప్రయోగ వైవిధ్యం ఆవంత్స, ఇరవై ఏండ్ల తెలుగు కవిత్వంలో భావకవితా చ్ఛాయలు డా॥ నాయని కృష్ణకుమారి, నేటి తెలుగు కవితలో తిరుగుబాటు ధోరణులు డా॥ కె. కె. రంగనాథాచార్యులు, ప్రధానకవిత - పాట ఎల్లోరా, ఆధునిక కవిత ఆదానం, ప్రదానం డా॥ ఇలపావులూరి పాండురంగారావు, నవల మహిళ డా॥ జి. లలిత, తెలుగు నవల - ప్రమాణాలూ - ప్రయోగాలూ డా॥ అక్కిరాజు రమాపతిరావు, నేటికథ - వాస్తవికత - తెనుగుదనం మధురాంతకం రాజారాం, నాటక రచన - క్రొత్త ప్రయోగాలు డా॥ పి. పి. రమణ, సాహిత్య అకాడమి బహుమానాలు పొందిన గ్రంథాలు - ఒక సమీక్ష డా. జి. వి. సుబ్రహ్మణ్యంగార్లు రచించారు.

ఈ వ్యాస సంకలనానికి డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు సువిశాలమైన సంపాదకత్వ పీఠికను సమర్పిస్తూ వ్యాసాలన్నింటినీ స్థూలంగా సమీక్షటం జరిగింది. సమాజంలో సమత్వ స్థాపనకు మూడు సోపానాలను వారి పీఠికలో పేర్కొన్నారు. మొదటిది - గతి తార్కిక భౌతిక వాదం; రెండవది - మానవతావాదం; మూడవది - ఆధ్యాత్మిక వాదం. ఈ ముప్పేట స్వరూపమే ఆధునిక జీవన సిద్ధాంతమని వారి అభిప్రాయం. "ప్రపంచంలో నడవటమే నేటి మన ఆధునికత; ప్రపంచాన్ని మనతో నడిపించటం ఆధునిత అనుకోవటానికి మరోతరం రావాలి." అనే వారి ఆకాంక్షలో యథార్థం ఉంది.

సుదర్శనంగారు సాహిత్యంలో సామాజిక స్పృహ అనే అంశాన్ని వారి దృక్పథంలోంచి వింగడించారు. రచన రచయిత యొక్క హృదయం, నరాలు, సంస్కారం నుంచి ఉద్భవిస్తుందని చిలక పలుకుల్నించి రాదని తీర్మానం చేశారు. "మనుష్యుల చైతన్యం కాదు వారి సత్తాను నిర్ణయించేది; వారి సామాజిక సత్తాయే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది" అని విశ్వసిస్తే - మానవ హృదయం, నరాలు, సంస్కారం కూడా ఈ సామాజిక సత్తా మీదే ఆధారపడి ఉంటాయి. రచయిత, రాజకీయవాది ఇద్దరూ సమాజంలోని వ్యక్తులే. ఆలోచనాబద్ధమైనది రచన; క్రియాను శీలమైనది రాజకీయం. మానవజాతి పురోగమన దృష్ట్యా ఈ రెండూ ఏకమైతే దోషంలేదు గదా!

దివాకర్ల వారి వ్యాసం పరీక్షకు పోయే విద్యార్థి గబ గబ చూసుకునేందుకు పనికివచ్చే నోట్సులా ఉంది. ప్రస్తుతప్పమరేంలేదు. పరిశోధన పరమార్థ పరిశోధన వ్యాసంలో వీర భద్రరావుగారు పరిశోధకునికి ఉండవలసిన యథార్థత, క్రమబద్ధత, తర్కబద్ధ వివరణ, చిత్తశుద్ధి పులుముగు వ్యాపారం లేక పోవడం, శైలివిషయంలో జాగ్రత్తలు మొదలైన అంశాలమీద వివరణాత్మకంగా చర్చించారు. సాహిత్యభాష - వ్యవహారభాష వ్యాసంలో బూదరాజు రాధాకృష్ణ గారు గ్రాంథిక, వ్యవహార భాషకుగల తారతమ్యాలు, కావ్య భాషకు, వ్యవహార భాషకు గల కించిద్భేదం, జీవద్భాష, కావ్య భాషగా ప్రకాశిస్తున్న విధం వివరించారు. ఉచ్చారణకు, రాతకుగల దూరాన్ని, దగ్గరను కూడా వివరించి శబ్దాలు కాలక్రమంలో పొందిన పరిణామాన్ని, వాటి జీవలక్షణాన్ని విశదం చేశారు. "ప్రాచీన భాషకు లక్షణ నిర్ణయం చేసి వ్యాకరణ గ్రంథాలు రాసినంత సులభంగా అనుక్షణ పరిణామ శీలమైన వ్యవహార భాషను విశ్లేషించడం సులభసాధ్యం కానేకాదు. అందువల్ల ఆధునిక భాషా వ్యాకరణాలు ఎప్పుడూ అసమగ్రంగానే ఉంటాయి; మృతభాషా విషయంలో తప్ప - అంటే వ్యవహార దూరమైన భాషా విషయంలో తప్ప. సమగ్ర వ్యాకరణ గ్రంథ నిర్మాణం అసాధ్యం. గ్రంథమో సూత్రమో రాయనంత మాత్రాన వ్యాకరణమే లేదను కోవటం వెర్రి" అని కంఠోక్తిగా చెప్పారు.

నేటి పద్యరచన - దాని భవితవ్యము అన్న వ్యాసంలో మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ఈ ఇరవై ఏండ్లలో

వచ్చిన పద్యకావ్యాలను, వాటి ఉపలబ్ధిని ఉటంకించారు. "రసవతో కవితా ధర్మము నాల్గు పాదముల నడచినంత వఱకు నేటి పద్యరచన భవితవ్యము సురక్షితము" అని ముగించారు వారి వ్యాసాన్ని. వచన కవిత - ప్రయోగ వైవిధ్యం వ్యాసంలో ఆరుద్రగారు తొలి వచన గేయాన్నీ, వచన గేయంలో వచ్చిన పరిణామాన్నీ, పాఠకులకు తెలియని పిఠాపురం రాజా వంటి వచన గేయ కవుల్నీ పరిచయం చేశారు. తెలుగు కవిత తిరుగుబాటు ధోరణులు అనే వ్యాసంలో రంగనాథాచార్యులుగారు దిగంబర, పైగంబర, తిరగబడు కవుల సిద్ధాంత దృక్పథాల్నీ, వారి బలాన్నీ, బలహీనతల్నీ న్యాయమూర్తిలా జడ్జి చేశారు. ఇరవై ఏండ్ల తెలుగు కవిత్వంలో భావకవితాచ్ఛాయలు వ్యాసంలో నాయని కృష్ణకుమారిగారు నాయని సుబ్బారావు, కృష్ణశాస్త్రిగార్ల దగ్గరనుంచి తిలక్, అరిపిరాల విశ్వం గార్ల వరకు భావకవిత ఏ విధంగా రూపుదిద్దు కొన్నదో సోదాహరణంగా పేర్కొన్నారు. ప్రజాకవిత - పాట అనే ఎల్లోరాగారి వ్యాసంలో పాటకున్న స్థానాన్ని ఉదాహరణలతో వివరించటం జరిగింది. ఇలపావులూరి పాండురంగారావుగారు తెలుగు లోంచి ఇతర భాషల్లోకీ, ఇతర భాషల్లోంచి తెలుగులోకి తర్జుమా అయిన గ్రంథాలు, ఆయా రచయితల ప్రతిభా వ్యుత్పన్నతలను గురించి పరిశోధన వ్యాసం రాశారు. జి. లలితగారు రచయిత్రుల నవలలను గురించి చర్చజరిపారు. నవలలపై ఆశించినంత విమర్శ లేక పోవటం నవలల ఎదుగుదలకు ఒక లోపం అని స్పష్టం చేశారు. రచయిత్రుల నవలలను పట్టించుకోని స్థితికి ఆమె తనబాధను వ్యక్తం చేశారు. తెలుగు నవల - ప్రమాణాలూ - ప్రయోగాలూ వ్యాసంలో రమాపతి రావుగారు కొత్తగాచెప్పింది ఏమీలేదు; చర్విత చర్వణం తప్ప. మధురాంతకం రాజారాంగారి వ్యాసం తెలుగు కథను గురించి విశ్లేషణాత్మకమైనది. నాటకరచన-క్రొత్త ప్రయోగాలు వ్యాసంలో బి. వి. రమణగారు పాశ్చాత్య నాటక సిద్ధాంతాలను తెలుగులో ఆధునిక నాటకాలకు చక్కగా అన్వయించారు. అకాడమీ బహుమతి పొందిన గ్రంథాలనుగూర్చి జి. వి. సుబ్రహ్మణ్యంగారి రిపచయం బాగుంది.

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి ఇటీవల ఇరవయ్యో శతాబ్దంలోకి తన చూపును సారించి నందుకు సంతోషం. గతంలోంచి వెలువలకు వచ్చి వర్తమానాన్ని వీక్షించి, ఆ గతంలోకి తన చూపును సక్రమంగా ప్రసరింప జేస్తే ఏ సంస్థ అయినా తన ధర్మాన్ని నిర్వర్తించినట్లే.

## భరతుడు

[ముప్పిడి సత్యనారాయణమూర్తి. వెల: అమూల్యం. ప్రతులకు : ముప్పిడి సత్యనారాయణమూర్తి, సంతపేట, గొల్లవీధి, విజయనగరం_1]

సత్యనారాయణగారు భరతుని వ్యక్తిత్వ మహత్తును లోకానికి చెప్పడానికి 172 పద్యాల లఘు కావ్యాన్ని రాశారు. రాములు వనవాసానికి పోయినాడని విని, తాను రాముని రాజ్యమేలుటకై పిలుచుటకు వెళ్ళి పాదుకలతో వచ్చి వాటికే పట్టాభిషేకం చేసిన గొప్పవ్యక్తి భరతుడని కవిగారి అభిప్రాయం. వారి పద్య గమనానికి ఈ క్రింది పద్యం ఉదాహరణ.

"ఏ వారైనను వారికేది సరియో
యేరీతిగా వారికా
జీవాధారము పెంపుగాంచు నటులే
చింతించి చేకూర్చెనన్
భావంబందున తృప్తిగాంచి సతమున్
భాగ్యోన్నతుల్ పొందుచున్
ఈ విశ్వంబందున శాంతి సౌఖ్యములతో
నెంతేని భాసిల్లరే."

## బాలగేయాలు

[డా॥ ఎస్. గంగప్ప. వెల : రూ. 5-00 లు ప్రతులకు : (1) శశీ ప్రచురణలు, సి-78, శ్రీనివాస్‌నగర్, గుంటూరు - 522 006 (2) నవోదయ పబ్లిషర్సు, ఏలూరు రోడ్డు, విజయవాడ-2; అరండల్‌పేట, గుంటూరు-2]

డా॥ ఎస్. గంగప్పగారు సృజనాత్మక సాహిత్యంలోనూ, పరిశోధనాత్మక సాహిత్యంలోనూ లబ్ధప్రతిష్ఠులు. అంతర్జాతీయ బాలల సంవత్సరాన్ని పురస్కరించుకొని బాలల గేయాలనే ఈ చిన్న సంకలనాన్ని అచ్చువేశారు. తెలుగు సాహిత్య రంగంలో బాలసాహిత్యానికి ఇప్పుడిప్పుడే ప్రాముఖ్యత వస్తున్నది. అయితే బాలల సాహిత్యం పేరుతో వస్తున్నదంతా వారికి చెందేదేనా అనే అనుమానం విజ్ఞులకు కలగటం సహజం. అట్లాంటి అనుమానానికి తావీయకుండా ఈ గేయాలను గంగప్పగారు రచించారు. దీనికి మంచి పీఠికను సమకూర్చిపెట్టారు ఆచార్యతూమాటి దోణప్పగారు.

బాల సాహిత్యానికి-వారికి పరిచితమైన శబ్దజాలం ఉపయోగించటం ముఖ్యలక్షణం. ఆ లక్షణాన్ని చక్కగా పాటించారు గంగప్పగారు. కిడ్డీబ్యాంకు బొమ్మని ఆయన వర్ణించిన తీరు ఇట్లా ఉంది:

"చూశారా ఈ వింత
కన్నారా మన చెంత
అది చక్కటి బొమ్మ
అందమైన బొమ్మ
మర తిప్పిన తిరుగును మనవైపు
మరల తిప్పిన తిరుగును తనవైపు
పైసలు పావలాలు చల్లగాను మింగుతుంది"

ఇంత సులువైన భాషలోనే బాలలకు అనేక నీతులను, దేశభక్తిని, సూక్తులను బోధించారు. స్వతహాగా కవి కావటంవల్లనేమో దీర్ఘ సమాస ధోరణి అల్పంగా ఈ సంకలనంలో తొంగిచూసింది.

"అమేయ జ్ఞానమౌని సమధిష్టిత తపోవనాలు
అనంత ప్రపూత హోమాగ్ని ధూమస మాలికలు"

మొదలైనవి అట్లాంటివి. వీటి పరిహరణ బాలసాహిత్యానికి అత్యంతావశ్యకం. లోపం అల్పం అవటంవల్ల గుణానికి నష్టం వాటిల్లదు.

# కవితా దిక్సూచి

(ఏ సంపుటాలు కరపత్రాల వలె)

[సాలుచందా :- రు. 6-00 లు. నిర్వహణ : సాహితీ మిత్రులు, సిరిసిల్ల. వివరములకు: దిక్సూచి, ఇం. నెం. 1-2-63, సిరిసిల్ల - 505 301]

వర్తమాన కవితా వేదికగా ఈ కవితా దిక్సూచిని తీర్చి దిద్దుతున్నారు సిరిసిల్ల సాహితీమిత్రులు. ఈ సంకలనాలు కరపత్రాల వలె అతి చిన్న పరిమాణంలో, వీలైనన్ని ఎక్కువ కవితలతో వస్తున్నాయి. సి. హెచ్. మధు, కొల్లూరి, రౌద్రి, దామెర్లరాములు, నగ్నముని, దేవరాజు మహారాజు, శివారెడ్డి, ఎ. ఎన్. కనపర్తి, వెంపలి వెంకట శివప్రసాద్, అలిశెట్టి ప్రభాకర్, కందుకూరి శ్రీరాములు మొదలైన కవుల కవితా ఖండికలు ఈ ఐదు సంపుటాల్లోనూ ఉన్నాయి.

ఈ వ్యవస్థ మారాలనీ, అట్లా మారటానికి ప్రజలు చైతన్యవంతులై ఉద్యమించాలనీ, ఈ కవులందరి ఏకాభిప్రాయం. వ్యవస్థలోని అవ్యవస్థను ప్రతి గేయంలోనూ చిత్రించారు.

"దానం చెయ్యడానికి
భూమి ఒకరి జేబులో చిల్లరకాదు
మేం భూమిని రక్తంతో గెల్చుకుంటాం"

అంటున్నారు. వ. సీ. రా. గారు.

"జీవితమంటే
ఊడిగం చెయ్యటం కాదు
ఉద్యమించటమనీ
జీవితమంటే
స్వప్నాల్లో పరిభ్రమించటం కాదు
శ్రమించటమనీ, సంఘటితం కావటమనీ
జీవితమంటే
నీరు కారిపోవటం కాదు
నెత్తురు దారుల్లో నడవటమనీ
త్వరగా తెల్సుకో."

అంటున్నారు అలిశెట్టి ప్రభాకర్‌గారు. ఈ గేయంలో సంఘటిత పోరాటమే వ్యవస్థ మార్పుకు మూలమని చెబుతున్నారు.

ఈ నాటి రచయితలలో కొంతమందిని గూర్చి దేవరాజు మహారాజుగారు న్యూస్ పేపరును మధ్య పెట్టి చెబుతున్నారు.

"జనం తన వెంటే నడుస్తోందన్న భ్రమతో
వెయ్యేళ్ల వెనక్కు నడిచే నవలాకారుల గూర్చి
ప్రాథమికంగా మనుషులమని మరచి
ఆడ అభిమానుల శరీరాల్ని కోరుకునే క్షుద్రరచయితగూర్చి
భయంకర నిజాల్ని వెలిగిస్తాయి."

ఈ వ్యవస్థలో కుర్చీల్లో నేరస్తులు, బోనుల్లోఅమాయకులూ ఉంటారని, ఈ చీకటి ఆకాశాన్ని చీలిస్తేగాని తెల్లవారదని, దానికి మార్గంగా-

"ఒక భావాన్ని మరో భావంతో ఎదుర్కొన్నట్లు
ఒక ఆయుధాన్ని మరో ఆయుధంతో ఢీకొన్నట్లు
హింసను ప్రతిహింసతో ప్రతిఘటించినట్లు
ఈ వ్యవస్థను మరో వ్యవస్థ
నిర్మిస్తూ మాత్రమే ఛేదించగలం"

అని నగ్నముని ప్రబోధిస్తున్నారు.

మనం నివసిస్తున్న సమాజ నిజస్వరూపాన్నీ, అందులోని ఆర్థిక శక్తి ప్రాబల్యాన్నీ అత్యంత కళాత్మకంగా దృశ్యం కావించారు అలిశెట్టి ప్రభాకర్ నిజ రూపంలో

"డబ్బు దండెత్తి, దౌర్జన్యం దండెత్తి, వంచన దండెత్తి
మనుషుల్ని నిలువునా కొల్లగొడుతుంది
అణువణువూ కబళిస్తుంది.

"ఒకడు ఖరీదైన ప్రాంశరీ నోటైతే
ఒక దరిద్రుడు దానిపైన ఆకలి సంతక మౌతాడు
ఒకడు గనుల్లో, ఫ్యాక్టరీల్లో పొలాల్లో చెమటై కారిపోతే
మరొకడు ఆ చెమటతో సేఫ్టీ లాకర్ గర్భంలో
పిండమై ఎదుగు తుంటాడు
నరనరాల్లో డబ్బు జీర్ణించుకున్న బలశాలి
అమాయకుల వందల వేల గుడిసెల్ని అమాంతం పీకేస్తాడు
మంత్రిగారు మరణిస్తే గంధపు చెక్కల్లో
అనామకుడు మరణిస్తే డ్రైనేజి కాలవల్లో -
ఇది అధికారం అహంభావం కలిసి
మనిషిని పీక్కు తింటున్న వ్యవస్థ."

ఇట్లా ఈ సంపుటాల్లో కవితలన్నీ ఈ సమాజంమీద రావలసిన తిరుగుబాటుకు ప్రోద్బలంగా, తద్భావానికి ఉపస్కారకంగా, నినాదం కాకుండా జీవిత వాస్తవంగా, కళాత్మకంగా ఉన్నాయి.

## సమాధిలో స్వగతాలు

(ద్వా. నా. శాస్త్రి, మార్గశీర్ష. వెల : రు. 4-00 లు. ప్రతులకు : బి. సుషుమ, 3-4-20, భోగరాజు స్ట్రీట్, రె. అగ్రహారం, అమలాపురం-533 201)

ద్వా. నా. శాస్త్రిగారు, మార్గశీర్షగారు గతకాలపు సంప్రదాయ పద్య జంట కవులవలె, ఇప్పటి జంట రచయితలవలె వచనగేయపు జంట కవులు కారు. కాకపోతే ఇద్దరూ కలిసి వారి వారి వచన గేయాల్ని ఏక కావ్యంగా అచ్చువేశారు. ఇద్దరిదీ ముందుచూపే కాని అప్పుడప్పుడు మనస్సు మాత్రం వెనక్కు పోతూ ఉంటుంది. సమకాలీన సమాజంమీద కసి ఎక్కువ, సాటి మనిషి మీద జాలి తక్కువ. కావ్య వస్తువులో కవికి మమైక్యం లేకపోవటం ఇందుకు ఒక కారణమేమో !

తొలి కవితా సంకలనమైనా నోరు తిరిగిన ఉపన్యాసకుడి ఉపన్యాసంలాగా ఇది చేయి తిరిగిన కవిత్వమే. శాబ్దికమైన అధికారానికి, కావ్యగతమైన భావుకతకు లోటు లేదు.

"ఎర్ర టోపీల ముదనష్టపు పరిహాసానికి
సిగ్గుతో కందిన మందారాలివి"

అనటంలో మార్గశీర్షగారి వ్యంగ్యాత్మక శైలి బోధపడుతోంది. అనాథ బాలల్ని మార్గశీర్ష చిత్రించిన పద్ధతి బాగుంది.

"మనముంగిళ్ళు దిద్దుతున్న వాళ్ళు
దిక్కుమాలిన వాళ్ళు - దిన మొలలున్న వాళ్ళు
పట్టుమని పదేళ్ళయినా నిండని వాళ్ళు
మనం కసి కసిగా విసిరేసిన పసివాళ్ళు
మంత్రుల శుభాకాంక్ష అందనిచోట
పులకింతలు లేని పుడమి తల్లి కౌగిట
చలిపులికి ఎముకల్ని తినిపిస్తున్నారు."

ఈనాటి కవుల్లో ఒక భాగానికి ఈ క్రింది పాదాలు ఉదాహరణ:

"సీసాలతో కవితారసం జుర్రుకున్న వాళ్ళు
సీసాలతో కవి తామసం కక్కుతున్నారు
పుటల్లో విషాద వాక్యాల్ని, హోటల్లో విషాద గీతాల్ని ప్రసవిస్తున్నారు
పాపం వీళ్ళంతా మన గూట్లో ఘూ కవులు"

ద్వా. నా. శాస్త్రిగారు నేటి చదువుల మీద, అభ్యుదయ వాదం మీద, నీతి మీద ఒక విసురు విసిరారు -

"ఇంట్లో పిల్లి బయటపులి
ఇంట్లో సంప్రదాయవాది బయట అభ్యుదయవాది
పెరుగు చిలికితే వెన్నరావటం సహజం
ప్రొఫెసర్ని కాకాపడితే ఫస్టు రావటం తథ్యం
అగ్గి చూపిస్తే వెన్న వెంటనే కరుగుతుంది
మూట చూపిస్తే ఫైలు తక్కున కదులుతుంది.
నేతిబీరలో నేయి లేదు
విద్యాలయాలలో విద్యలేదు."

మార్గశీర్షగారి వలె ఈయన కూడా కవులపై తన కసిని తీర్చుకొన్నారు. బహుశా పురోగామి కవులంటే ఈయనకు మంట.

"ఇజాల గావుకేకల మదిరాపాన చిత్తులై
అహంకార హృదయాధర స్పందనలతో
ఆవేశపు అంధకారంలో, రస హీనపు పెనుగులాటలో
కీర్తి పాన్పు మీద
కాగితాల్ని కలాలు మానభంగం చేస్తున్నాయి."

ఈ విడి విడి జంటకవులు భవిష్యత్తులో మరింత అవగాహనతో, మరింత నిబద్ధతతో, మరింత నిజాయితీతో, మరిన్ని సంకలనాలు వెలయిస్తారని ఆశిస్తాను.

శ్రీ టి. ఎల్. కాంతారావు

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.

# అమృతాంజన్‌కే తెలుసు తలనొప్పి బాధ

అసలు తల నొప్పి అంటేనే భరించలేని బాధ. దాన్ని పోగొట్టుకోడానికి సుళువైన మార్గము. కొంచెము అమృతాంజన్ తీసుకొని కణతల మీద బాగా గట్టిగా నిమిరి పట్టించండి. వెంటనే తల నొప్పి తగ్గిపోయి హాయిగా వుంటుంది.

అమృతాంజన్ ఇతర మందులవలెగాదు. అమృతాంజన్‌లో చేరివున్న శక్తివంతమైన 10 ఔషధాలు అమోఘంగా పనిచేసి రాసిన చోట పై చర్మంవల్ల అతి త్వరగా ఇట్టే నొప్పిని నివారిస్తుంది. ఏ అపాయం వుండదు.

85 సంవత్సరాలకు పై బడిన ప్రసిద్ధి కల అమృతాంజన్ పోటి నొప్పులకు, బెణుకులకు, జలుబులకు గొంతు నొప్పులకు కూడా చాలా అమోఘంగా పనిచేసి నివారిస్తుంది.

ఎప్పుడూ అమృతాంజన్ చేతికి అందుబాటుగా వుంచుకోటం మంచిది. ఎందుకంటే ఎప్పుడు అవసరమొస్తుందో చెప్పలేము.




## అమృతాంజన్

శీఘ్ర నివారిణి. నమ్మకమైనది. ఏ ఇతర బాధనూ కలుగచేయదు.

OBM 7652 TG·R